# భారతి

జూలై 1973



వ్యవస్థాపకులు :

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు.

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)



జూలై 1973

సంపుటము : 50 : సంచిక : 7 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1973


| | | |
|---|---|---|
| మన సంస్కృతి | డా. బొడ్డుపల్లి పురుషోత్తం | 1 |
| ప్రథమ చాళుక్య భీముడు | డా. నేలటూరు వెంకటరమణయ్య | 3 |
| అతిథులు | శ్రీ సోమసుందర్ | 13 |
| పండితరాయల మెప్పులు | డా. మహీధర నళినీమోహన్ | 15 |
| వెలుగు లోనికి | శ్రీ నూతలపాటి గంగాధరం | 27 |
| ఒకానొక పక్షి కథ | శ్రీ శేఖర్ | 30 |
| యోగప్రయోజనము | శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు | 36 |
| పిలుపు ! | శ్రీ కె. శివారెడ్డి | 40 |
| హరప్ప మొహెంజొదారొ లిపులు | శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి | 41 |
| మన ప్రకటనలు | శ్రీ పులిచెర్ల సాంబశివరావు | 53 |
| కలగూర గంప | | 59 |
| గ్రంథ విమర్శలు | | 63 |

# మనసంస్కృతి

డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం

ధర్మ సందీపితము
వాల్మీకి ఋషి కవిత;
వ్యాసముని భారతి మ
నీషా పరిభావితము'

అసమాన డా కాళి
దాస కవి సత్కృతులు
రస సముజ్జ్వలితమై
ప్రసరించు తేజమ్ము',

పాత్రలందు తాను స
ర్వత్ర లీనమౌ నొకండు;
పాత్రకొక విచిత్ర శక్తి
పాత్రతఁ గల్గించు నొకడు';

కథాకథనమందు నూత్న
విధమగు పంథాను బట్టి
శిల్ప గరిమతో ననల్ప
కల్పన గావించు నొకడు'

తన్ను గౌరవింప గోర
డెన్నడు వాల్మీకి సుకవి;
తన రాముని భజియించుటె
ఘనతరముగ నాతడెంచు'
తాను జెప్పినదియె వేద
మని వ్యాసుడు శాసించును;
తన్ను పూజచేసి, జాతి
ఉన్నతి సాధించు మనును॥

తన కావ్యములన్ పఠించి
ఘనరస ప్రవంతి మునిగి

తనరారగ ధార్మికులై
మనలంగోరు కాళిదాసు॥

మూడంతస్తులతో గూడిన
మేడ మనదు సంస్కృతిగా
ముచ్చటించి రరవిందులు
నిచ్చలు సందర్శింపగ॥

ఒక దానిని మించి వే
ఱొకటి ప్రకాశించు కతన
సకల మానవాళి మనో
వికాసమ్ము విస్తరించు॥

నాల్గవ యంతస్తు కూడ
కల్గియుండఁదగు నయ్యది
జగద్గురువు శ్రీ శంకర
భగవత్పా దాంకితమ్ము॥

అయ్యది ఆధ్యాత్మికమై
అలరారం దగును గావి
కలిసిపోయె నీ మూడిట
కలిమి బలిమి నర్పించుచు॥

భరతజాతి ఆధ్యాత్మిక
భావనకే నవజీవన
మార్గమ్మును జూపినట్టి
భర్గుండు శ్రీ జగద్గురుఁడు॥
మన సంస్కృతి, మన భావన
మన జాతికిగల విశిష్ట
తను తగ గుర్తించుటయే
మనకు ప్రధమ కర్తవ్యము॥

దీని విస్మరించు జాతి
కేనాడు విముక్తి రాదు;
ఉన్నకీర్తి సన్నగిల్లు;
మన్నింపరు జగజ్జనులు॥

(శ్రీ అరవిందుల "కాళిదాస" గ్రంథమాధారంగా)

# ప్రథమ చాళుక్య భీముఁడు

## [క్రీ. శ. 892–922]

డా. నేలటూరు వెంకటరమణయ్య

గుణగ విజయాదిత్యుని యనంతరము అతని తమ్ముడగు యువరాజ విక్రమాదిత్యుని కుమారుఁడు భీముఁడు వేంగీరాజ్యమున కభిషిక్తుఁడాయెను. ఇతని పేరు శాసనములందు సాధారణముగ చాళుక్యభీముఁడని యుండుటచేతను నా పేరిటి వేంగిరాజులలో నితఁడు ప్రథముఁడగుటచేతను నితనిని చరిత్ర పరిశోధకులు ప్రథమ చాళుక్య భీముఁడని పేర్కొనుచున్నారు. ఇతని చరిత్ర రచియించుటకు ముఖ్యసాధనములు శాసనములు—ఇవి రెండు తెరగులవి; ఇతనివి కొన్ని; ఇంను శిలాశాసనములును తామ్రపట్టికలును గలవు. తరువాతి పూర్వ చాళుక్య రాజులలో ముఖ్యముగ తామ్రపట్టికలయందు ప్రథమ చాళుక్యభీముని కాలమున నడచిన వర్తమానములను గూర్చి కొంత కలదు. లేములవాడ చాళుక్యుల శాసనములందును, పంపని విక్రమార్జున విజయమునందును, ముదిగొండ చాళుక్యుల శాసనములందును, ప్రథమ చాళుక్యభీముని చరిత్రకు సంబంధించిన విషయములు కొన్ని వర్ణింపఁబడియున్నవి.

ప్రథమ చాళుక్య భీమునివి తామ్రశాసనములైదును, శిలాశాసనములు రెండును గలవు.

1. తామ్రశాసనములు

1. బెజవాడ తామ్రపటికలు [1]ఇది బెజవాడ యందు లభ్యమైనట్లున్నది. భాష, సంస్కృతము గద్య పద్యాత్మకము; శాసనకాలమందు చెప్పియుండ లేదు; కాని చాళుక్య భీమమహారాజు క్రమపాలియగు పోతమయ్యకు దనపట్టబంధ సమయమున నుత్తర కండేరువాటి విషయము నందలి కూకిపఱ్ఱను గ్రామమును దానము జేసినట్లుండుటచేత నీ దానము పొసఁగిన శకాబ్దము 814 (గతించిన తరువాత) చైత్ర బ 2 సోమవారమునాటికి సరియైన క్రీ. శ. 892 ఏప్రిలు తే 17 ది నాటిదని తెలియుచున్నది. దాన శాసనమున కాజ్ఞప్తి పణ్డరంగని మనుమఁడగు కడెయరాజు. చాళుక్య భీముఁడీ దానమును కుసుమాయుధుఁడను నతనిచే ప్రార్థితుఁడై చేసి నట్లీక్రింది శ్లోకవలనఁ దెలియవచ్చుచున్నది.

'శ్రీమాన్ కీర్తి శశాంకరస్మి
విశదీభూతా ఖిలాశావనీ
వ్యోమా శ్రీ కుసుమాయుధేన
గుణినా విద్వజ్జనానన్దనః
వీరోऽసౌనిజ పట బన్ధ సమయే
సన్తుష్టవాన్ శాస్వతం
గ్రామం శ్రీ జయధామ
భీమ నృపతిః సంప్రార్థితో దత్తవాన్॥'

2. కసింకోట పట్టికలు; [2]కీ. శే. గురుజాడ అప్పారావుగారి సంచిత శాసనములలోనివి. కసింకోట యందు లభించినవి. శాసన గ్రంథ మసమగ్రము; కడియముపై వరాహ ముద్రయు, త్రిభువ నాంకుశ యను పూర్వచాళుక్య బిరుదును, గానవచ్చుచున్నవి. భాష సంస్కృతము—చాళుక్య భీమవిష్ణువర్ధన మహారాజు ఎలమంచిలి కళింగ దేశాంతర్గతమైన దేవరాష్ట్రమందలి 'తిని'యను గ్రామము నెవ్వరికో దానమొసఁగినట్లు కలదు. మఱియు, నితడు దాయాదు

1. ఎపి. ఇండి. సం. 5 పుట. 127.
2. C. P. 14 of 1908–9.

ఙతోగూడిన కృష్ణరాజు సేనను హతముజేసి భూమిని సంరక్షించినట్లు తెలియుచున్నది.

'యోద్ధాయాన్విజిత్య ద్విరదతురగ
సంఘోద్ధ సేనానేకా
న్నయు క్తాన్సంయుగేషు స్వభుజబల
సదసిద్ధున్ వ్యిశా సితాన్వినీత
సత్యత్యాగాది భూఖ్యద్గుణగణ సహితా
కృష్ణరాజస్య సేనాం
హత్వాసంరక్షతిస్మక్షితి పతిరఖిలాం
చారు చాళుక్య భీమః'

3. పండి పాకశాసనము. [3]దీని మాతృక యెచ్చటనున్నదో తెలియదు; మెకంజీగారి గుమాస్తాలు దీని నెచట గని ప్రతివాసికొనిరో తెలియదు. దాని కాలముగూడ నుదాహృతము గాలేదు. యువరాజ విక్రమాదిత్యునికిని వేంగాంబికకును సుతుఁడును సర్వ లోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన బిరుదాంకితుఁడును నైన చాళుక్య భీమాధిపుఁడు దనకు ఖడ్గసహాయుఁడైన రంగాధి కక్కరుఁడను పేరుగల బ్రహ్మచారికి పదునెనిమిది గ్రామములతో గూడిన పండిపాక గ్రామమును అగ్రహారముచేసి యిచ్చినట్లీ శాసనమువలన దెలియవచ్చుచున్నది.

'...పాతు విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినస్సర్వా నిద్ధమాజ్ఞాపయతి విదితమస్తు వః। కౌండిన్య గోత్రాయ వాజసనేయ బ్రహ్మచారిణేవబ్బి శర్మణః పౌత్రాయవిది శర్మణః పుత్రాయ రంగాధి కక్కరాభిధానాయ అస్మత్ఖడ్గ సహాయ నిమిత్తే సోదక పూర్వం సర్వకర పరిహారా యా। గహారీకృత్య పండిపాక గ్రామ సాష్టాదశ గ్రామాధికః। కొప్పని గ్రామాధిక పొత్తూరు పూర్వతశ్చ వల్లని గ్రామాధికచ పొదురపాక శ్చాష్టాభిః సంప్రదత్తా.' రట్టబలముల నోడించి శత్రువులను ధ్వంసము జేసి చాళుక్య భీముఁడు పటబంధము గావించుకొని శాశ్వతముగా పుడమినేలెనట.

'సోఽయం రట్టబలం విజిత్య
రిపు నిర్మూలం సముమ్మూలయన్
బధ్వాపట్టమభూద్ధనేశ సత్ప్రశో
భూపకావేరీ శాశ్వతమ్।'

4. మచిలీపట్టణ తామ్రపట్టికలు. [4]వీనికే మద్రాసు మ్యూసియం పేటికలు లేక వెడతలూరు తామ్రశాసనమనియు పేరులు. మచిలీపట్టణం కలెక్టరు కచ్చేరియందు దొరకినది. భాష సంస్కృతము. శాసనకాల మిందు చెప్పలేదు. సర్వలోకాశ్రయ శ్రీ చాళుక్య భీమమహారాజు తన కుమారుఁడైన ఇఱమర్తి గణ్డని నిత్యశ్రాద్ధ నిమిత్తమై వలువది యార్గురు బ్రాహ్మణులకు నుత్తర కణ్డేరువాటి విషయములోని వెడుతులూరు గ్రామమును అగ్రహార ముగజేసి దానమిచ్చెను. ఈ దాన శాసనమునకు ఆజ్ఞప్తి కడెయరాజు. సర్వకళాగమ కుశలకొణ్డా చార్యునిచే లిఖితము. ఇతఁడు సర్వలిపి విదుఁడఁట. శాసన గ్రంథము కవి వృషభుఁడైన భట్ట వామనునిచే విరచితము. ఇందువలన చాళుక్య భీముని రాజ్యకాలమున వడచిన విశేష చరిత్రాంశములు గొన్ని తెలియవచ్చు చున్నవి. చాళుక్య భీముఁడు కృష్ణవల్లభుని సేనల నోడించెను. 'యస్యఖడ్గజల వార్ధి నిమగ్నం కృష్ణవల్లభ బలం ససపట్నమ్ మృణ్మయన్తు చతురంగ బలం వాక్షి ప్రవేవ నిలయంగత మాజౌ' మఱియు, చాలుక్య భీముని పుత్రుఁడను ఇఱమర్తి గండాంకితుఁడైన పదునాలేండ్ల యువకుఁడు రాష్ట్రకూటులతో వక్ర పరాక్రమముజూపి నిరవద్య పుర పెరువంగూరు రణ క్షేత్రముల బోరాడి దండేన గుణ్డయయను రాష్ట్ర కూట సేనాపతిని వధించి తుదకు వీరస్వర్గమును జూఱగొనెను.

'యస్సేష్వ సప్రముక్తాదిషు బి
రభిహత ప్రష్ఠ పుణ్యవ్య ధావన్

---

3 మద్రా. గవ. ఓరియ్యా. లైబ్రరి 15—6—26, 1 పుటలు, 185–91, ఆం. సాహి. పరి. ప; సం 11, పుటలు 256–7.

4. C. P. 1 of 1913—14.

కర్ణాటాదుర్ధర భూటాలుటిత
పటునటద్భోట కాలాటకాశః॥'
............................,
'మమ ప్రియాత్మజో షోడశవార్షికః, యస్తు
... .. ......................
'నిరవద్య పురంజేకరి తురగ ధనుర్ధుర్ధర
రోగవల్లభ దండవ్
ఆ రుహ గజపతి మృగపతి
రివహారిణౌ న్వికీర్య విహసన్న ఘనత్॥
పెరువంగూర గ్రామ మరణే
వల్లభ దణ్డేణ గుణ్డయాఖ్యం హత్వా
నిర్లూట్య చ నాయా దాన
వనిమశేషాన్ని రాకులామ్మ హ్యామదాత్॥
దత్వార్థి భ్యోధనం కామమ్మహ్యా ధరి
త్రీం భయంద్విషామ్
నిత్య ష్యదితు నత్కీర్తి
న్నాకలోక మగా దసౌ॥
కటాక్షేణాపినాపశ్య
ద్వేన్యాశ్చపరయోషితః
అనుభీభత్సయా నూనమ్
చిరం సురవురా గనా॥

'తస్యదీనా నాథబంధోర్బాలాన్మవత్సలస్య। ఇతి నుత్తి గణ్డావరనామ్న శ్శుభధామ్నం పారలౌకికం కార్యం కృత్వా నిత్యశ్రాద్ధవి మిత్తే (బ్రాహ్మణేభ్యః)... ఉత్తరకణ్డేరువాటి విషయే వెడుతులూరు నామ గ్రామోదత్తః॥'.

5. అత్తిలి తామ్రశాసనము. ఇది యెచ్చట దొరకినదో తెలియదు. కీ. శే. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారు దీనిని పరిష్కరించిరి. మొదట ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికయందును తరువాత బీహారు అండ్ ఒరిస్సా రిసెర్చి సొసైటి పత్రికలోను ప్రకటించిరి. భాష సంస్కృతము, గద్య పద్యాత్మకము. కడియముపై వరాహముద్రయు 'త్రిభువనాంకుశ' యను బిరుదుమ గలవు. చాలుక్యభీమ నామధేయుడైన సవర్ణ లోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజు సమస్త గాంధర్వ విద్యావిశారదయైన చల్లవయమ భోగివీస్త్రీకి యత్తిలి విషయుమందలి యత్తిలి గ్రామమందు వెయ్యి పోకచెట్లుగల భూమియు 50 పుట్ల విత్తనము పట్టు పొలమును నివేశన స్థలమును దానముజేసెను. ఈ ధర్మమునకు ఆజ్ఞప్తి కడేయరాజు; రచయిత భట్టవామనుడు; లేఖకుడు చామి కుట్టాచార్యుడు. ఇందు దానకాలము లేకున్నను చాలుక్యభీముని పట్టాభిషేక కాలము చెప్పబడియున్నది.

'శాకేష్వబ్దేషుయాతేష్వథ మనువసు
సంప్రాప్త సంఖ్యేషుమేషే
మిత్రేచైత్రేచమైత్రే శశిదినే
కృష్ణపక్ష ద్వితీయే ।
యుగ్మేక్షణ్యోర్ద్వ మేధాత్సకల
జనముదేపట్టమా చంద్రతారం
శ్రీమాన్ చాళుక్యభీమశ్చతురదధిః
సన్మేఖలేలాతలస్య॥

దీనివలన శకాబ్దము 814 గడచిన వెనుక సూర్యుడు మేషమున నుండగా చైత్రమున చంద్రుడు మైత్రా (అనూరాధా) నక్షత్రమున మండ కృష్ణపక్ష ద్వితీయా సోమవారమునాడు మిథున లగ్నమునందు అనగా క్రీ. శ. 892 ఏప్రిలు నెల 17 వ తేదినాడు చాలుక్య భీముడు పట్టాభిషిక్తుండాయెనని తెలియవచ్చుచున్నది.

మఱియు, నితడు రాష్ట్రకూట చక్రవర్తి యగు కృష్ణవల్లభుని సైన్యము నోడించెను

'యస్యఖడ్గజ వార్ధిన మగ్నం
కృష్ణవల్లభ బలం ససపత్నం'
'మృణ్మయస్తు చతురంగబలం
వాక్షిప్రమేవ విలయం గతవాంజా.'

2. శిలాశాసనములు:—ఇవి రెండు.

1 ధర్మవర శిలాశాసనము. ఇప్పటి ఒంగోలు తాలూకాలోని ధర్మవర గ్రామమున

5 C. P. 14 of 1917–18, A. S. P. P. xi. P. 241, J. B O. R. S. VIII 83–98 st

6. A R. E 839 of 19.2, నెల్లూరు శాసనములు సం॥ 2 ఒంగో. నెం. 39 ; భారతి. సం॥ 5 పుటలు 619–20.

గలదు. భాష తెనుఁగు శిథిలము—గ్రంథపాతములు పెక్కుతావుల గలవు. 'సర్వలోకాశ్రయ......[శ్రీవ] భీమరా...జయ రాజ్య సంవత్సరంబు...[యే] వగు నేణ్టి ఉత్తరాయన స......' దీనిని వ్రాయించి నిల్పినది—శాసన పరిష్కర్తలు మల్లంపల్లి సోమశేఖరశర్మ: శాసనము వ్రాయించినది చాళుక్యభీముని 15 వ రాజ్య వర్షముననని యభిప్రాయపడుచున్నారు, అట్లైన దీని కాలము శకాబ్దము 829 అగుచున్నది. పండరంగని ప్రశస్తి కలదు. అతనికి సంబంధించిన వాడు గబోలు నన్ని నల్లాతణ్డయ్య అయ్యపరాజు తమ్ముణ్డు బెజెయ రాజు ధర్మవరమున గుడి నిలిపినట్లు చెప్పియున్నది.

2. బెజవాడ ఇంద్రకీల పర్వత శాసనము.[7]భాష తెనుఁగు చాళుక్యభీమ సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుయొక్క 17 వ రాజ్యవర్షమున చట్టపయ నతఁడు విక్రమాదిత్య కుమార విష్ణువర్ధన మహారాజు ప్రసాదమున ఇంద్రకీలముపై పార్థీశ్వర దేవాలయము గట్టించెను. శాసనకాలము శకాబ్దము 831 అగుచున్నది.

ఇతర పూర్వ చాళుక్య శాసనములలో గూడ ప్రథమ చాలుక్య భీముని విజయములను గూర్చి ప్రస్తావము గలదు. ఈ పటున బేర్కొనఁదగినవి: -

1. అమ్మరాజ విష్ణువర్ధనుని పిడూరు తామ్ర శాసనము.[8]

'తదను సవితర్యస్తంగతే తిమిరపటలే వేవ రట్టదాయాద బలేనాభి వ్యాప్తం వేంగీమండలం తదనుజ విక్రమాదిత్య సూనుశ్చలుక్య భీమాధిపోద్రో హోర్జునా పరనామాస్వప్లిక్రమైక సహాయ తరవారి ప్రభయావభాసాధి పతిరభూత్.'

2. అమ్మరాజా విష్ణువర్ధనుని మచిలీపట్టణం పటి కలు[9].

'చాళుక్యభీమ భూపాల
ధాత్రీ ధాత్రీవచాపరా
క్షమయాక్షతి యత్రపా
యా వాగీపోతిరిత్రిశుతా॥
ఆసీత్తస్యాన్సు గామ
కామ్యానామాప్పికానవా
మాతున్త్యంసవిాక్య
భీమరాజేవ యాపపా॥
సాజ్జీజనత్కు మారంభ
శక్తి యుక్తం కుమారవత్
భీమరాజస్య సేనాన్యం
మహాకాలం మహావతిమ్॥
యశ్చానేకశః॥
అన్యోన్యాస్త్ర సమయోగ
సంజాతాగ్నౌమహాహవే
స్వామినో గ్రశరో ధీరో
రిపోస్సైన్యమనీవనత్॥'

3. మల్లపదేవుని పిఠాపుర శాసనమున చాళుక్య భీముని గూర్చి యిటు చెప్పియున్నది[9]—క 'షష్ట్య త్తరం యప్రిశతం రణానాం జిత్వాస్వనామా ప్రతిధిం విధాయ చాళుక్య భీమేశ్వర దేవహర్మ్యాణం త్రింశత్సు మాభూతల మన్వకార్షీత్'

లేములవాడ చాలుక్యుల శాసనములును, పంపని విక్రమార్జున విజయమును, పూర్వ చాళుక్య శాసనము లందు కావరాని చరిత్రాంశముల గొన్నింటిని తెల్పుచున్నవి. శకాబ్దము 888 నాటి ముమ్మడి యరికేసరి పర్భణి పట్టికలయందతని పూర్వీకులలో నొక్కఁడైన బద్దెగఁడు భీముని యుద్ధమున నోడించి పట్టుకొనినట్లు చెప్పియున్నది.[10]

---

7. A. R. E. 833 of 1917, ఆం, సా పరి ప., సం. 3, పుట 227.

8. దక్షి ఇండి. శాసనములు; సం. 1 నెం 36 రు.

9. ఎపి. ఇండి., నం. 5. పుట 133, 9—క. ఎపి. ఇండి., నం 4, పుట. 234.

10. జైన్ సాహిత్య ఔర్ ఇతిహాస. నాథూరామ్ ప్రేమీ, 'సోమదేవ సూరికా, నీతి వాకామృత్, పుట 85.

'నానాదుర్ద్ధరియుద్ధలబ్ధ
విజయ శ్రీ సంగమా కర్ణవాత్
భీమః పాణ్డవ ఏన, ఇత్య
మహ్యాదోయాస్మాత్పరంబిభ్యతి
భీమం భీమపరాక్రమైక
విరయన్తం హేలయై వాగ్రహీత్
ఉగ్రంగ్రాహమివాన్తరం
బుసమరేదోర్వ్విక్రమాద్బద్ధగః॥

ఈ యంశమే ఇమ్మడి యరికేసరి భూపా పాలుని కంకితమీయఁబడిన విక్రమార్జున విజయ మునను వర్ణింపఁబడియున్నది.[11]

'వవధి పరితభూఃళ దొళితనె
సోలదగండ వెంబపెం
పివపెసరం నిమిచిఁ
దుదుమల్లదె విక్రమదింద నిందగు
వేఁనలిఱిదాంతరం మొసళెయం
పిడివంతరె నీ రౌత్తిభీ
మన నతిగర్వదం పిడియె
మెయ్గలి బద్దెగనన్న నావన్॥'

ముదిగొణ్డ చాళుక్యులు చాళుక్య భీముని బావటయై నిల్చి రట్టబలముల నోడించిరి. ఈ విష యము కొలని శిలాశాసనమున జెప్పఁబడియున్నది.

'శ్రీ విక్రమాదిత్య నృపాగ్రతవ యుణ్డయ్న చాళుక్య భీమునకు శౌచకన్దర్పునకు వేంగీశ్వరునకు రవమద్దా స్వయకుల తిలకుణ్డయ్న కుసుమాయు ధుణ్డు గన్నరబల్లహుని కన్త ప్రాప్తంబయ్న రవ మద్దక శ్రీ మధన భుజవీర్య బలపరాక్రమంబు వన్దెచ్చి కణ్మెయం గట్టిపట్టంబెత్తి ఖల్గసహాయుణై వేల యెల్లంగావంబూని మంచి కొణ్డనాణ్డాదిగ వేంగి దేశము విష్ణువర్ద్ధనుతో వర్ద్ధరాజ్యంబు సేయు చున్న కుసుమాయుధు......'[12]

ఇంతవఱకును ప్రథమ చాళుక్యభీముని చరిత్ర రచన కాధారములైన శాసనాదులు వర్ణింపఁబడినవి. ఇఁక నితని రాజ్యకాలమున జరిగిన వృత్తాంతములను వివరించి చెప్పవలసియున్నది. పెద్దతండ్రియగు గుణగ విజయాదిత్యుని మరణానంతర మితఁడు రాజ్యాధిపత్య మును వహించెను. ఇతని రాజ్యకాలమున నడచిన చరి త్రాంశములలో మొదట విచారింపదగిన దితని పట్ట బంధ మహోత్సవము. అత్తిలి తామ్రశాసనమునందు శకాబ్దము 814 సంవత్సరములు గతించిన పిమ్మట 'సూర్యుఁడుమేషమందుండఁగా చైత్రమున చంద్రుఁడు, మైత్రా (అనూరాధా) నక్షత్రమందుండ, కృష్ణ పక్ష ద్వితీయా (విదియ) సోమవారమునాఁడు మిథున లగ్నమందు చాళుక్యభీముఁడు నాలుగు సముద్రము లొడ్డాణముగాఁ గల భూమికిఁ బట్టము కట్టుకొనియె' నని స్పష్టముగ చెప్పియున్నది. 'ఇంగ్లీషు లెక్క ప్రకా రము క్రీ. శ. 892 సం॥ ఏప్రిలునెల 17 వ తేదీ నాఁడు పట్టాభిషేకము నడచెనని ఇందువలన నిశ్చయ మగుచున్నది.[13] కాని పట్టాభిషేకము గుణగ విజయాదిత్యుఁడు దివంగతుఁడైన వెనువెంటనే నడ చెనా లేక గుణగుని మరణమునకును పట్టాభిషేక మునకును మధ్య వ్యవధి యుండెనా? యనునది విచార ణీయము. ఈ విషయమునుగూర్చి శాసన సాక్ష్యము వ్యత్యస్తముగ నున్నది. పండిపాక తామ్రశాసనమున చాళుక్య భీముఁడు రట్టబలములను జయించి దాయాదు లను నిర్మూలముజేసి పట్టబంధము గావించుకొనెనని యున్నది.[14] కసింకోట శాసనమునను దీని కనుగుణ్య ముగ చాళుక్యభీముఁడు దాయాదులను రాష్ట్రకూటు లను జయించియే భూమి కంతటికిని ప్రభువైనట్లు

11. పంపభారతము, ఆ 1·26.

12. తెలంగాణా శాసనములు, ఇతర నెం. 12 రు. (రావుబహదూరు శ్రీ సి. ఆర్. కృష్ణమాచార్యులు బి. ఏ., గారిచే బరిష్కృతమైన శాసన గ్రంథము ననుసరించి)

13. ఆం. సా. పరి., పత్రిక సం. 11 పుట 245.

14. ఆం. సా. పరి. పత్రిక సం. 11 పుట 257.

చెప్పియున్నది. [14]—క ఇట్లే (మొదటి) అమ్మరాజ విష్ణువర్ధనుని యేడేఱు తామ్రశాసనమున గుణగ విజయాదిత్యుని మరణానంతరము సూర్యుఁ డస్తమించిన వెనుక చీకటివలె రట్ట దాయాద బలములు చేత వేంగి మండలము గప్పఁబడెననియు ద్రోహార్జునాపరనామధేయుఁడైన చాళుక్య భీముఁడు విక్రమైక సహాయుఁడై తన తరపువారి ప్రభచేత వారిని పాఱదోలి యధిపతి యాయెనని యున్నది.[15] మఱియుఁ గొఱవి శాసనమునందు రణమర్దాన్వయ కులతిలకుఁడైన కుసుమాయుధుఁడు కన్నరబల్లహు నోడించి యతని వశమైయుండిన రణమర్దక సీమను స్వాధీన పఱచుకొని చాలుక్య భీమునకు శౌచకందర్పునకు కంఠియం గట్టి పట్టంబుగట్టి ఖడ్గసహాయుడై వేల యెల్లం గావంబూని మంచికొండ నాండాదిగ వేంగి దేశము విషు వర్ధనుతో సర్వరాజ్యంబు సేయుచుండి నట్లున్నది. ఈ శాసనముఁ నుబట్టి చూడఁగా గుణగ విజయాదిత్యుఁడు చనిపోయెనను వార్త సోకినంతనె, రాష్ట్రకూట కన్నరబల్లహుఁడు (కృష్ణవల్లభుఁడు) వేంగిపై నెత్తి వచ్చెననియుఁ జాళుక్యభీముని దాయాదులు కొందఱతనితోఁ బ్రతిఘటించి రాష్ట్రకూటులతో నేకీభవించిరనియు, వారి నోడించి తఱుమ గొట్టునంతవఱకును చాళుక్యభీమునికి పట్టాభిషేకము జేసుకొనుటకు వీలులేకపోయెననియుఁ దోచుచున్నది.

కాని ఈ యభిప్రాయమునకు విరుద్ధముగ మఱికొన్ని శాసనములందు పట్టాభిషేకమైన తరువాతనే రాష్ట్రకూట దండయాత్ర వచ్చినట్లు చెప్పియున్నది. బెజవాడ తామ్రశాసనము పట్టబంధ సమయమున చేసిన దానమును బ్రకటించుటకు వ్రాయించబడినను అందు రాష్ట్రకూటుల ప్రస్తావనయే లేదు. కన్నరబల్లహు నోడించి చాళుక్యభీమునకే కుసుమాయుధుఁడు కంఠియగట్టి పట్టం బెత్తినట్లు కొఱవి శాసనమునందు జెప్పియున్నదో ఆ కుసుమాయుధునిచే సంప్రార్థితుఁడై యతఁడీ శాసనోక్తదానమును జేసినట్లున్నను, రాష్ట్రకూట దండయాత్రగాని వారిపై గుసుమాయుధు విజయముగాని యిందు పేర్కొనకపోవుట చిత్రమే. కాని నా కొక్కవిధమైన సమాధానము దోఁచుచున్నది. కొఱవి శాసనము రాజు వ్రాయించినది కాదు. అతని యాశ్రితుఁడైన కుసుమాయుధుని పెద్దకొడుకునకు ప్రాణసమానుఁడైన 'చెలి'యగు కొఱవి వల్లమెతెయ కొడుకు పెద్దన వ్రాయించినది. ఈ పెద్దన కుసుమాయుధుని కాశ్రితుఁడనుటకు సంశయములేదు. ఇతఁడు దాను వ్రాయించిన శాసనమున దన కాశ్రయుఁ డొనర్చిన ఘనకార్యములను బొగడి యతఁడు రాష్ట్రకూట దండయాత్రా సందర్భమున రాజున కొనర్చిన సహాయమును గొప్పచేసి చెప్పుట సహజము. బెజవాడ పట్టికలు రాజశాసనము చూడుఁడు. అందు రాజు తన కాశ్రితుఁడైన సంస్థానాధిపతిని విశేషించి ప్రశంసించవలసిన యవసరము లేదు. అతఁడు జేసిన యుపకారము ఘనమైనదే. దానికి దన కృతజ్ఞతఁ జూపుటకే యతనిచే సంప్రార్థితుఁడై భూదాన మొసఁగుట. కుసుమాయుధేన గుణినా సంప్రార్థితః అనియు తాఁ బేర్కొనుటయే యతఁ డొనర్చిన మహోపకారమును స్మరించుట. కావున బెజవాడ పట్టికలను సూక్ష్మముగఁ బరీక్షించి చూచిన నందు రాష్ట్రకూట దండయాత్రాదులు స్పష్టముగ బ్రస్తావింపబడకపోయినను గుప్తముగ సూచింపఁబడినవి. కాని యీ సమాధాన మత్తిలి తామ్రశాసనమునెడ చెల్లదు. అందు మొదట పట్టబంధమును దాని వెనుక కృష్ణవల్లభుని దండయాత్రయు, నతని పరాజయమును వర్ణింపఁబడియున్నవి. [17]పట్టబంధరట్ట దండయాత్రల పౌర్వాపర్య విషయమై శాసనములిట్లు పరస్పర విరుద్ధముగ నుండుటచేత నవి యే క్రమమున జరిగెనో నిశ్చయించి చెప్పుటకు వలనుపడక యున్నది.

---

14—క. C. P. 14 of 1908-9.

15. ఎపి. ఇండి., సం. 5 పుట 133.

16. తెలంగాణా శాసనములు, ఇతర నెం. 12 రు.

17. ఆం. సా. పరి. పత్రిక, సం. 11 పుట, 254.

ఇచట విచారించవలసిన విషయము మింకొక్కటి కలదు. పూర్వచాళుక్య శాసనములందు వర్ణింపఁబడిన రట్టులవిూఁది చాళుక్య భీముని విజయములన్నియు నొక్కదండయాత్రలందు చేకూరినవా? లేక భిన్న దండయాత్రలందు సంబంధించినవా? చాళుక్య భీముని రాజ్యకాలమున రట్టులు వేంగిపై నొక్క పర్యాయము దండెత్తివచ్చిరనియు వారి నతఁడు జయించి తఱిమివేసిన పిమ్మట యతని రాజ్యమున శాంతి యుని చ్చిన్నదై వర్ధిల్లెననియు పన్నారు శాసన శాఖావా రభిప్రాయపడుచున్నారు. కసింకోట తామ్రపట్టికలను విమర్శించుచు కీ. శే. హెచ్. కృష్ణశాస్త్రులవారిట్లు వ్రాసియున్నారు. 'అప్పారావుగారి తామ్రశాసన సంచయమువలన, నతని (చాళుక్య భీముని) యేలుబడియందు దేశమంతయు సంపూర్ణమైన శాంతిని గలిగియుండెననియు, దీనిని (శాంతిని) నెలకొల్పుటకొఱకు గాఁబోలు నతఁడు యుద్ధరంగమున శత్రుసేనా సమూహము నోడించెననియుఁ దెలియవచ్చుచున్నది. [18]ఇంతకంటె స్పష్టముగ కీ శే. చిలుకూరు వీరభద్రరావుగారు, గుణగ విజయాదిత్యుని మరణానంతరము రాష్ట్రకూట రాజైన రెండవ కృష్ణుఁడు పూర్వ వైరమును మనస్సులోఁ బెట్టుకొని యున్న వాఁడుగాన, వేంగి దేశముపై దండెత్తివచ్చి దేశమాక్రమించుకొనియెను. అప్పుడీ చాళుక్యభీముఁడు కృష్ణునితో యుద్ధముచేసి రాష్ట్రకూటులను జయించి దేశమునుండి తఱిమివేసి దేశమునంతయు స్వాధీన పఱచుకొని నిశ్చింతగా 888 మొదలుకొని 918 వఱకు ముప్పది సంవత్సరములు రాజ్యపరిపాలనము గావించెను' అని వ్రాసియున్నారు. [19]కాని వీరి యభిప్రాయ మంగీకరింప దగినదికాదు. చాళుక్యభీముని శాసనములను బరిశీలించి చూచిన నందు పేర్కొనఁబడిన చాళుక్య విజయములు రట్ట పరాజయము లన్నియు నొక్కటే దండయాత్రకు సంబంధించినవి కావని బోధపడగలదు. కొఱవి శాసనము ప్రకారము చాళుక్యభీముని పట్టబంధమునకు బూర్వము కన్నర బల్లహుఁడెత్తివచ్చి స్వాధీన పఱచుకొనినది రణమర్దక సీమమాత్రమే ఇది యల్పదేశము. కొండపల్లినుండి యోరుగంటి వఱకు దానివ్యాప్తి. కసింకోట వెడలలూరు తామ్రపట్టియందు వర్ణింపఁబడిన రట్ట దండయాత్ర ఇప్పటి పశ్చిమ గోదావరి జిల్లాలోని విడదవోలు పెదవంగూరు గ్రామముల పర్యంతము వ్యాపించినది. రణమర్దక దేశముపై నెత్తివచ్చిన రట్ట బలమెవ్వరి నాయకత్వము క్రింద వచ్చెనో తెలియదు; ఈ దండయాత్ర నెదిర్చి వెనుకకు ద్రిప్పినవారు కుసుమాయుధుఁడును, నతని యాశ్రితుఁడైన కొఱవి నల్లమెఱయకొడుకు పెద్దనయు, నిరవద్యపుర (విడదవోలు) పెరువంగూరు (పెదవంగూరు) రణక్షేత్రమునందు పోరిన రాష్ట్రకూట సైన్యములకు నాయకుఁడు గుండయ; ఇతని జంపిన్యయము స్వర్గముమ చూఱగొనిన పూర్వచాళుక్య సైన్యాధ్యక్షు డిరమర్తిగండ బిరుదాంకితుఁడైన చాళుక్య రాజకుమారుఁడు. ఈ విషయముల నన్నిటిని విచారించి చూడఁగా రట్టచక్రవర్తి రెండు పర్యాయము లెత్తివచ్చినట్లు తోఁచుచున్నది. చాలుక్యభీముని పట్టబంధమునకు ముందొక్క మాటును తరువాత వేఱొక మాటును మల్లప్పదేవుని పిఠాపుర శాసన సాక్ష్యము విశ్వాసపాత్రమగునేని, చాలుక్యభీముఁడు దన రాజ్యకాలమంతయు, శత్రువులతో నిరంతరము పోరాడుచుండెనని చెప్పవలసియున్నది. ముప్పదియేండ్ల రాజ్యకాలమున నితఁడు మున్నూటఱువది యుద్ధములు జేసెనఁట. అనగా సరాసరి సంవత్సర మొక్కటికి పండ్రెండు యుద్ధము లగుచున్నవి.[20] ఈ మున్నూటఱువది యుద్ధములును నొక్క సంవత్సరముననే నడచుట యసంభవము. కావున చాలుక్యభీముని కాలమంతయు యుద్ధములతో పరిపోయెనని తలఁచుట యుక్తము. అతనికి ప్రబలులైన ప్రధాన శత్రువులే యగుటచేత వారే సమయ మనుకూలపడినపుడెల్ల వారే పలుమారు వేంగిపై నెత్తివచ్చుచుండిరని చెప్పుట సరి.

18. A. R. E 1909. Part II. Parr 59, P. 106.

19. ఆంధ్ర కథా, సం 2 పుట 280

20. ఎపి. ఇండి., సం 4, పుట 234

రట్టదండయాత్రలను వర్ణించుటకు ముందు తత్సంబంధమైనది చర్చింపవలసిన యంశ మొకటి కలదు. ఇది యే దండయాత్రయందు నడచెనో చెప్పుట వీలులేకపోవుటచేత మొదటనే యా యంశమై చర్చించుట యుక్తమని తోచుచున్నది. లేములవాడ చాలుక్యుల చరిత్రను వర్ణించుచు మహాకవి పంపఁడు దన విక్రమార్జున విజయసేతికయందు బద్దెగని శౌర్యమును ప్రశంసించుచు, మొసలిని నీటియందు పట్టినట్లు భీముని పట్టుకొనియెనని చెప్పినాఁడు.[21] ఇట్లే క్రీ. శ. 966 నాటి ముమ్మడి యరికేసరి పర్భణి పట్టికలందు బద్దెగఁడు నీటియందు మొసలిని పట్టినట్లు యుద్ధమున భీముని బటుకొనెనని చెప్పియున్నాడు.[22] ఇట్లు బద్దెగని చేఁబటుబడిన భీముఁ డెవ్వఁడనునది మొదటి ప్రశ్న—ఇతఁడు 'పూర్వచాలుక్య ప్రథమ భీముడు కావచ్చు'నని ఫ్లీటుగా రూహించిరి[23] 'బద్దెగని చేత పట్టుబడిన భీముఁడు ప్రథమ చాలుక్య భీముఁడే కాని యన్యుఁడు కాఁడు' అని యాచార్య కే. ఎ. నీలకంఠ శాస్త్రులవారు దిటవుగా బల్కిరి.[24] వీరి వ్యక్తి నిరూపణమున మంగీకరించవచ్చును. బద్దెగఁడు ప్రథమ చాళుక్యభీమునికి సమకాలికుఁడు. గుణగ విజయాదిత్యుని కడపటి రోజులలో బద్దెగఁడతనిచేఁ బరాభవము నందెను. మఱియు నీ బద్దెగని మనుమడైన యిమ్మడి నరసింహుఁడు క్రీ. శ. 914—930 ల మధ్య రాష్ట్రకూట సామ్రాజ్యము నేలిన ముమ్మడి ఇంద్ర చక్రవర్తి కాశ్రితుడైన సామంతుఁడు; మఱియు నితని కువారుఁడైన ఇమ్మడి యుద్ధమల్లుఁ డల్పకాలమే ప్రభుత్వము సల్పినట్లు తోచుచున్నది. కాబట్టి బద్దెగ ప్రథమ చాళుక్యభీముల సమకాలికతను మన మంగీకరించవచ్చును. ఇంకను బద్దెగనిసామంత వృత్తి పూర్వ చాళుక్య రాజ్యపు బల్లి మొత్తరగడి ప్రదేశమున నుండెను. గుణగ విజయాదిత్యునిచే నితఁడు పరాభవము పొందియుండుటచే నతని మరణానంతరము వేంగీ రాజ్యాధిపత్యమును వహించిన యతని తమ్ముని కొమారుఁడగు ప్రథమ చాళుక్యభీము నోడించి తానందుకు పూర్వము పొందియుండిన యవయశస్సును బాపుకొన దలంచుట సహజము. మఱియు బద్దెగని కాశ్రయుఁడైన రాష్ట్రకూట చక్రవర్తి యిమ్మడి కృష్ణవల్లభుఁడు ప్రథమ చాళుక్యభీముఁడు రాజ్యమునకు వచ్చియు రాక మునుపే యతనిపై గత్తి దూసి వేంగిపై బలుమారు దండయాత్రలు సల్పెను. బద్దెగఁడు కృష్ణవల్లభుని కాశ్రితుఁ డగుటచేతను, నతని సామంతవృత్తి పూర్వ చాళుక్య రాజ్యముయొక్క గడిప్రదేశమున నుండుటచేతను, వేంగి పూర్వచాళుక్య రాజులపై నతని ప్రాత పగయుండుటచేతను, నతఁడు నీటియందు మొసలిని బట్టుకొనినట్లు యుద్ధమున బట్టుకొనిన భీముఁడు ప్రథమ చాళుక్య భీముఁడని యెంచుట సమంజసమే.

ప్రథమ చాళుక్యభీముఁడే బద్దెగనిచేఁ బట్టుపడిన భీముడైనచో నతఁడెప్పు డెచ్చట పట్టుబడెను? అనునది రెండవ ప్రశ్న. మనకుగల ప్రస్తుత చారిత్రక పరిజ్ఞానము నాధారపఱచుకొని యీ ప్రశ్నకు దృష్టికరమైన సమాధానము చెప్పుటకు సాధ్యము గాదు. పైఁజెప్పిన రట్టల దండయాత్రలు రెంటియందును మొదట రాష్ట్రకూటులకు జయము గలిగినది; పూర్వచాళుక్య రాష్ట్రముగూడ కొంత వారికి హస్తగతమైనది. కావున ప్రథమ చాళుక్యభీముఁడుని దండయాత్రలయందు దేనియందైనను బద్దెగనిచేఁ బట్టువడి యుండవచ్చును. కాని మొదటి దండయాత్రకంటె రెండవది బలవత్తరమైనది. రాష్ట్రకూట సైన్యములు వేంగి చాలుక్య రాష్ట్ర గర్భమును జొచ్చి

---

21. విక్ర. విజ. 1:26.

22. జైన్‌సాహిత్య ఔర్ ఇతిహాస్—నాథూరామ్ ప్రేమీ, సోమదేవసూరికా నీతివాక్యామృత. పుట 85.

23. డీభాస్టీస్ ఆఫ్ ది క్యానరీస్ డిస్ట్రిక్ట్స్. పుట 381.

24. జర్నల్ ఆఫ్ ది మద్రాసు యూనివెర్సిటీ. సం. 15 పుట. 116.

యుద్ధముల్లోనివని. ప్రథమ చాలుక్య భీముఁడు బద్దెగనిచే బందీకృతుఁడైనది యొకవేళ ఈ దండయాత్ర యందే కావచ్చును. అట్లని తలఁచుట కాధారలేశ మొకటి కానవచ్చుచున్నది. పర్భణి పట్టికలయందు-

'భీమంభీమ పరాక్రమైక నిలయన్తం
హేలయైవా గ్రహీత్
అగ్రం గ్రాహ మివాంతరంబు
సమరేదోర్వి క్రమాద్బద్దెగః[25]

అను శ్లోకపాదములందు నీటియందు మొసలిని పట్టినట్లు యుద్ధమున బద్దెగఁడు భీముని పట్టెనని యున్నది. మొసలికి నీ రాటపట్టు. నీటియందు దానికి బలమధికము; కావున దానిని నీటియందు పట్టుట కష్టతమ కార్యము. ఈ యుపమవలన బద్దెగఁడు భీముని పట్టిన దతని స్వదేశమగు వేంగియందని ద్యోతక మగుచున్నది. 'గ్రాహమివాంతరఁబు సమరే' యను మాటలీ యుద్ధము నీటియందు జరిగినదని సూచించుచున్నదని నా యభిప్రాయము. ఇది యసమంజసము గాదేని ప్రథమ చాలుక్య భీముఁడు బద్దెగనిచే జిక్కినది జలయుద్ధమునందని చెప్పవలసి వచ్చును. వేంగి సమీపమున కొల్లేరు సరస్సు మధ్యమున బలవత్తరమైన దుర్గము గలదు. విజిగీషువులైన శత్రువులు దండయాత్ర వచ్చినప్పుడు వేంగిరాజులీ దుర్గమును జొచ్చి వారిని ధిక్కరించువారు—నిరవద్యపుర పెరువంగూరు రణక్షేత్రములీ కొల్లేరు పరిసర ప్రాంతములం దున్నవి. కావున రాష్ట్రకూట సైన్యములు దేశమునంతటి నాక్రమించుకొనఁగా నాత్మ సంరక్షణార్థమీ జలదుర్గమును ప్రవేశించి యుండవచ్చుననియు నప్పుడు బద్దెగఁడు సాహసించి కొల్లేటిని దాటి భీమునా జలదుర్గము జట్టుకొనెనని యూహించవచ్చును కాని ఉక్త యూహ విశ్వాసపాత్రమైన సాక్ష్యము కాదు. కావున దానినే యూతగ గొని ఇద మిత్థమని నిశ్చయించి చెప్పుటకు వీలు కాదు.

ప్రథమ చాలుక్య భీముఁడు బద్దెగనిచే నెప్పుడో యొకప్పుడు పట్టుబడుట నిశ్చయము. వేంగిపై క్రీ. శ. 922 వఱకును రాజ్యము సేయుటవలన, పట్టుబడిన తరువాత చెఱనుండి విముక్తుఁడగుటయు నిశ్చయము. కాని యతనికీ విముక్తి యెట్లు కలిగినదో కనుగొనుటకు సాధ్యము గాదు. స్వప్రయత్నమువలన చెఱనుండి తప్పించుకొని పాఱిపోయెనా? శత్రువులతో సంధి చేసుకొనుటవలన విడుమర నందెనా? యను ప్రశ్నలకు జవాబు చెప్పుట వలను బడదు.

ఇఁక రాష్ట్రకూట దండయాత్రల వృత్తాంతమును విచారింతము. శాసనములను శోధించి రాష్ట్రకూటులు వేంగిరాజ్యము మీఁదికి ప్రథమ చాలుక్య భీముని కాలమున కనీసము రెండు పర్యాయములైనను దండెత్తివచ్చి యుండురని యింతకుముందు తీర్మానమును గావించియున్నాము.

మొదటి దండయాత్ర: ఇది ప్రథమ చాలుక్య భీముని పట్టబధమునకు ముందే జరిగెను. కొఱవి శాసనము వలన విదితమగుచున్నది. కాని యీ దండయాత్రయందు నడచిన యుద్ధవిశేషము లెవ్వియు తెలియవు. అయినను పండిపాక, కసింకోట, కొఱవి శాసనములవలన కొన్ని విషయము లూహింపవచ్చును. దాయాదులు కొందఱు ప్రథమ చాలుక్య భీముని యాధిపత్యము నొప్పుకొనక ప్రతిఘటించి రాష్ట్రకూటులఁ గూడిరి. కన్నర బల్లహుని కన్నప్రాప్తంబయ్యె రణమర్దక సీమ, యను మాటలవలన దండయాత్రయొక్క ప్రారంభ దశయందు పూర్వ చాలుక్య సేనలకు పరాజయము కలుగుటచే రాష్ట్రకూటులు వారి తూర్పున సరిహద్దు ప్రాంతమందలి రణమర్దక సీమ నాక్రమించుకొన గలిగిరి. కాని యచిరకాలముననే రాష్ట్రకూటులను దఱిమివేసి పూర్వ చాలుక్యులు కన్నర బల్లహుని కన్నప్రాప్తంబయిన రణమర్దకసీమను మరల స్వాధీనపఱచుకొనిరి. ఈ సందర్భమున ప్రథమ చాలుక్య భీముఁడు స్వయముగ రాష్ట్రకూటుల నెదిర్చి పోరెనో లేదో తెలియదు. కాని యతని పక్షమున రణరంగమున కెక్కి పోరినవా రిరువురి నిచట పేర్కొనవలసి యున్నది. వారియందొకఁడు రణమర్దాన్వయకుల

25 జైన్ సాహిత్య ఔర్ ఇతిహాస—నాథూనామ ప్రేమీ. 'సోమదేవ సూరికానీతి వాక్యామృత' పుట 85.

తిలకుఁడగు కుసుమాయుధుఁడు. శత్రు హస్తగత మైన నిజకుల క్రమాగత రాజ్యమును స్వాధీనపఱచు కొనుటకై యితఁడు దన యావచ్ఛక్తి వినియోగ పఱచి రట్టబలముతో బోరి వారిని దేశమునుండి వెడల నడచెను. కొఱవి నల్లమెత్తెయ కొడుకు మఱియొకఁడు వీరిద్దరును ప్రథమ చాలుక్య భీముని కమూల్యమైన సహాయ మొనర్చిరి. భీముఁడును వారిని తగురీతిని సత్కరించి తన కృతజ్ఞతను వెల్లడిచేసెను. కుసుమా యుధునిదన పట్టబంధ కాలమున గౌరవించి యతఁడు కోరినట్లు బ్రాహ్మణులకు భూదానము గావించెను. మంచికొండ నాడాదిగ వేంగిదేశముపై దనతో నర్థ రాజ్యముసేయ నియ్యకొనెను. ప్రథమ చాలుక్య భీముఁ ౦ గుసుమాయుధునికి జేసిన గౌరవ సన్మానములనుబట్టి చూడఁగాఁ నతనికి గద్దె యెక్కక ముందు కలిగిన యాపద యత్యంతము భీకరమైనదనియుఁ గుసు మాయుధుఁనికి చేసిన సహాయము గడుంగడు గొప్ప దనియుఁ దోచుచున్నది. కుసుమాయుధునివలె పెద్ద నయు భీమనునుకి (చాళుక్యభీముని) యందేనేక వస్తు వాహన మహోత్సవంబులు బడయుచు' 'దమయన్న రాజశ్రీకెల్ల న్దానయరుహుడై విలచెను.' మొదటి దండయాత్రనుగూర్చి యూహించి తెలిసికొన గల్గిన విషయమంతయు నింతే·

రెండవ దండయాత్ర:- మొదటి దండయాత్ర కంటె రెండవ దానినిగూర్చి మనకు విషయము మెక్కు వగా తెలియవచ్చుచున్నది. దండయాత్ర గుండయ దండనాయుని యాధిపత్యము క్రింద నడచినది.[26] శాసన పరిశోధన శాఖవారు తమ 1914 సంవత్సరపు నివేదికయందు (పేరా 5 పుట 85) వ్రాసిరి. వీని ననుసరించి కొందఱు చరిత్రకారులు వ్రాసి యున్నారు· దీనికాధారము వెడతలూరు తామ్ర శాసనములోని 'పెరువఁగూ గ్రామమరణే వల్లభదణ్డేన గుణ్డయాఖ్యం హత్వా' అనుశ్లోకపాదము—'దండేన' యను మాట వ్యక్తినామముగాదు. దండశబ్దమునకు తృతీయామేక వచనము. మఱియు వల్లభదండేన యను సమస్త పదమునకు 'వల్లభస్య దండేన' యని గ్రహించ వలయును. 'దండేన'ను 'వల్లభ'ను విడదీసిన 'వల్ల భ'కు అన్వయము కుదురదు–'పెరువంగూరు గ్రామ యుద్ధమున' (ఖఱవరిత గండఁడు) గుండయను వల్లభునియొక్క సైన్యముతోడ హతము గావించి' యని పై నుదాహృత శ్లోకపాదముల కర్థము తెప్ప కొనవలయును.

మఱియు రట్టసైన్యమునకు బాపుగ కరా టక దళమును లాటాశ్వ సైన్యమును వచ్చెను ప్రథమ చాళుక్య భీముని దాయాదులు యథాపూర్వము శత్రు వుల గూడిరి రట్టదండయాత్ర వేంగి రాష్ట్రమున ప్రవేశించి యంతర్భాగమువఱకు చొచ్చుకొని వచ్చి నది. పూర్వ చాళుక్యు లంతవఱకును శత్రులకు మాఱొడ్డి వారిని మరల్ప జాలకపోయిరి. ఇట్లు రాష్ట్రకూట సేనా సాగరమున మునిగిపోయిన వేంగి నుద్ధరించిన వాఁడు పదహారేండ్ల బాలుఁడు. ప్రథమ చాళుక్య భీముని ప్రియాత్మజుఁడు—ఈ మహావీరుని పేరేమో తెలియదు. ఇఱివత్తి గండఁడను బిరుద నామముతోడనే ప్రఖ్యాతినందెను. చెల్లా చెదరైన చాళుక్య బలముల నెల్లగూర్చి మొనకట్టి శత్రుసైన్య ములపై గవిసెను. రెండు యుద్ధములు నడచినవి. మొదట రెండవక్షములవారు నిరవద్యపురము (నిడద వోలుకడ దారసిల్లిరి. భయంకర యుద్ధము సంప్రాప్త మాయెను· ఏనుగనెక్కి ఇఱివత్తి గండఁడు మృగపతి హరిణములనువలె కరితురగ ధమర్ధర దుర్ధరోగ్ర మైన వల్లభసైన్యమును జెదరగొట్టి నవ్వెనట! కాని యా యుద్ధమున సంపూర్ణజయ మెవ్వరికిని నను కూడినట్లు తోచదు. రాష్ట్రకూట బలములు చాళుక్య సేనలను వెంటనే పెరువంగూరు గ్రామముకడ మరల ఢీకొనెను. నిరవద్యపుర రణక్షేత్రముకంటె వికట పోరు మఱియు భీకరమై నడచెను. రాష్ట్రకూటుల పక్షమున గుండయ దండనాయకుఁడు మడిసెను· లాట బలము నాశమందెను; దాయాదులు నిహతులైరి; పూర్వచాళుక్యుల పక్షమున ఇఱివత్తి గండఁడు రణ శయ్యనారోహించి వీరస్వర్గమును చూఱగొనెను·[27] కుల ప్రదీపకుఁడైన పుత్రుఁడిట్లు రణక్షితికి బలియైనను నతని యాత్మ త్యాగమువలన జాళుక్యుల స్వతంత్రము నిలిచినది; చాళుక్య భీమునికి రాజ్యము దక్కినది. అటు తరువాత నతఁడు సుస్థిరుఁడై శత్రుభయములేక పాలన గావించెను.

---

26. ఇతని పేరు దండెన గుండయ యని.

27. C. P. No 1 of 1913-14.

# అతిథులు

శ్రీ సోమసుందర్

రకరకాల కొత్త కొత్త కవితలు
నన్ను పరివేష్టించి ఉన్నా యీవేళ!
ద్రాక్షావనంలో వానవేసిన గులాబి రేకుల్ని
పురాస్మృతుల బంగరు పళ్లెరాలలో వేసి
వడ్డిస్తాను నవగీతాతిథులకు ..

శిశిరం శిరం వంచుకొని
భక్తిగా దండలు కట్టుకొని
విధేయంగా నా గుమ్మం ముందు నిలిస్తే
శిశిరాన్ని 'శశి దగ్గరకు వెళ్ల'మని
నా పరిచారిక నిశి ద్వారా కబు రంపుతాను.
మధువ్రత సందేశ మందుకొని
నాకోసం సంసిద్ధంగా ఉన్న
చైత్ర రథ మెక్కి
వెళ్లిపోతాను నిర్లక్ష్యంగా!

నా పెరటి పూలతోటకు
స్వప్న స్రవంతులు నీరు పెట్టగా
ఐతిహాసిక పూర్వదశా తమస్సరస్సుల
ప్రేతాత్మలు కావలాలు కాస్తాయి:
—దుర్దశా తుహినాల నుంచి;
—వర్తమాన ధూర్తుల తుఫానుల నుంచి;

అర్ధరాత్రి వేళలో
అనంతోపగూహ బిబ్బోకహేలలో—
తడిసి బరువెక్కిన చేతు లేవో
నా తల వాకిలి తలుపులు దభీ దభీ గుద్దుతాయి;
బందిఖానాల నుంచి
పారిపోయి వచ్చిన ఈదురుగాలులు
భయం భయంగా నక్కుతూ వస్తూంటే—

మంచు తుఫాన్ను తరుముకు రాగా
గబుక్కున నా వీధి వసారాలోని కెక్కేస్తాయి...

నా పడక గది కిటికీ దగ్గరి పొగడచెట్టును
సుతారంగా సూర్యుడు కొమ్మలు వంచి
దాని మేనంతా నిమురుతాడు...
చిగురాకుల కపోలాలను
చమత్కరించేలా చుంబిస్తాడు!
రాత్రి ఒంటరిదై నిలచిన వకుళ
గవాక్షంలోనికి పూల పెదవులను జొనిపి
తెల్లవార్లూ తన రహస్య వేదనలు
వినిపిస్తూనే ఉంటుంది పాపం!

ఏకాంతంలోకి మేలుకొని
బిక్కుబిక్కుమంటూ చూరులు పట్టుకొని
వ్రేలాడుతున్న దిక్కులేని
పొగమంచు నీడలతో—
రాలి మట్టిలో కలసిన
గులాబి రేకుల ప్రణయగాథా రహస్యాలు
చెప్పి వైరాగ్యం బోధిస్తామ!
నా పాదాల క్రింద మట్టి
మృత్యువును చూపిస్తుందేమోననే
నే నెప్పుడూ చెప్పుల చడావుల జోడును
విడవనే విడవను!

—



# పండితరాయల మెప్పులు

## డా. మహీధర నళినీమోహన్

ఆదికూర్మం

ఒకనాడు మహారాష్ట్ర దేశంనుంచి నీలకంఠ దీక్షితులు అనే మహాపండితుడు ఢిల్లీ దర్బారుకి వచ్చాడు. ఆనాడు జగన్నాథుడు సభలో లేడు. ఇంటి దగ్గర జ్వరంతో మంచంలో పడి ఉన్నాడు. నాటికి మూడో లంఖణం.

ఒక్క జగన్నాథుడు లేకపోతే మించిపోయిందా, ఇంకా ఇందరు పండితులు ఉండనే ఉన్నారుకదా, అని వాదం మొదలుపెట్టించాడు షాజహాన్. నీలకంఠ దీక్షితులు తర్క వ్యాకరణ వేదాంతాల్లో ఏకసమయంలో సవ్యసాచిలా విక్రమించాడు. ఆస్థాన పండితు లంతా మొగాలు వేలవేయగా, అప్పటికప్పుడు పల్లకీమీద జగన్నాథుణ్ణి దర్బారుకి పిలిపించారు. జగన్నాథుడు లేవకకుండా నిశ్చలుడై దీక్షితుల్ని ఎదిరించాడు. రెండు మత్తేభాలు ఢీకొన్నట్టు ఉంది దర్శకులకు. వారిరువురి అసాధ్యపు రాకడలు, యుక్తులు, ఎత్తులు ఆశ్చర్యకరంగా ఉన్నాయి అర్థం అయిన వాళ్ళకి.

నాలుగ్ఘళ్ళ పొద్దెక్కేసరికి అంతవరకూ దీర్ఘాలోచనలో ఉన్న నీలకంఠ దీక్షితుని మొగం విప్పారింది. కర్తవ్యం బోధపడింది. వెంటనే దోసిలి ఒగ్గి 'జితోఽస్మి' అన్నాడు. 'తమ శిష్యునిగా అనుగ్రహించండి' అన్నాడు. చెమర్చిన కళ్ళు తుడుచుకుంటూ జగన్నాథుడు దీక్షితుల్ని గాఢాలింగనం చేసుకున్నాడు.

సభా గౌరవాన్ని కాపాడినందుకు బ్రహ్మానందపడి సార్వభౌముడు జగన్నాథునికి పండిత రాజబిరుద ప్రదానం చేశాడు. ఆ సందర్భంలో జగన్నాథుణ్ణి కూర్మావతారం ఎత్తిన విష్ణుమూర్తితో పోలుస్తూ నీలకంఠ దీక్షితులు ఆశువు అందుకున్నాడు.

భూభారాన్ని వహించలేక ఆదిశేషుని వేయి పడగలు చిత్తు అయిపోగా, దిగ్గజములకు ముచ్చెమటలు పట్టగా, ఆదివరాహపుకోరలు కదులాడిపోగా, నేనున్నానని నిశ్చలంగా నిలబడి తన వీపుమీద ఆ మహాభారాన్ని అవలీలగా మోసి, మాట దక్కించిన ఆదికూర్మమును కన్న తల్లి ధన్యురాలు ఈ లోకంలో బిడ్డలను కన్నతల్లులు ఎందరు లేరు? వారిలో ఎవరికైనా ఇంతటి సౌభాగ్య సంపద లభించిందా?

శార్దూల విక్రీడితం

పుత్రిణ్యః కతినాత్ర సంతి భువనేఽ
భూవన్ కియత్యోఽథవా
సౌభాగ్యైక మతీ తథాధిక మతీ
స్త్రీషు ప్రశంసాస్పదమ్
భగ్నే భోగిని భంగురేషు కరిషు
భ్రష్టోత్సవే దంష్ట్రిణి
క్ష్మోణీం సాహసికాగ్రణీ స్తులయితుం
జాగర్తి యస్యాః సుతః

మత్తేభ విక్రీడితం

ఇలలో నెందరు లేరు పుత్రవతులు?
ఏదీ యిట్టి సౌభాగ్య మ
న్యులకున్? ఆదివరాహదంష్ట్రలకు
సుళ్ళాగాడ, దిగ్నాగముల్
కలగన్, శేషుని శీర్షముల్ వడక
శాక్ష్మామండలిన్ మోయ ని
శ్చలుడై నిల్చిన కూర్మనాథు జననీ
సౌభాగ్య మూహించెదన్.

* * *

తనతో వాదించే సమయంలో ఆవేశం మచ్చుకైనా కనబడకుండా, చిన్నపిల్లలతో ఆడుతున్నట్లు అనాయాసంగా, అలవోకగా ఢీకొన్నప్పటి జగన్నాథుని ప్రవృత్తిని చూచి, ఆశ్చర్యపడి, పండిత రాయల ప్రతిభను పొగుడుతూ నీలకంఠ దీక్షితులు అన్యాపదేశంగా ఇల్లా అన్నాడు.

వీపుమీద పర్వతరాజం గిరగిరా తిరుగుతూ ఉండగా, పైన మహాసముద్రం గర్జిస్తూ ఉండగా, ఆ పైన బడబానలం మండుతూ ఉండగా విషాదంగాను పడకుండా, మెడ జాపి, నిద్రమత్తుతో మూడిన కళ్లతో సముద్రపు దొన్నెలో పండుకుని ఉన్నాడు కూర్మావతారం ఎత్తిన విష్ణువు.

హారిణి

ప్రమతి గిరిరాట్ పృష్ఠే గర్జ
త్యుపర్యపి సాగరో
దహతి వితత జ్వాలా జాలో
జగంతి విషానలః
పతువినిహిత గ్రీవాకాండః
కటాహ కుటోదరే
స్వపితి భగవాన్ కూర్మోనిద్రా
భరాల సలోచనః

మత్తేభ విక్రీడితం

మరుగుల్ ద్రక్కుచు సాగరుండు
నుయువన్ ఘూర్ణిల్ల, పృష్ఠమ్మునన్
గిరి రాజేంద్రుడు తాండవింప,
బడబాగ్నిజ్వాల లోకమ్ముఁ
మరణింపన్, మెడ సాచి మోడ్పు కనులన్
వారాశి భాండోదరాం
తర పీఠిన్ భగవాముడాది
కమఠాధ్యక్షుండు నిద్రించెడిన్.

* * *

ఆదిశేషుడు

నీలకంఠ దీక్షితుల్ని సాదరంగా చూస్తూ, సభలో ఆసీనులై ఉన్న తక్కిన పండితులను గుచ్చిగుచ్చి చూస్తూ, జగన్నాథుడు ఇల్లా అన్నాడు.

కప్పలని మింగడంలో మాత్రమే వేర్పుగల పాములు లెక్కలేనన్ని ఉన్నాయి. భూభారాన్ని వహించగల సామర్థ్యంగల పాము ఆదిశేషు డొక్కడే.

అనుష్టుప్

బహవః ఫణినః సంతి
భేక భక్షణ తత్పరాః
ఏక ఏవహి శేషోఽయం
భూభార వహన క్షమః

ఆట వెలది

భేకభక్షణైక విద్య గరిష్ఠమ్ము
లెన్నియేని గలవు పన్నగములు
ధరణి బరువునెల్ల తల దాల్పగలుగువా
డాదిశేషు డొక్కడన్య మెవరు?

* * *

గరుత్మంతుడు

పదవాక్య ప్రమాణ పారీణుడైన పేరమ భట్టుతో వాదించడానికి వచ్చి హరిదీక్షితులు అనే పండితుడు ఆదిలోనే మొగం వేల వేసిన సందర్భంలో జగన్నాథుడు తన తండ్రిని గరుత్మంతునితోనూ, ప్రతికక్షిని దోమపిల్లతోనూ పోలుస్తున్నాడు.

పదునైన తన ముక్కు కొనచే అవలీలగా సర్పరాజు శిరస్సును చీలికలు చేసెయ్యగలిగిన, ఆకాశం అంతా తానే అయి విక్రమించే ఖగపతి అయిన గరుత్మంతునికి, ఓ దరిద్రుడి పూరిగుడిసె ముందు పెరిగిన గడ్డిలో ఇప్పుడిప్పుడే కళ్లు తెరిచిన దోమకూన వల్ల పరాభవమా? బాగు బాగు.

శిఖరిణి

విజిత్రోటీ కోటీ త్రుటిత
ఫణి రాజన్య శిరసః
శకుంతానాం పత్యు ర్గగనతల
జంఘాల గరుతః

దరిద్ర గ్రామీణ స్థవిర
శిబిర ప్రాంత పటల
చ్ఛిద్రాగ్రే జాగ్రద్బి ర్మశక
శిశుభిః కః పరిభవః

**శిఖరిణి**

కరాళ స్ఫ్యత్కోటీ కటు పుట
తటచ్ఛిన్న ఫణి రా
ట్పరస్కన్, వ్యోమాధ్వన్స్థిరు,
విహగ సమ్రాట్టు నహహా
దరిద్ర గ్రామీణ స్థవిర
శిబిర ప్రాంత వివర
న్మరుద్వీచీ చంచన్మశక
శిశువే రీతి గెలుచున్?

• • •

**సజ్జనులు**

చదువు చెప్పేటప్పుడు శ్రద్ధగా వల్లించ నందుకో, తప్పులు పోయినందుకో, మరో మరో కార ణానికో పేరమభట్టు కొడుకులనూ, శిష్యులనూ తిట్టేవాడు. కొట్టేవాడు. గట్టిగా అందరి ముందు దండించినందుకు తండ్రిమీద అలిగి రామచంద్ర భట్టు ఒక నాటి రాత్రి ఇంట్లోంచి పారిపోవాలను కున్నాడు. ఈ సంగతి తెలిసి జగన్నాథభట్టు తమ్ముణ్ణి వారిస్తున్నాడు.

కాస్త పనికి వస్తాడన్న వాడినే గురువులు కఠి నంగా పరుషంగా దండిస్తూ ఉంటారురా. ఎందుకు కొరగాని వాడి జోలీ శొంఠీ ఎవడికి కావాలి? రత్నా లను సానబట్టినప్పుడేకదా మహారాజుల కిరీటాలమీద ప్రకాశించేది?

**ఉపజాతి**

గీర్భిర్గురూణాం పరుషాక్షరాభి
స్తిరస్కృతా యాంతి నరామహత్త్వమ్
అలబ్ధశాణోత్కషణా న్నృపాణామ్
నజాతు మౌళౌ మణయో వసంతి.

**కందము**

గురువెవ్వని నిరసించునొ
పరుషోక్తుల వాడె గొప్పవాడగు నెపుడున్
అరుగ బడకున్న విలువనె
వరనాథుల మౌళిమీద నవరత్నంబుల్?

ఇన్నాళ్లు అయినా నీకు నాయనగారి తత్త్వం అర్థం కాలేదుట్రా? ఆయన మాట పెళుసు. మనసు మాత్రం వెన్న. పైకి ఎంత దుర్నిరీక్ష్యంగా కనిపి పిస్తారో లోపల అంతటి ఆర్ద్రత. ఆయన కోపం ముక్కుమీద మాత్రమే. హృదయం నిండా అమృ తమే. పైకి తియ్య తియ్యగా మాటాడుతూ లోపల నుంచి గోతులు తీసేసే ధూర్తులకి ఆయన స్వభావం సరిగ్గా తలకిందులు.

పైకి చురకత్తిలాగా, భయంకరమైన తాచు పాములాగా కనిపిస్తూ అంతరంగంలోమాత్రం ద్రాక్షా రస సన్నిభంగా ఉండే మహానుభావులకి చెయ్యెత్తి నమస్కరిస్తాను.

**ఆర్యా**

ఉపరికరవాల ధారా
కారాః క్రూరా భుజంగ మపుంగ వాత్
అంతస్సాక్షాద్ద్రాక్షా
దీక్షా గురవో జయంతి కేపి జనాః

**ఆటవెలది**

ఖడ్గధారవోలె కాలనాగుల వోలె
పైకి క్రౌర్యముట్ట పడగ దోచి
అంతరంగమందు నత్యంత మృదువు తా
దొడ్డవారి కేనుదోయి లింతు

* * *

**తుమ్మెద**

మళ్లీ ఎక్కడికి పోయావురా? అంబాజీపేట కేనా?' అని అడిగేడు జగన్నాథుడు, రెండు రోజుల తరవాత కనిపించిన వెంకటశాస్త్రిని,

'కాదు గన్నవరం' అన్నాడు శాస్త్రి కళ్లు చిగిలిస్తూ.

'కొత్తపిట్టలన్నమాట.'

'మరీ ఒకళ్లమీాదే ఆధారపడితే ఇబ్బందికదా!'

'భేష్! అల్లా ఉండాలి రసికత అంటే' అని మిత్రుని బుజం తట్టేడు జగన్నాథుడు.

ఓ తుమ్మెదా! రసికావతంసా! నీ చాతుర్యం అద్భుతం! సూర్యుడు వెలుగుతున్నప్పుడు పద్మినులతో రమిస్తావు. చంద్రుడు వెన్నెల కురిపిస్తున్నప్పుడు కలువలతో కులుకుతావు. సెబాష్!

రథోద్ధతా

చంచరీక! చతురోఽసి చంద్రికా
వైభవే కుముదినీం నిషేవసే
భాస్కరే జయతి పుష్కరే కరై
రున్మిషన్న వదశేఽనురజ్యసే.

ఆటవెలది

చంచరీక' నీదు చాతుర్య మేమందు
వెన్నెలందు కలువ కన్నియలను
పగలు పగలుపోవు పద్మినీ గణముతో
మేలమాడుచును రమించు చుందు.

* * *

సంపెంగ

తురకపిల్లతో సంబంధం ఉన్నదన్నే నెపంతో పండితరాయలని బ్రాహ్మణ్యం వెలివేసింది. ఇతడి ఇంటికి విభూతి పెండెకట్లు. పిలకలూ, జంధ్యాలూ, బిళ్ల గోచీలూ రావడం మానేశాయి. ఉప్పూప్రతీలేని ప్రతీవాడింట్లోనూ ఏ శుభా శుభ కార్యం జరిగినా ముసిరే ఈ జనాభా తన ఇంటికి రావడం లేదే అనే చింత లోలోపల జగన్నాథుణ్ణి బాధించక పోలేదు. ఈ సంగతి గ్రహించిన లవంగి అతడిని ఊరడించింది. 'దేశవ్యాప్తమైన మీా కీర్తి చంద్రికలముందు తన కీర్తి కొంత వెల వెలబోతోందని పాదుషా వారే ఉడుక్కుంటున్నారు తెలుసా' అన్నది మాట మరిపిస్తున్నట్లు.

పండితరాయలు మందహాసం చేశాడు.

లోకంలో మల్లె, మామిడి, లవంగం, లవలి వంటి మొక్కలు, తీగలు ఎన్నెన్నో ఉన్నాయి. వాటి మీాద ప్రతిరోజూ తుమ్మెదలు గుంపులు గుంపులుగా వచ్చి వాలుతూనూ ఉన్నాయి. కాని, ఈ సంపెంగకి ఉన్న సౌభాగ్యం వాటికి ఏదీ? ఏమిటా సౌభాగ్యం? ఆసంపెంగ మొగ్గలోపలి రేకుల బంగారు రంగును తమ శరీరపు . రంగుతో పోల్చుకుని, అసూయతో రాజకన్యలు వులుకూ వులుకూ చూస్తున్నారు. చాలదూ?

శార్దూల విక్రీడితం

సంత్యేకేఽపి మహీరుహాః ప్రతిదినం
సంసక్త మత్తాళయః
తత్రా దృగ్గుణినో లవంగలవలీ
మాకంద కుందాదయః
ఆశాస్యం జనురస్య చంపకతరో
యత్కోర కాంతర్దళం
స్వైరంగైరుపమాయ రాజరమణీ
సాసూయ మాలోకతే.

ఉత్పలమాల

తుమ్మెద గుంపు ఝుమ్ముమని
త్రుళ్లుచు ప్రేలుచునుండు ధారుణీ
జమ్ములనేకముల్ కలవు జాజులు,
మల్లెలు, మామిడుల్, లవం
గమ్ములు—కాని నీ కుసుమ
కాంచన వర్ణము నాత్మ గాత్ర వ
ర్ణమ్మును పోల్చ సిగ్గగును
రాజకుమార్తెలకెల్ల సంపగీ!

* * *

మలయపర్వతం

మహామహోధ్యాయులు ఉపద్రష్ట పేరమ భటుగారి బోధనాశక్తి అపూర్వమైనది. మిగిలిన

గురువులందరూ తెలివైన కుర్రవాళ్లని మాత్రమే పండితులను చేయగలిగితే, పేరమభట్టు మొద్దులను కూడా పండితులను చేయగలడట! పాషాణంలోంచి పీయూషం పిండగల అద్భుత ప్రజ్ఞావారిది. వారి సాహచర్య మాత్రంచేత బుద్ధి వికసించేదట. ఈ విషయాన్ని పండితరాయలు ఇల్లా వర్ణించాడు.

అనుష్టుప్

> పాషాణా దపి పీయూషం
> స్యందతే యస్య లీలయా
> తం వందే పేరు భట్టాఖ్యం
> లక్ష్మీకాంతం మహాగురుమ్.

తేటగీతి

> పనికి రాలిన పాషాణ పంక్తులైన
> ఎవని శేముషిచే సుధాద్రవము జిమ్మె
> అట్టి మా తండ్రి పేరమభట్టు గొలుతు
> పరమ గురుని, లక్ష్మాంబికా ప్రాణనాథు.

అటువంటి పినతండ్రిని మలయ పర్వతంతో పోలుస్తున్నాడు జగన్నాథుడు.

బంగారుకొండ, వెండికొండ మొదలైన ప్రసిద్ధ పర్వతాలు ఎన్నెన్నో ఉన్నాయి లోకంలో. ఆ కొండల మీద మొలిచిన రకరకాల వృక్షాలు ఆయా వృక్షాలుగానే మిగిలిపోతాయి. వాటికి విశేష శక్తులు ఏవీ అబ్బవు. కాని, మలయ పర్వతంమీద పుట్టిన కొడిసె, వేపవంటి క్షుద్రమైన వృక్షాలుకూడా మంచి గంధపు వాసనలు విరజిమ్ముతాయి. అదీ చమత్కారమంటే. కనుక పర్వతరాజు ఎవరయ్యా అంటే మలయ పర్వతాన్నే పేర్కొనాలి.

మలయ పర్వతంమీద మంచి గంధపుచెట్లు విస్తారంగా ఉంటాయనీ, చందన వృక్షాల సమీపంలో పెరిగిన చెట్లకన్నింటికీ సువాసన అబ్బుతుందనీ కవి సమయం

వసంత తిలక

> కింతేన మేరు గిరిణా రజతాద్రిణావా
> యత్రాశ్రితాశ్చ తరవస్తరవస్త ఏవ
> మన్యామహే మలయ మేవ యదాశ్రయేణ
> శాఖోట నింబకుటజా అపి చందనంతి

ఉత్పలమాల

> కొండల లోపలన్ పసిడి కొండయు
> చల్లని వెండి కొండయున్
> మెండుగ వాసిగాంచె, అట నెక్కొను
> వృక్షము లెల్లవార్పు లే
> కుండు—తలంతునే మలయ మొక్కటి
> యేగిరి రాజమంచు నే
> కొండను మంచి గంధములగున్
> కుటజమ్ములు వెర్రి వేపలున్.

* * *

కాలమేఘం

జగన్నాథునికి ఇంతవరకూ తగిన ఆలంబనం ఏదీ దొరకలేదు. ఎన్ని సంస్థానాలు తిరిగేడో లెక్క లేదు. విరక్తిపుట్టి, తిరిగి కోనసీమకు పోదామను కుంటూండగా కామరూప దేశాధీశుడు ప్రాణనారాయణుడు ఉదారుడనీ, పండిత పక్షపాతి అనీ, రసికుడు అనీ విని ఆ రాజును చూడబోయాడు. ప్రాణ నారాయణుడు ఇతడికోసమే ఎదురు చూస్తున్నట్లు బహు గౌరవాదరాలతో ప్రత్యుత్థానం చేశాడు. అనుకోకుండా లభించిన ఈ ఆలంబనానికి జగన్నాథుడు పరవశుడై పోయాడు. ఎండిపోబోతున్న అతడి ఆశాలత చిగుళ్లు వేయసాగింది.

అది మండు వేసవి. భూమి అంతా బీటలు వారింది. వడగాలి దుస్సహంగా వీస్తోంది. చావడానికి సిద్ధంగాఉన్న సంపెంగ మొక్కకీ ఓ చెంబెడు నీళ్లు పొయ్యాలనే వివేకమైనా లేకపోయింది తోట మాలికి. అంతలో దేవుడు పంపించినట్లుగావచ్చి, అమృతంలాంటి నీటి చినుకులు చల్లేవు. ఎంత దొడ్డ దానివి మేఘమా!

శార్దూల విక్రీడితం

> ఆ రామాధిపతి ర్వివేక వికలో
> నూనం రసా నీరసా

వాత్యాభిః పరుషీకృతా దశదిశ
శ్చండా తపోదుస్సహాః
ఏ వంధ న్వని చంపకస్య సకలే
సంహార హేతావపి
త్వంసించన్నమృతేన తోయద!
కుతోప్యా విష్కృతో వేధసా

**ఉత్పలమాల**

చండకరుండు నిప్పుకల జల్ల
దొండగెను, బీటలయ్యె భూ
మండలమెండి, తోట యజమాని
వివేకములేనివాడు, ది
జ్మండల మూర్పులూర్చె సుడిగాలికి
సంపగి చావనుండ నెం
దుండి విధాతనిన్ బనిచెనో ఘనమా!
అమృతంబు జల్లగన్.

* * *

**గజముత్యం**

ప్రాణ నారాయణుడూ, జగన్నాథ భటూ ప్రాణ స్నేహితులై పోయారు. దానికి గుర్తుగా 'ప్రాణాభరణం' అనే కావ్యం వ్రాసి ఆ రాజుకి అంకితమిచ్చాడు.

మాటల సందర్భంలో జగన్నాథుడు దక్షిణ దేశంలోపడ్డ అవస్థలూ, పొందిన తిరస్కారాలూ విని, ఇటువంటి విద్వత్కవిని ఆదరించలేని రాజులే గాని ఈ అవమానం జగన్నాథునికి కాదు అన్నాడు రాజు.

'కుత్స్న్యాస్స్యః కుపరీక్షకైర్న మణయో యై ర్ఘతః పాతితాః' అని భర్తృహరిని స్మరించాడు.

ఏనుగు తలలోఉండే ఓ ముత్యమా! మత్తేభ కుంభస్థలాన్ని పగలగొట్టి, అవురావురుమంటూ మాంసం తినడంలోనే ఆసక్తిగల సింహం నిన్ను పక్కకి తోసేస్తే తోసేసిందిలే. అనాగరికులైన కిరాతులు రంగురంగుల గింజలను వెతుక్కుంటూ, కిందపడిఉన్న నిన్ను పనికిరాని వస్తువుగా భావించి వదలిపెట్టి వెళ్లిపోతే పోనీ. దానివల్ల నీ గౌరవానికి ఏం లోపం?

**ఉపజాతి**

ముక్తాఫల! త్వామిభ కుంభ సంస్థమ్
పంచాననో ముంచతు మాంస లోభీ
కిరంతు గుంజా భరణాః కిరాతాః
కిం తేన హీయేత మహార్ఘతాతే?

**ఉత్పలమాల**

ఏనుగు మస్తకమ్మున వసించెడు
చక్కని ముత్తియంబు! పం
చానన మిష్ట మాంస రుచియందు
తగుల్కొని నిన్ను మానినన్
మానుముగాక, గింజలను
మాలలుగా ధరియించు చెంచెతల్
పూనరు గాక, నీ ఘనతలో
లవలేశము దీన తగ్గునే?

* * *

**మామిడిచెట్టు**

కామరూపంలో ఆరు మాసములు ఉండి, ప్రాణ నారాయణుని ఆదరాభిమానాలచే సంతుష్టుడై అయన దగ్గర సెలవు తీసుకుని వారణాసికి బయలుదేరాడు జగన్నాథుడు.

వేసవిలో మిట్టమధ్యాహ్నపు ఎండలో అలిసి పోయివచ్చి, దట్టమైన మామిడిచెట్టు నీడలో విశ్ర మించి, అలసట తీర్చుకుని, తిరిగి ప్రయాణమై వెళ్లబోతూ బాటసారి ఆ మామిడిచెట్టు కేసి మరో సారి చూచినట్లు ప్రాణ నారాయణుని కేసి కృతజ్ఞ తతో చూచాడు.

చెమటలు తగ్గేయి. అలసట తీరింది. దాహ శాంతి అయింది. నీ పలవలలోనుంచి తరుచుగా విన వచ్చిన కోకిల కూతలచేత బ్రహ్మానందం అయింది చాలా సంతృప్తి కలిగింది. తుమ్మెదల ఝుంకారాల చేత, రకరకాల పక్షుల కువకువలచేత బహుసుందర మైన ఓ మామిడిచెట్టూ! నీకు శుభం అగుగాక వెళ్లి వస్తాను. సెలవా మరి.

శార్దూల విక్రీడితం

శాంతా ఘర్మకణాః శ్రమః శిథిలిత
స్తీర్ణ స్తృషోద్గమో
వారంవార ముదార కోకిల రవై
రానందితం మానసమ్
సర్వం ప్రాప్త మభీప్సితం
తవతలే చూత! ప్రసన్న ద్విజ
శ్రేణీ గుంజిత రంజితా ఖిలమనో!
యామోవయం స్వస్తితే

మత్తేభ విక్రీడితం

శ్రమ నిశ్శేషితమయ్యె, దప్పిక నివారం
బయ్యె, దేహమ్మునన్
చెమటల్ తగ్గె, ముహూర్ముహుః పరభృత
శ్రేణీకుహూంకారతన్
ప్రమదంబందె మనంబు, తృప్తి కలిగెన్
త్వచ్ఛాయలో మామిడీ!
సుమనోరంజని! యింక మాకు సెలవా?
సుశ్రేయముల్ నీ కగున్.

* * *

ప్రయాణాలలో మనకి ఎందరెందరో వ్యక్తులు ఎదురవుతూ ఉంటారు. వాళ్లతో కాలక్షేపంకోసం లోకాభిరామాయణం సాగుతూ ఉంటుంది. కాని, ప్రయాణం పూర్తిఅయి ఇంటికి వెళ్లిన కొన్నాళ్ల తరవాత ఆ వ్యక్తులెవరూ సాధారణంగా గుర్తుండరు. కాని, మళ్లీ మళ్లీ గుర్తుకువచ్చే వ్యక్తి నూటికీ కోటికీ ఒక్కడు ఉండవచ్చు అతడే ధన్యుడు. ప్రాణ నారాయణుడు అటువంటి మిత్రుడు అయాడు జగన్నాథునికి.

ప్రతీదారి పక్కనీ చెట్లు కావలసినన్ని కని పిస్తూ ఉంటాయి. బాటసారులకి అవి నీడను ఇస్తూనూ ఉన్నాయి. కాని, బాటసారి ఇంటికి చేరు కున్నాకకూడా మళ్లీ మళ్లీ జ్ఞాపకం వచ్చే చెట్టు బహు అరుదుగా ఉంటుంది. అదే ధన్యమైనది.

ఆర్య

అధ్వన్యధ్వని తరవః
పథి పథి పథికైరుపాస్యతే ఛాయా
విరళః సకోపివిటపీ
య మధ్వగో గృహాగతః స్మరతి

చంపకమాల

తరువులనేకముల్ కలవు దారుల వెంబడి
నెందు జూచినన్
తెరువరికిన్ శ్రమంబుడుపు నీడ నొసంగిన
వయ్యు నింటికిన్
మరలిన వెన్క సైతమును మానస వీడని
బాటసారికిన్
తరచుగ గుర్తువచ్చు తరునాథుడు
నూటికి కోటి కొక్కడే!

* * *

బొగడచెట్టు

ఒక్కొక్క వ్యక్తి చిన్న వయస్సులో అతి సామాన్యుడుగా—లేకపోతే కాస్త మందమతిగా— కని పించవచ్చు. అతడిమీద తల్లిదండ్రులుగాని, గురువులుగాని ప్రత్యేక శ్రద్ధ ఏమీ చూపించక పోవచ్చు. అతడు గాలికి పెరుగుతాడు. వాడే పెద్దవాడయాక తన అపూర్వ ప్రతిభతో అందరినీ ఆశ్చర్య చకితులను చేస్తాడు. తన కుటుంబానికీ, వాడికీ, దేశానికీ ఎంతో వన్నెతెస్తాడు.

తోటమాలి ఒక చిన్న బొగడమొక్కను తెచ్చి, ఉద్యానవనంలో ఓమూలగా పాతేడు. దానికి ప్రత్యేకంగా ఎరువు వెయ్యడంగాని, కుదురువేసి నీళ్లు పోయడంగాని, ఏమీ చెయ్యలేదు. దాని మాటే మరిచి పోయారు అందరూనూ. అంతలో అది పెద్దదై, గుత్తులు గుత్తులుగా పువ్వులు పూచి, తన పూల వాసనలతో దిగంతాలనుకూడా సురభితంచేసి, తుమ్మెదల ఝంకారాలతో వనమునంతనూ ముంచెత్తేసింది.

శిఖరిణి

దధానః ప్రేమాణం తరుషు
సమభావేన విపులామ్

సమాలా కారోసావకృత
కరుణాం బాలవకుళే
అయంతు ద్రాగుద్యత్కుసుమ
సకరాణాం పరిమళై
ర్దిగంతా నా తేనే మధుప కుల
ఝంకార భరితాన్.

చంపకమాల

వనమున గల్గు వృక్ష సము
దాయము నెల్ల సమాన దృష్టితో
మనిచెనె గాని తోట యజమాని
విశేషపు దోహద క్రియల్
పొనరుపడాయె నీ బొగడ
మొక్కకు, అయ్యును నద్ది దిక్తట
ప్రణుత పరిమళ ప్రసవ
రాజిని రాజిలె తేటి పాటలన్.

*　　*　　*

మందమతి అని నిర్లక్ష్యం చేబడ్డ క్రూరవాడు అప్రతిమాన ప్రతిభావంతుడై కళ్ళు జిగేల్ మనిపించే సరికి ఆశ్చర్యంతోబాటు, అలక్ష్యం చేశామే అని ఆదరంతో కూడిన సిగ్గున్నా కలుగుతుంది.

ఓ సంపెంగచెట్టూ! అతిసాధారణమైన చెట్టు వని భ్రమపడి నీకు ఇంత కుదురున్నైనా చెయ్యక పోతినే. సువాసనలతో మైమరపింపజేసే నీ పువ్వులను చూస్తూఉంటే నాకు సిగ్గుగా ఉందే—అంటున్నాడు తోటమాలి కళ్ళు నేలకి దించుకుని.

ఆర్యా

సాధారణ తరుబుద్ధ్యా
సమయా రచితస్తవాల వాలో౽పి
లజ్జయసి మామిదానీం
చంపక! సౌరభ్య నిర్భరైః కుసుమైః

తేటగీతి

పట్టి సామాన్యమగు చెట్టువని తలంచి
కూర్పనైతిని నీకింత కుదురునైన
భూరి పరిమళ మొసగు నీ పూలగన్న
చాల సిగ్గయ్యెనే నాకు చంపకంబ!

*　　*　　*

అరటిచెట్టు

తర్క, వ్యాకరణ, వేదాంత, వైశేషిక న్యాయ, పూర్వ మీమాంసాది అనేక శాస్త్రాల్లో జగన్నాధుడు అసమానమైన పాండిత్యం గలవాడన్న విషయం జగద్విదితం. కాని, ఇతడు ఆ నాటి హిందూస్తానీ గాయకులలో కూడా అత్యున్నత స్థానాన్ని ఆక్రమించాడన్న విషయం చాలామందికి తెలియదు. ఇతడు గాయకుడేకాక గేయకారుడు కూడానట! ఇతడు వ్రాసిన హిందూస్థానీ 'దోహా' లను ఇప్పటికీ పాడుతూ ఉంటారట.

షాజహాను చక్రవర్తి దర్బారులో ప్రసిద్ధులైన సంగీత విద్వాంసులు ముగ్గురిలోనూ జగన్నాధ పండిత రాయలు ఒకడట! రెండవవాడు డైరింగ్‌ఖాన్, మూడవవాడు లాల్‌ఖాన్. (తాన్‌సేన్ కొడుకైన బిలాస్‌ఖాన్‌కి ఈ లాల్‌ఖాన్ అల్లుడు.)

విక్రమశకం 1691 కార్తీక బహుళ నవమి నాడు షాజహాన్ సవారీ కాశ్మీర పర్వత శ్రేణిలోఉన్న 'బంభరం' అనే చోట విడిసింది. ఆ సమయంలో పండితరాయలు 12 రాగాలలో దోహాలు రచించి, పాడి వినిపించగా చక్రవర్తి అమితానందపడి, 4500 వెండి దీనారములతో జగన్నాధుణ్ణి తులాభారం తూగించి బహూకరించాడట. ఈ విషయం 'ఆఇనే అక్బరీ'లో వ్రాసి ఉంది.

డైరింగ్‌ఖాన్, లాల్‌ఖాన్‌లు ఒక్కసంగీత విద్య లోనే పండితులు.

కనకలాల్ ఒక్కవాక్పమత్కృతిలోనే గట్టి వాడు. గోవింద పండితుడు ఒక్కతర్కంలోనే నిధి.

రామేశ్వర దీక్షితులు ఒక్కవ్యాకరణంలోనే ఉద్దండుడు. జ్ఞానేంద్రుడు కేవలం వేదాంత వేత్త మాత్రమే. కాని, ఈ అన్ని విద్యలలోనూ అఖండ పాండిత్యం జగన్నాథునికి మాత్రమే ఉన్నదని షాజహాన్ మెచ్చుకున్నాడు. పనసచెట్టు పెద్దపెద్దకాయ లైతే కాస్తుంది కాని, దానికి పూతలేదు.

మొగలి డొంకకి పువ్వులైతే ఉన్నాయికానీ, పళ్లు లేవు. తమలపు తీగయొక్క ఆకులు ఉపయోగిస్తాయి కాని, దానికి పువ్వులూ లేవు, కాయలూ లేవు.

ఒక్కొక్కటి ఒక్కొక్క విషయంలోనే ప్రసిద్ధమైనది. ఓ అరటీ! అన్నింటికీ ప్రసిద్ధమైన దానివి నీవు మాత్రమేనే.

**వసంతతిలక**

కింకేతకీ ఫలతి? కింపన సస్య పుష్పమ్?
కిం నాగవల్లిరిహ పుష్పఫల ప్రసూతే?
కస్యాఒపికోఒ వ్యతిశయోఒస్తి నతేన సద్భిః
సంపూజ్యతే కదళి! యాసి తతః ప్రసిద్ధమ్.

**తేటగీతి**

పనస పూయునె? మొగలికి ఫలము కలదె?
నాగవల్లికి ఫలపుష్పయోగ మేది?
గొప్ప యొక్కొక్కదాని కొక్కొక్కదాన
కదళి! అన్నిట విశ్రుతి గాంచి తీవు.

* * *

**పారిజాతం**

జగన్నాథుడు చిల్లర సంస్థానాలను ఎన్నెన్నో సందర్శించాడు అక్కడ తిరిగేడు. ఇక్కడ తిరిగేడు. ఈ రాజును చూచాడు. ఆ ప్రభువును చూచాడు. కొందరు తనకి ఆశ్రయం ఇవ్వలేదు. కొందరు తనకే వచ్చులేదు. ఆఖరికి ఢిల్లీ దర్బారును చేరుకుని, మరెక్కడికీ వెళ్ల బుద్ధికాక, అక్కడే స్థిరపడ్డాడు. పారిజాత పుష్పములతో పరిచయం అయే.దాకా తుమ్మెద కాలు గాలినట్లు చెట్లు. పుట్టలు, కొండలూ, కోనలూ, పొదలు, డొంకలు తెగ తిరిగింది పాపం!

**అనుష్టుప్**

యావదేనం నజానాతి
పారిజాతం మధువ్రతః
తావద్ద్రుమేణ మేవాస్య
కుంజే కుంజే ద్రుమే ద్రుమే.

**ఆటవెలది**

చెట్టుచేమలందు చిరుకొంపములయందు
పొదలయందు కాళ్లు కదుము కట్ట
పారిజాతపుష్ప పరిచయం బగు దాక
తేటతెలివి మాలి తిరుగు నిట్లు.

* * *

**మహావృక్షం**

పగటి వేషగాళ్లు, వీధి భాగవతులు, విప్ర వినోదులువంటి చిల్లర కళాకారులు ఏ చిన్న ఆశ్రయం దొరికినా సంతోషించి, తృప్తిగా కాలం గడిపేసుకో గలరు. అటువంటి వాళ్లకి సార్వభౌముల ప్రాపకమే కావాలని ఏమీ లేదు. కాని, పండితరాయలవంటి అపూర్వ ప్రతిభాశాలులకి ఆశ్రయం ఇచ్చి, తగిన మర్యాదలు నెరపి, నిభాయించుకోగల శక్తి ఏ ఢిల్లీశ్వరుడికో తప్ప ప్రతిచిన్న సంస్థానానికీ ఉంటుందా? అటువంటి రాజాధిరాజులు, వారి దర్బారులూ ధన్యములు.

లేళ్లు, పందులు, కుందేళ్లు, నెమళ్లువంటి అల్పజంతువులు ఏ చిన్న పొదనో చూచుకుని, లోపల దూరి, హాయిగా నిద్రపోగలుగుతాయి. వాటి అవసరాలు చాలా స్వల్పం. కాని, ఎండవేడికి ఉడుకెత్తిపోయిన మహాగజేంద్రానికి విశాలమైన చల్లని నీడనిచ్చి, సేదదీర్చగల సామర్థ్యం, ఆకాశం అంట పెరిగిన వృక్ష రాజానికితప్ప చిన్నచిన్న తుప్పలకీ పొదలకీ ఎక్కడ ఉంటుంది? ఆ మహావృక్షపు జన్మ ధన్యం.

**మందాక్రాంతా**

ఏణ శ్రేణీ శశక నివహాః
శల్య కానాం సమూహాః
కేకీ వ్యూహాః శ్రయతి వసతిం
యత్ర కుత్రాపి కుంజే
సోఒయం ధన్యః సకల సుకృతీ
పాదపోఒభ్రం విహాశ్రీ
ర్యస్య చ్ఛాయా మయమనుసరే
దాత పార్తః కరీంద్రః

మ త్తేభ వి క్రీడితం

హరిణ శ్రేణులు, నేమబందులు, మయూ
రాదుల్, శశవ్యూహమే
చిరుజొంపమ్ముననైన దూరి నిదురం
జెందన్ సమర్థంబు లౌ
వరసీ జాప్తకర ప్రతప్త కరికిన్ ఛాయన్
ప్రసాదింపుచు అం
బరముందాకగ విస్తరిల్లు తరు
జన్మం బెంత ధన్యంబహో!

* * *

ఢిల్లీశ్వరుడు

రాజు కళంక మూర్తి
రతిరాజు శరీర విహీనుడు
అంబికారాజు దిగంబరుండు
మృగరాజు గుహాంతర సీమవర్తి

అవి మిగిలిన రాజులనందరినీ తరాజులని నిరసించి, తనకు ఆశ్రయం ఇచ్చిన రాజును ఆకాశానికి ఎత్తెయ్యడం కవులకు పరిపాటే.

ఢిల్లీ దర్బారులో తాను స్థిరపడడానికి కారణం చూపిస్తున్నాడు పండిత రాయలు.

అర్థుల కోరికలు తీర్చగల సమర్థులు ఇద్దరే ఇద్దరు ఉన్నారు. ఒకడు ఢిల్లీశ్వరుడు, రెండవ వాడు జగదీశ్వరుడూనూ. లోకంలో ఇంకా రాజులు లేక పోలేదు. ఉప్పు, పప్పు, చింతపండువంటి దినవెచ్చాలు మాత్రమే కావాలనుకుంటే వాళ్లని మహరాజాగా ఆశ్ర యించవచ్చు.

ఉపజాతి

ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాకాయ వాస్యా ల్లవణాయ వాస్యాత్.

తేటగీతి

విశ్వనాథుండొ, లేక ఢిల్లీశ్వరుండొ
అర్థులను తృప్తిపరుప సమర్థులెన్న
ఇతర నరపాల కులము నర్థింపవచ్చు
శాకపాకాలకొరకు వెచ్చములకొరకు.

* * *

తురక

'వెళ్లి వెళ్లి తురకాణ్ణి ఆశ్రయించావేమి టయ్యా! మరో హిందూరాజు ఎవడూ నీకు కనబడ లేదూ?' అన్నాడు ఒక వృద్ధుడు పండిత రాయలని నిలవేసి.

'ఆశ్రయించడం అంటూ వస్తే హిందువుని కన్న తురకని ఆశ్రయించడమే మంచిదండి' అన్నాడు జగన్నాథుడు వినయంగా.

'ఏం అల్లాగ?'

'ఏ పండుగనాడో గొంతు నొప్పెట్టేలాగ ఆశీర్వ చనప్పనసలు చదివించుకుని, ఎంచిఎంచి చచ్చివెడి ఓ రాగిడబ్బు ఇచ్చే హిందుప్రభు యాచించడంకన్న, 'పట్టుకుపో' అని ఓ బంగారుకాసును నిర్లక్ష్యంగా విసిరికొట్టే మొగల్ ముల్లాని యాచించడం మేలు కదుటండీ?'

ఆర్యా

నహియాచే హిందూకం
పర్వణి దత్తైక తామ్ర డబ్బూకమ్
యాచే ముగల్ ములాకం
తృణీకృత స్వర్ణ చందూకమ్.

ఆటవెలది

పర్వదినములందు పలుమార్లు లెక్కించి
రాల్చు హిందువుండు రాగిడబ్బు
పోయి ముసలిమాను ముల్లానుయాచింప
పసిడికాసునిట్టు విసిరికొట్టు

* * *

ఏనుగు

షాజహాను ఖైదులోపడ్డాక ఔరంగజు పాలనలో పండితరాయలు ఢిల్లీ దర్బారు వదిలిపెట్టి మధుర చేరుకున్నాడు. ఆయన ప్రతిభ ప్రతిష్ఠ విని, కొందరు

చిన్నచిన్న సంస్థానాధీశులు తమ ఆస్థానాన్ని అలంకరించవలసిందిగా జగన్నాథునికి వర్తమానాలు పంపించారుకానీ, అతడు అంగీకరించలేదు.

'ఇల్లా ఇబ్బందులుపడుతూ ఈ ఊళ్లో కాలక్షేపం చేయవలసిన ఖర్మ మీకేమిటండీ! ఎందరెందరో ప్రభువుల దగ్గరనుంచి మీకు ఆహ్వానాలున్నా వచ్చే ఉన్నాయికదా! వాటిలో మీకు నచ్చిన చోటు ఒకటి ఎంచుకోరాదా?' అన్నారు ఆయన శ్రేయోభిలాషులు.

'వేసవి ఎండలకి తప్తమైన గజేంద్రము పాతాళ స్పర్శి అయిన బహుగంభీర సరస్సులో యథేచ్ఛగా స్నానం చేస్తుండేకాని, శల్యావశిష్టమై పోయినా పరే బురదగుంటల్లో పందుల్లాగా దున్నలలాగా పొర్లాడడం దానికి సాధ్యమా?' అన్నాడు పండితరాయలు.

ఆర్యా

ఆ పాతాళ గభీరే
మజ్జతినీరే నిదాఘ సంతప్తః
నస్ప్రశతి పల్వలాంభః
పంజరశేషోఽపికుంజరః క్వాపి

కందము

దీర్ఘోన్నతి పాతాళగ
భీరంబగు నీట నెండవేళల మునుగున్
వారణము మురికి గుంటల
నీరాడునె మ్రుదిమినైన నీరసమైనన్?

*  *  *

గంగానది

మహామహోపాధ్యాయులు శేష శ్రీకృష్ణుల వారికి చేసిన శుశ్రూష ఎన్నడూ వ్యర్థం కాలేదు. ఆయన దగ్గర చదువుకున్న భట్టోజీ దీక్షితులు, ఉపద్రష్ట పేరమభట్టు, శేష వీరేశ్వరుడు (శేష శ్రీకృష్ణుని కొడుకు, పండిత రాయల గురువు) వంటి వారు జగత్ప్రసిద్ధులయ్యారు. వారి శిష్య పరంపర దేశదేశాలా మన్ననలను పొందింది. ఫలానావారి శిష్యుడనని చెప్పుకుంటే చాలు సామాన్యుని కూడా రాజాధిరాజులు తలమీద పెట్టుకునేవారు.

అందులో ఆశ్చర్యం ఏముంది?

మహానుభావుల సంసర్గంవల్ల ఔన్నత్యం పొందని వాడుంటాడా? వీధుల్లో పారే కుళ్లనీళ్లు కూడా గంగానదిలో ప్రవేశించగానే, పరమపవిత్రములై దేవతల శిరస్సులను కూడా అలంకరిస్తున్నవి కావూ?

అనుష్టుప్

మహానుభావ సంసర్గః
కస్యోన్నతి కారణమ్
ప్రవిశ్య గంగాం రథ్యాంబు
త్రిదశైరపి సేవ్యతే.

ఆటవెలది

అల్పులకును సైత మౌన్నత్య మబ్బదే
గొప్పవారితోడ కూడియున్న?
గంగ జేరి వీధి కాల్వలోని జలంబు
అమర వరుల పూజ లందుకొనదె?

*  *  *

సత్సాంగత్యం

ఎంత గొప్పవంశంలో పుట్టినవాడైనా, ఎన్ని సద్గుణాలు కలవాడైనా మంచి సాంగత్యం లేకపోతే రాణించడు. వీణాదండం ఉంది. అది సద్వంశజమే (మంచి వెదురుగొట్టంతో చేయబడినదే.)

అది సుగుణాన్వితమే (మంచి తీగలు కలదే) అయినప్పటికీ అనపకాయబుర్ర కనుక లేకపోతే వ్యర్థమే కదా!

ఆర్యా

వంశభవో గుణవానపి
సంగ విశేషేణ పూజ్యతే పురుషః

నహి తుంబీ ఫల వికలో
వీణాదండః ప్రయాతి మహిమానమ్.

**ఆట వెలది**

వంశభవుడునైన, బహుగుణాన్వితుడైన
మహిమ గనడు సాధుమైత్రిలేక
పెదండెమెందు విశ్రుతి గాంచునే
తుంబి బుర్రతోడ దోస్తిలేక?

*   *   *

**నాలుక**

సార్వభౌముల కొలువులో అనేక శత్రువుల నడుమఉంటూ, అనుక్షణమూ ప్రమాదాలు తప్పించుకుంటూ, నెగ్గుకు రావడానికి ఎంతో చాతుర్యము, ఒడుపు కావాలి. ఈ చాతుర్యాన్ని మనమంతా నాలుక దగ్గర నేర్చుకోవాలిట!

ముప్ఫై రెండువాడి పళ్లు అనే గర్భ శత్రువుల నడుమ అమనిత్యమూ దెబ్బ తగలకుండా బహు నేర్పుగా తప్పించుకు తిరుగుతూ ఉండే ఓ నాలుకా! నీ కీ సంచార కౌశలం ఎల్లా పట్టుబడిందో చెప్పవూ!

**అనుష్టుప్**

ద్వాత్రింశద్ద శనద్వేషి
మధ్యే భ్రమసి నిత్యశః
తదిదం శిక్షితం కేన
జిహ్వే సంచార కౌశలమ్

**తేటగీతి**

పరమ శత్రువులైన ముప్పదియు రెండు
పళ్ల నడుమను నిత్యమ్ము పరుగు లిడుదు
విట్టి సంచార కౌశలం బెవనివద్ద
నాలుకా! ఎట్లు నేర్చుకొన్నావు చెప్పు.

(ఇందులో ఉదాహరించిన తెలుగు పద్యాలు డా. మహీధర నళినీమోహన్ అనువదించిన భామినీ విలాసంలోనివి.)

———



# వెలుగులోనికి

శ్రీ నూతలపాటి గంగాధరం

చీకటినుంచి వచ్చాను—వస్తూ
జీవితమే ఒక కాంతి కమలం అనుకున్నాను
చిక్కుదారినుంచి వచ్చాను
చిక్కుదారులే భూమ్మీద ఉండవనుకున్నాను
ఏడుస్తూ వచ్చాను
ఏడుపుతో ఇంక పనే ఉండదు
ఇక్కడ ఉన్నంతకాలం హాయిగా
ఆశ తీరా నవ్వుకోవడమే పని అనుకున్నాను.

*            *            *

వస్తూ వస్తూ ఆకాశం చివరి అంచుమీద నిలబడి
అలా భూగోళం వైపు చూపు సారించాను
ఎంత అందమైన దృశ్యం !
ఎంత మహత్తర రసవత్తర దృశ్యం !
పృథ్వి జీవనాడి నుంచి దివ్యజ్ఞాన గ్రంథివరకు
నేను మీటిన భావ వీణల
మధుర స్వరాలే ప్రతిధ్వనిస్తున్నాయి.
ప్రకృతి పాదతలంనుంచి కీర్తికాంత కిరీటం వరకు
నేను పూసిన రంగులే
చిత్ర విచిత్రంగా ప్రతిఫలిస్తున్నాయి.
వాల్మీకి శ్లోకంలో షేక్స్పియర్ సానెట్‌లో
త్యాగయ్య నాదంలో పికాసో కుంచెలో
అంతటా నా కంఠమే వినిపిస్తోంది

అంతా చూచి ఆనందం పట్టలేక
గర్వంతో ఒళ్లు విరుచుకున్నాను
ఒళ్లు మరచి తాండవం చేశాను

ఆకాశం అంచున్నుంచి కాలు జారి
అలాగే భూమ్మీదికి వచ్చిపడ్డాను

*　　　　*　　　　*

దిమ్మెక్కిన తల విదిలించి
దిబ్బళ్ళుపడ్డ కనురెప్పలు తెరచి మరీ చూశాను
చూసిన దృశ్యం ఏమని వర్ణించను?
నా కల కన్నీరై కరిగింది
నా ఆశ ఆయుధమై అక్కున గుచ్చుకుంది
కలగన్నదానికీ, కనుగొన్నదానికీ
ఎందునా సామ్యం కనిపించలేదు

సంకెళ్ళు త్రెంచుకున్నవాడు
సాలెగూళ్ళలో చిక్కుకుంటున్నాడు
కంచు పొరల్ని విడగొట్టినవాడు
మంచు తెరలకు జడుసుకుంటున్నాడు
పరదాస్యాన్ని అసహ్యించుకున్నవాడు
పరమోహాంకు దాసోహ మంటున్నాడు
కలసి పోరాడుదామన్నవాడు
కలసి జీవిద్దామంటే కాదు పొమ్మంటున్నాడు
మరొక దృశ్యం ఏమిటో తెలుసా?
అగడ్తమీది అలరుతల్పంపై పవళించినవాడు
నీతిలత పూసిన నిజం పువ్వును
గిల్లివేయడానికి చెయ్యి చాపుతున్నాడు
చూడలేక కళ్ళు మూసుకున్నాను
కానీ కలల్ని ఎవడు మరువగలడు?

నా యీ చిన్న అనుభవంతో
గ్రహించిన కొన్ని పచ్చి నిజాలు
వరుసగా విన్నవిస్తాను.
కలలతో తృప్తిపడ్డవాడు
గర్భంలో పిండంగానే మిగిలిపోతాడు
కాలంతోపాటు పెరగలేడు
మృత్యువుకు జడిసి చేతులెత్తినవాడు
ముందే బావిన జీవితానికి ఒప్పుకున్నాడు
ముందు జీవితాని కిక పనికిరాడు

## వెలుగులోనికి

వీలుచిక్కినపుడు వీరుడ్ని పోజు పెట్టేవాడూ
వెనకబడినప్పుడు వేదాంతం వల్లించేవాడూ
ప్రగతి ప్రయాణానికి పనికిరాడు
చీకటినుంచి కూడా చిరునవ్వులు వెలిగించేవాడూ
చిక్కుల్లో ఉన్నా చిక్కులు విప్పే నేర్పు కోల్పోనివాడు
కాంతి లోకాన్ని చేరుకుంటాడు.

*　　　　*　　　　*

నిరాశనుంచి వచ్చినా
అందరిలో ఆశల విత్తులు నాటి
ఆశయాల చెట్లు మొలిపిస్తాను
వంచన నుంచి వచ్చినా
మంచి మాగాణిని సాగుచేసి
మానవత్వం పంటలు పండిస్తాను
అడవినుంచి వచ్చినా
అరణ్యాలకు సైతం ఉషస్సుధల్ని పంచే
అమరగీతికల్ని రచిస్తాను
కత్తుల వంతెనమీది నుంచి వచ్చినా
కాలం కన్నీటిని చెరిపి
కాంతి చరిత్రను సృష్టిస్తాను
చీకటినుంచి వచ్చినా
చీకటి లోకాన్ని వెలుగులోనికి నడిపిస్తాను.

---



# ఒకానొక పక్షి కథ

శ్రీ శేఖర్

చిన్న చలిగాలిలా నడుస్తూ, వాన చినుకుల్లా గొణుక్కుంటూ సందులోంచి నడుస్తూన్న ఫణికి సముద్రపు రొద, ఈదురుగాలి స్వాగతం చెప్తున్నాయి. అలా మెల్లగా నడుచుకుంటూ బీచ్ రోడ్డులోకి దిగేడు. అక్కడంతా మంచి హడావుడిగా వుంది. కార్లు వస్తున్నాయి...పోతున్నాయి. రిక్షాలన్నీ చక్కగా ఒక వరసలో పేర్చి వున్నాయి. రిక్షా డ్రైవర్లుమాత్రం వాటి కెదురుగా ఎత్తుగావున్న హోటల్ మెట్లమీద కూర్చున్నారు. మెట్లు దాటితే పట్టపగలులా వెలుగు. మెట్లకింద చిక్కని చీకటి. అక్కడ పైసానుంచి రూపాయివరకూ అనేక రకాల ఆడా మగా ఎవరి ధోరణిలో వాళ్ళున్నారు. వాళ్ల భవిష్యత్తు చూసి సముద్రం బొబ్బలు పెడ్తూంది. తన తెలివి తక్కువతనానికి తానే నవ్వి నురగలు కక్కుకుంటూంది. ఫణి మెట్లుదాటి కుడివైపు లాన్‌లో దూరంగా వేసిన కుర్చీలవేపు నడుస్తున్నాడు.

'హల్లో! హాయ్! హౌడుయుడూ!' ఎదురుగా వచ్చి పలకరిస్తోం దెవర్తో. మరొక రోజయితే భుజం మీద చెయ్యివేసి తీసుకుపోయేవాడే. కాని ఇవాళ అలా చెయ్యలేదు. చిన్నగా వేగంగా కుర్చీల దగ్గరకి పోయేడు. ఫణి మిత్ర బృందం అంతా అప్పటికే చేరేరక్కడ. ఎవర్తో ఒక చిలక ఇంచుమించు వారందరి సొత్తుగా కూర్చుందక్కడ. వాళ్ల ముఖాలుచూస్తే రెండురౌండ్లు పూర్తయినట్లు కన్పిస్తున్నాయి.

ఫణి వాళ్ల దగ్గరకు వెళ్తూనే 'ఒరేయ్! పక్షిగాడు కన్పట్టం లేద్రా! వాళ్లావిడ సాయంత్రం మా యింటికొచ్చి లబోదిబోమంది' అంటూ ఇంచుమించుగా అరిచేడు. అప్పటికి ఫణి త్రోవలో పుచ్చుకున్న పెగ్గు బాగా దిగింది. వాళ్లంతా గుర్రాలెక్కి వున్నారు

'కన్పట్టం లేదా! చచ్చాడేమోరా!' అన్నాడు కామేశం.

'చావడం కాదురా బాబు. నిన్న ఆఫీసులో జీతం పుచ్చుకున్నప్పుడు కన్పించాడు. అంతే మరి ఇంటికి పోలేదుట' అన్నాడు ఫణి.

'వాడి మొఖం వాడెక్కడికి పోతాడ్రా! ఆ సింగుగాడి క్లబ్బులోనో, సుగుణ ఇంట్లోనో దొర్లుతూ వుంటాడు' అన్నాడు నాయుడు సిగరెట్టు పొగ మింగుతూ.

'వాడి కిది మామూలేగద. కాబూలీవాళ్ళనుండి పనిమనిషిదాకా తనని పీక్కుతింటారని తెలుసు. అందుకే ఈ అంతర్ధానం' అన్నాడు శర్మ కొత్త బుడ్డి ఓపెన్ చేస్తూ.

ఫణి కుర్చీలో కూర్చుని గ్లాసులో బ్రాందీ. బీరు పోసుకున్నాడు. సిప్ చెయ్యడం వాళ్ల కెవరికీ అలవాటు లేదు. ఫణి గబగబా నాలుగు గుక్కలు మింగేడు. అతని ఒళ్లంతా జివ్వు మంటూంది. త్రోవలో గొణుక్కున్న విషయం మళ్లీ తెరలు తెరలుగా కళ్లలో సుడి తిరుగుతూంది. 'ఒరేయ్! ఆ వెధవకి ఎన్నిసార్లో చెప్పేన్రా తాగొద్దని. నా మాట వింటేగ!' అన్నాడు. మిగిలిన వాళ్లంతా ఒక్కసారి నవ్వేరు.

'బాగా చెప్పేవురా! నువ్వే వాడికి చెప్పవలసినవాడివి' అన్నాడు మూర్తి అప్పుడే పక్కనున్న చిలక ముక్కుని కదపడం కొరకబోతూ. మధ్యనున్న ఓప్పు

జీడిపప్పూ అన్నీ ఖాళీ అయిపోతున్నాయి. పక్షి సంగతి వాళ్ల కెవరికీ పట్టలేదు.

'ఒరేయ్! వా డెక్కడున్నా వెదికి తీసుకు రావాల్రా. లేకపోతే వాడి పెళ్లాం ఛస్తా నంటూంది.'

'ఛస్తే చావనిద్దూ. ఈపాటి వా డెలాగూ ఎక్కడో పడి సచ్చే వుంటాడు' అన్నాడు కాము.

'ఒరేయ్! లంజాకొడకా! నువ్వే వాణ్ణి తగల పెట్టేవు. వాడి జీవితమంతా నాశనం చేసేవు' అంటూ ఫణి మళ్లీ గ్లాసు నింపుకున్నాడు. సర్వర్ ప్లేట్ల నిండా బిరియానీ తెచ్చిపెట్టేడు. అంతే. ఒక్కొక్కడూ కుక్కల్లా కలియబడి తినడం ప్రారంభించారు మధ్యలో తాగుతున్నారు బిరియానీలో ముక్కలు ఒకడి ప్లేట్లోవి మరొకడు ఏరుకు తింటున్నారు. జిమ్ము తున్నారు నీళ్లు పారబోస్తున్నారు.

'ఈ ఫణిగాడు పెద్ద సదాచారిలాగ చెప్తున్నాడు. లంజాకొడుకు. ఏరా! నేనా వాణ్ణి పాడుచేసేన. మీరందరూ కలిసి వాణ్ణి బాగుచెయ్యలేకపోయారా! లంజాకొడుకుల్లారా! మిమ్మల్ని పాడుస్తాను జాగ్రత్త' అంటూ తన గ్లాసులో నీళ్లన్నీ ఫణి ముఖంమీద పోసేడు.

నాయుడు లేచి 'ఒరేయ్! అల్లరి చెయ్యకండ్రా వాళ్లు ఈడ్చేస్తారు' అంటూ సర్దుతున్నాడు.

'మళ్లీ అంటాను. మళ్లీ అంటాను. నువ్వే వాణ్ణి నాశనం చేసేవు' అంటూ తన దగ్గరున్న బిరియానీ ప్లేటు తీసి కాము ముఖాని కేసి కొట్టాడు ఫణి. గబగబా నలుగురు సర్వర్లు వచ్చి వాళ్లని గట్టిగా విసిరి మెట్లు దిగేదాకా ఇంచుమించు గెంటేరు. వాళ్లందరికీ ఒంటిమీద ఏమీ స్మారకం లేదు. ఎదురుగా సముద్రం ఎన్నిబుడ్లు తాగిందో గాని నిలవలేక పోతూంది. పెద్ద గొంతుతో పేలుతూ ముందుకు తోసుకుపడుతూంది. తాగినదీ, తిన్నదీ అంతా నుర గలు నురగలుగా కక్కుతూంది. సముద్రం కోరకుండా అడ్డంగా వేసిన పెద్దపెద్ద బండరాళ్లు తాగుబోతుల తల్లిదండ్రుల, పెళ్లాల గుండెల్లా సుఖం...సంతోషం...భయం...విచారం...సిగ్గు...అవమానము ... అన్నిటి వదలుకుని చలనం లేకుండా పడున్నాయి.

..... ......................

మర్నాడుదయం తొమ్మిదిగంటలకల్లా పెళ్లాం లేపగా లేపగా లేచేడు ఫణి. ఒళ్లంతా పచ్చిముద్దలా వుంది. ఉబ్బి బయటకొస్తూన్న కళ్లు ఇంకా మూతలు పడుతున్నాయి. నుదుటి మీద తగిలిన దెబ్బకు ప్లాస్టరు అంటించి వుంది. మంచం మీద కూర్చునే పెళ్లామిచ్చిన కాఫీ తాగుతున్నాడు.

'తొమ్మిది గంటలు దాటేదాకా పడుకోకపోతే కొంచెం వేగంలేచి కూరా నారా తేగూడదా!' అంటూ రుసరుసలాడింది శాంత.

'మొన్ననే కదా కూరలు తెచ్చేను. రోజూ సామాన్లు తేవడాని కిదేం వ్రతం అనుకున్నావా! సంసారం కాల్చి గంప కెత్తేస్తున్నావ్!' అంటూ ఖస్సు మన్నాడు తేలిపోతూన్న నరాల నదిమిపెట్టూ.

'ముష్టిముండా కూరతెచ్చి మూడు రోజులు సర్దమంటే నేనెక్కడ సచ్చేది. రాత్రి వందా ఏభై తగలబెట్టి తాగినప్పుడు లేదుగాని, కూర తెమ్మంటే సంసారం కాలిపోయిందా మీకు?' అంటూ ఖాళీకప్పు తీసుకుని లోపలికి పోయింది.

ఫణి ఏమో అనబోతూండగానే 'ఒరేయ్! ఫణీ!' అంటూ లోపలి కొచ్చేడు కామేశం. శాంతవంటింటి తలుపు దభీమని వేసుకుంది. 'ఒరేయ్! చచ్చాంరా. ఆ పక్షిగాడి పెళ్లాం మా ఇంటికొచ్చి తిడుతూంది. మనం వాడెక్కడున్నాడో వెతక్క తప్పదు' అంటూ ఛార్మి నార్ సిగరెట్టు ముట్టించి మంచంమీద కూర్చు న్నాడు.

'అయితే ఏం చేద్దామంటావ్?'

'ఏముంది ముందు ఆఫీసుకి సెలవు పెట్టు. నాయుడు, శర్మకూడా సెలవు పెట్టేరు. నలుగురం నాలుగుచోట్లా వెదుకుదాం.'

'సరే వుండు. నేను ముఖం కడుక్కుని వస్తాను' అని లేచి పెరట్లోకి వెళ్లేడు ఫణి. శాంత

వంటింట్లో గిన్నెలు చప్పుడు చేస్తూంది. ఫణి ముఖం కడుక్కొని, బట్టలు వేసుకునే లోగా నాయుడు, శర్మ ఇద్దరూ వచ్చేరు.

'గురూ! ఇంకా ఇలాగే వున్నారేంటి. బయలే రండి! అంటూ తొందర చేసేడు నాయుడు.

ఓయ్! ఆ పక్షిగాడు మొన్నరాత్రి కొబ్బరి తోట దగ్గర ఎవర్తెతోనో కనిపించేడని చెప్పేడు సింగు. అప్పటికే కంత్రీ బాగా కొట్టేసేట్ట' అంటూన్న శర్మ నోరు మూస్తూ 'ఒరేయ్' గట్టిగా వాగకురా బాబు! మా ఆవిడ వింటుంది' అంటూ వాళ్లను బయటకు తీసుకుపోయాడు ఫణి.

శాంత మెల్లిగా బయటకొచ్చింది. తను వండిన వంట ఎవరు తినాలో ఆవిడకు బోధపడలేదు. ఒక తాగుబోతుని వెదకడానికి నలుగురు తాగుబోతులు బయల్దేరారు. వీళ్ల కిది కొత్తేమీ కాదు. రాత్రంతా కుక్కల్లా కొట్టుకొని పగలు మళ్లీ ఇలా తిరగడానికి ఎలా మనస్కరించిందో వీళ్లకు. ఛీ! ఇలాంటి మొగుడు జన్మజన్మలకీ వద్దు! రాత్రి ఫణి ఇంటికొచ్చిన తీరు శాంత ముఖాన్ని గుద్దుతూంది ఆ వాలకాన్ని మరచిపోలేకపోతూంది ఆవిడకు బుర్ర మొత్తుకోవాలనిపించింది. అంతకన్నా ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటె మేలు అనుకుంది. కాని. తన పిల్లలో... ముత్యాలాంటి పిల్లల్ని తనేంచేసి పోవాలి? పక్షి పెళ్లాం ఏడాది క్రిందట నిద్రమాత్రలు మింగినవాడూ, ఆర్నెల్ల కిందట నూతిలో పడినవాడూ—చచ్చిపోయుంటే ఈపాటికి ఆ పిల్ల లేమయే వారు? ఛీ! ఈ తాగుబోతులకోసం మేమెందుకు చావాలి? అనుకుంది శాంత. ఆవిడ ఆలోచన క్రమక్రమంగా పక్షిగాడి మీదకు పోయింది.

అతనికి అసలు పేరు లేకపోలేదు. అయినా అందరూ పక్షిగాడనే అంటారు. మొదట్లో కొన్నాళ్లు అక్కుపక్షి అనేవారు. రాగా రాగా ఆ మనిషి మరీ వెదురుబద్దలా సగమయాడనో, లేక ముళువుకోసమో 'పక్షి!' అనడం ప్రారంభించేరు. పాపం! పక్షి మొదట్లో తాగేవాడు కాదు. తన జీతంతో హాయిగా గడపవచ్చునని పెళ్లాం చేస్తూన్న ఉద్యోగం కూడా మాన్పించేడు పోనీ ఆ ఉద్యోగమున్నా ఈ రోజు ఆవిడ సుఖపడేది. ఆవిడ మొదట్లో ఎంత అందంగా, కులాసాగా ఉండేది! ఈ ఇంటికొచ్చి గంటల తరబడి కబుర్లు చెప్పేది. ఎంత హాస్యంగా మాట్లాడుతుందని! క్రమంగా ఇంటికి రావడం మానుకుంటే గర్వమేమోననుకునేదాన్ని. ఏడాది దాటిన తరువాత బజార్లో...పూర్ణా మార్కెట్టు దగ్గర.. దూరంగా, నీరసంగా, విస్తేజంగా కనిపిస్తే పిల్లపుట్టిక అరోగ్యం చెడిపోయిందనుకున్నాను. అంతేకాని ఆ దౌర్భాగ్యుడు తిండికిలేకుండా తాగుతున్నాడని గ్రహించ లేకపోయేను. ఎంత సిగ్గు విడిచి పెట్టేడో! తను పోషించలేకపోయి తండ్రికి మిగిలిన ఐదెకరాల పొలం వ్యాపారం పేరు పెట్టుకొని అమ్మించి, ఆ సొమ్మంతా తాగి తందనాలాడి వాళ్లను బికార్లను చేసేడు ఆ బెంగంతో వాళ్ళు కుళ్లిపోయేరు. పెళ్లాం మెళ్లోవున్న బంగారమంతా కరిగిపోయింది. ఏడాదికిందట మామగారొచ్చి 'చావకురా నాయనా! ఈ రెండు వేలూ తీసుకుని అప్పు తీర్చు ఇక మీదైనా బుద్ధిగా వుండు'. అని ఇచ్చిన డబ్బులో సగం తాగుడుకీ ముండలకీ అప్పచెప్పేడు. నెల నెలా ఫస్టు వచ్చిందంటే పక్షి ప్రాణం గిలగిల కొట్టుకుంటుంది. జీతంలో మగాడువంతులు బిల్లు చేస్తూన్నప్పుడే కోసేస్తారు. ఇంక తాగడానికేముంది? పెళ్లాం పిల్లలకు పెట్టడానికేముంది? అంచాలు పట్టి ఎట్టి పీకలమీదకు తెచ్చుకున్నాడు—ఇలా ఆలోచిస్తూ వుండగా పిల్లలు బడిమండి వచ్చేరు.

'అమ్మా నాన్నగారు ఆఫీసుకు వెళ్లిపోయారా?' అన్నాడు పుస్తకాలపెట్టె టేబిలుమీదపడేస్తూ శేఖర్.

'అమ్మా! నాన్నగారు పొద్దున్న లేవరు. సాయంత్రం రారు. మరెప్పుడు మేం మాట్లాడ్డం' అంది సుజాత కాళ్లు కడుక్కుంటూ.

'ఇప్పుడు నాన్నగారితో మీ కేంటి పని. అన్నం పెడతాను రండి' అంటూ వంటింట్లోకి పోయి కంచాలువేసి, వీళ్లు పెట్టూంది శాంత.

'ఏమంటేనే మాట్లాడలేంటే! అవునుగాని పొద్దున్న చూసేను నాన్నగారికి నుదుటిమీద దెబ్బెలా తగిలింది?' అంటూ పీటమీద కూర్చుంది సుజాత.

'నీ కెందుకే ఆ ఆరాలన్నీను...ముసలమ్మలా ఏదో చిన్న దెబ్బ తగిలిందిట. మందు పెట్టేను. అదే పోతుంది.'

'అమ్మా! నీ కెందుకు నాన్నగారంటే అంత కోపం?' అన్నం తింటూ తలదించుకుని అడిగేడు శేఖర్.

'మిమ్మల్ని నన్ను ఇంత ముద్దుగా చూస్తున్నా రనీ! ముందు నోరు మూసుకుని అన్నం తినిపో' అని విసురుకుంటూ గదిలోకి పోయింది శాంత. ఎదురుకుండా పెళ్లిఫోటో కన్పిస్తూంది. పది సంవత్సరాలయింది పెళ్లయి. ఈ కొద్ది కాలానికే తమలో శారీరకంగా ఏర్పడినమార్పు, మానసికంగా ఏర్పడిన దూరం—ఆవిడ భయ కంపితురాల్ని చేస్తున్నాయి. పక్షి దంపతుల రూపురేఖలు రావడానికి ఇంక కొద్ది కాలం చాలునేమో! ఆ ఆలోచన రాగానే అక్కడ నిల్చోలేక పోయింది. ఎక్కడికైనా వెళ్లి కొన్నాళ్లు గడిపివస్తే బాగుణ్ణని అనిపించింది. కాని ఎక్కడికి వెళ్లగలదు? గుమ్మందాటి బయటకు వెళ్లేసరికి అందరూ తనవైపే చూస్తున్నట్లు...ఏదో అను కుంటున్నట్లు అనిపిస్తుంది. పుట్టింటికి వెళ్తే అందరూ తన మొగుడి గురించే అడుగుతారు. ఎవ రైనా తమ ఇంటికివస్తే ఆ సమయానికి ఫణి ధోరణి ఎలాగుంటుందో! అందుకే తమ ఎవరింటికీ వెళ్లడం మానేస్తే అందరూ దీనికి గర్వమనుకుని వాళ్లుకూడా రావడం మానేస్తారు—అదే బాగుందను కుంది శాంత. బంధువులన్న వాళ్లెవరికీ ఉత్తరాలు కూడా రాయడం మానేసింది. దాంతో వాళ్ళూ మానుకున్నారు. పిల్లలంటూ లేకపోతే తన ఒంటరి జీవితానికి అర్థం లేకపోను—ఛ—ఎంతసేపిలా ఆలో చిస్తాను అనుకుంటూ లేచింది. పిల్లలిద్దరూ అన్నం తిని వీధి బీడీలో కూర్చుని ఏదో మాట్లాడుకుంటు న్నారు. ఫణి భోజనాని కొస్తాడనే నమ్మకం లేదు. అయినా శాంతకు భోజనం చేయాలనిపించలేదు. కొంచెం సేపు పిల్లలతో హాయిగా మాట్లాడుకుందా మని అటు వెళ్లబోయింది.

'సుజా! నీకు అమ్మంటే ఇష్టమా? నాన్న గారంటే ఇష్టమా'? అడుగు తున్నాడు శేఖర్ గాలి పటానికి చితారు కడ్తూ.

'నాకు నాన్నగారంటేనే ఇష్టం. అమ్మ ఎప్పుడూ నవ్వదు. నాన్నగారు ఆదివారం నవ్వుతారు.' సిగ్గుమాలినవాడు నవ్వకేం చేస్తాడనుకుంటూ వెనక్కి తిరిగిపోయి పడుకుంది శాంత.

శాంత నిద్ర లేచేసరికి పిల్లలు రెండో పూట బడికిపోయేరు. దగ్గర దగ్గర మూడున్నరవుతూంది. ఫణి మాత్రం ఇంటికి రాలేదు. శాంతకి బాగా నీరసంగా వుంది. లేచి ముఖం కడుక్కుని కాఫీ పెట్టుకుని తాగింది. ఆ తర్వాత ఏం చెయ్యడం? రెండవ పూట వంట చెయ్యవలసిన పనిలేదు. ఫణి ఎలాగూ భోజనానికి రాడు. పొద్దున్న వండిందే పిల్లల కింత పెట్టి తనింత తినవచ్చును లెమ్మనుకుంది. ఇంత వేగంగా తెలివివచ్చినందుకు చికాకు పడింది. ఏం చెయ్యడం? అనే ఆలోచనలోనే కాలం గడుస్తూంది. ఏదో పత్రిక తీసి చదవడం ప్రారంభించింది.

'అమ్మాయ్! శాంతా!' ఎవరిదో పిలుపు. లేచి ముందు గదిలోకి వెళ్తూంటే పక్షి మామగారు లోపలి కొస్తున్నాడు.

'రండి బాబాయిగారూ! కూర్చోండి' అంటూ కుర్చీ చూపించింది.

అతని ముఖం బాగా పీక్కుపోయింది. ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ 'బాగున్నావా అమ్మా!' అని ప్రశ్నించేడు.

'నా బాగుకేం లెండిగాని మీ అల్లుడి నవ్వా వారం ఏమన్నా తెలిసిందా?'

'ఇంక వాడి గురించి తెలిసినా ప్రయోజనం లేదమ్మా! నేనొక నిశ్చయాని కొచ్చేను. నా కూతురు విడాకులు తీసుకుంటుంది. ఇప్పుడే లాయరుగారితో మాట్లాడి అన్ని ఏర్పాట్లు చేసేను.' శాంత నిర్ఘాంత పోయింది.

'ఇందుకు మీా అమ్మాయి ఒప్పుకుందా బాబాయ్?'

నా కూతురు ఎప్పుడో ఒప్పుకుంది. అది అడిగిన నాడే నేను ఒప్పుకునివుంటే ఈ నాడు దాని పరిస్థితి ఇంత నికృష్టంగా వుండేవి కాదు.'

'మీారు బాగా ఆలోచించారా?'

'ఇంకా ఆలోచించే దేమిటమ్మా! ఆలోచించి ఆలోచించి నా కూతురుకి పిచ్చెక్కేదాకా ఆలస్యం చేసేను. ఎవరో ఏదో అనుకుంటారని, మాన మర్యాదల పేరుపెట్టుకుని ఇంకా కుళ్లిపోవడం అనవసరం. నా కూతురు మూడేళ్లనాడే 'నాన్నా! నేను విడాకులు తీసుకుంటాను' అని అడిగింది. ఆ రోజు నా కూతురు మంచిది కాదనుకున్నాను. నయానా, భయానా నచ్చజెప్పేను. నా మాట కాదనలేక—వాడితో బతకలేక ఇవాళ నా కూతురు ఎలా తయారయిందో నీకు తెలియదమ్మా! నువ్వు దాని ముఖం చూస్తే ఇలా గనవు.'

శాంత మర్యాదకోసం అలా మాట్లాడిందే గాని మనసులో పక్షి పెళ్లాం చేసిన పనికి చాలా సంతోషించింది. పెళ్లి చేసుకున్నంతమాత్రాన చెడిపోయిన మొగుడికోసం తమ జీవితాన్ని బలిపెట్టడం శుద్ధ తెలివితక్కువ అనుకుంది. కాని పక్షి పెళ్లాం చదువుకుంది. రేపు ఉద్యోగం చేసుకుని బ్రతుకుతుంది. తనకు సర్టిఫికేట్లు లేవే! కూలి, నాలి చేసుకుంటేనే తప్ప గతిలేదు. అందుకు సిద్ధపడ్డా లోకం తనకా అవకాశమివ్వదు—ఇద్దరూ అలా మాట్లాడకుండా కూర్చున్నారు. శాంత లేచి నిమ్మరసం కలిపి తెచ్చింది.

గ్లాసు అందుకుంటూ 'ఈ రోజు రాత్రి బండికి మేం వెళ్లిపోతున్నామమ్మా! బహుశా మళ్లీ ఈ ఊరు రావలసిన అవసరముండదు. నిన్ను, ఫణిని ఒకసారి చూసిపోదామని వచ్చాను' అన్నాడు.

'ఆయన మీా అల్లుణ్ణి వెదకడానికి వెళ్లేరు బాబాయ్!' అంది గ్లాసందుకుని కింద పెట్టూ.

'ఆ సంగతి తెలుసమ్మా! నువ్వెవరో నాకు ముందు తెలియదు. కాని ఫణిని నా చేతులతో ఎత్తుకుని తిప్పిన క్షణాలు నాకు బాగా జ్ఞాపకమున్నాయి. పాపం! వాళ్ల నాన్న ఎంత పరువు, మర్యాదలకోసం పాకులాడేవాడో. ఫణి ఇలా తయారౌతాడని అతనికి తెలియదు.'

''నేనేం చేసేది బాబాయ్! ఆయన ఎంత చెప్పినా వినరు.'

'ఒకరు చెప్తే వాళ్లు వినరమ్మా! వాళ్లకు తెలియదా వాళ్ల కళ్లముందు ఎన్ని బతుకులు నాశనమవుతున్నాయో! అయినా తమ వ్యసనాలు మానుకోరు వాళ్లు. నువ్వు · ధైర్యంగా వుండమ్మా! కాలానికి చాలా విలువుంది. ఏ క్షణం వాళ్లను మార్చగలదో! నేను వస్తానమ్మా' అంటూ లేచాడతను.

'అతన్ని చూస్తానన్నారు గదా! ఒక్క అరగంట కూర్చోండి. ఇక నొచ్చేస్తారు! అంది శాంత తను కూడా లేస్తూ.

'ఫరవాలేదమ్మా! అతన్ని ఇప్పుడే కామేశం ఇంట్లో చూసేను. ఇంతవేగం వచ్చే స్థితిలో లేడు. నువ్వు దిగులు పడకు. పరిస్థితులు మారకపోవు. ఫణి ఇంకా మా అల్లుడిలా తయారవలేదు. తప్పకుండా బాగుపడతాడు' అంటూ ఆతను వెళ్లిపోయాడు.

ఇకమీాద శాంతను గురించి నేను మీాకేమీా చెప్పదలచుకోలేదు. కాని ఒకటిమాత్రం నిజం. తననికూడా ఇలాగే ఎవరైనా వచ్చి తీసుకుపోతే, తన పిల్లలమీాద మొగుడినీడ పడకుండా, కలో గంజో తాగి బతుకుదామనే అనుకుంటూంది.

.......................... ............

ఫణి బృందం మిత్రద్రోహులుకారు. వాళ్ల పక్షికోసం విశాఖపట్నంలోని సారాకొట్లు, సానికొంపలూ అన్నీ వెదికేరు. వాళ్ల జాతి వాళ్లనందరినీ అడిగేరు. కాని లాభం లేకపోయింది. ఆ నిరాశను పూడ్చుకోవాలని త్రోవలో బ్రాందీ బుడ్లు కొనుక్కుని కామేశం ఇంటికి పోయేరు. కామేశం భార్య పతివ్రత. అతని సంతోషమే అమె సంతోషం. కామేశాన్ని అతని స్నేహితుల్ని ఒక్కలాగే చూస్తుంది. అయినా కిట్టని వాళ్లంతా పుట్టింటినుంచీ ఆవిడకున్న తాగుడు అలవాటే కామేశం చెడిపోవడానికి కారణమని ఆడిపోసుకుంటారు.

పక్షి గురించి అతని స్నేహితులకు తెలియని రహస్య మొకటుంది. పక్షి ఫస్టు తారీఖున అనుకోకుండా అప్పుల వాళ్లకి దొరికిపోయేడు. ఎంత ప్రయత్నించినా ఒక్కరూపాయికూడా మిగుల్చుకోలేకపోయేడు. అయినా అధైర్యపడలేదు. అతని ఆత్మ విశ్వాసం అచంచలమైనది. కాఫీ చుక్కైనా దొరకని ఇంటికి వెళ్లడం అనవసరం మనుకున్నాడు. జేబులో మిగిలిన చార్మినార్ సిగరెట్టు ముట్టించి అలవాటు ప్రకారం బీచ్‌రోడ్డులోకి దిగేడు. మిత్రులంతా వస్తారుకదా అని ఆ పెద్ద హోటలు దగ్గరకు చేరుకున్నాడు. అప్పటికి 6 గంటలవుతూంది. మనుష్యులు స్కూటర్లమీద, కార్లమీద ఒంటరిగాను, జంటగాను వచ్చి లాన్లలో సర్దుకుంటున్నారు. సముద్రం గాలి హాయిగా తగులుతూంది. హోటలు ఆవరణలో సందడి క్షణక్షణం ఎక్కువవుతూంది. పక్షి చేతిలో ఆఖరి చార్మినార్ ఆరిపోయింది. మిత్రులింకా రాలేదు. ఇంకా ఎదురు చూడాలంటే బాధగా వుంది. పోనీ అలా మీదకు పోయి మళ్లీ వద్దామనుకున్నాడు. బీచ్‌రోడ్డు పట్టుకుని తిన్నగా నడిచేడు. ఎంతదూరం నడుస్తున్నదే అతనికి తెలియదు. అలా రామకృష్ణా మిషన్ దగ్గరకు చేరుకోగానే అతనికి బాహ్యప్రపంచంతో సంబంధం కలిగింది. ఆ సాయంత్రంవేళ...రామకృష్ణా మిషన్ దగ్గర...... బీచ్‌లో...అటువంటి దృశ్యం వుంటుందని పక్షి ఎన్నడూ భావించలేదు. ఎన్నో కార్లు, స్కూటర్లు పార్కుచేసి వున్నాయి. సిటీ బస్సులలోంచి మనుష్యులు...ఆనంద మూర్తులు వరసగా దిగిపోతున్నారు. బీచ్ వాతావరణమంతా ఆనంద కోలాహలంగా వుంది. ఎటు చూచినా చిన్నపిల్లల కేరింతలే...ఎటు చూచినా యువతీ యువకుల జంటలే...సంతోష తరంగాలే...ఆ ఆనందంలో తనకు గాని, తన భార్యాబిడ్డలకు గాని ఎక్కడా చోటు లేదని గ్రహించడంతో పక్షికి ఆ వాతావరణం వెగటు గొల్పింది. అక్కడ ఒక్క క్షణం నిలవలేకపోయాడు... అంతేగాని అతను మారిపోలేదు. ఇక్కడ లేని చోటు అక్కడ పొందుదామని మళ్లీ వెనక్కి బయల్దేరాడు. గబగబా నడిచేడు. అతను తిరిగి హోటల్ చేరుకునే సరికి 8 గంటలయింది. అప్పటికి హోటల్ ముందు లాన్స్‌లోని టేబిళ్లన్నీ గలగల లాడిపోతున్నాయి... జంటలన్నీ మత్తెక్కి సోలిపోతున్నాయి. సర్వర్లందరూ హడావుడిగా తిరుగుతున్నారు. పక్షి ఆతురతగా మెట్లన్నీ గబగబా ఎక్కి లాన్సులో చూసేడు...నలువైపులా కలయచూసాడు...కాని మిత్రు లెవ్వరూ రాలేదు.. టేబిళ్లు గలగల లాడుతున్నాయి...బుడ్లు ఓపెన్ అవుతున్నాయి. అక్కడ నిలవలేక వెనక్కి తిరిగాడు.

సరిగ్గా అప్పుడే కన్పించింది సముద్రం పక్షి కళ్లకి...పగిలిన బ్రాందీ బుడ్డీలా! సరిగ్గా అప్పుడే కన్పించాయి బండరాళ్లు...సముద్రం బ్రాందీ బుడ్డీకి పగిలిన గాజుపెంకుల్లా!

అవును! అదంతా బ్రాందీయే అయుంటుంది! కాకపోతే కెరటాలకు ఆ తూగు ఎలా వస్తుంది? మత్తెక్కించే ఆ ఘోష ఎలా పుట్టుంది?

తన శరీరానికి ఆ తూగు...తన నరాలకు ఆ ఘోష కావాలి!! అప్పుడే ఓపెన్ చేసిన బ్రాందీ బుడ్డీలా సముద్రం నురుగులు కక్కుతూంది.

పక్షి గొంతుక తడిసిపోయింది. ఆ బ్రాందీ అంతా లాగి తన దాహం తీర్చుకోవాలనుకున్నాడు. అంతే! అతివేగంగా మెట్లు దిగి సముద్రంలోకి నడిచేడు.

అతన్ని చూసి భయపడిన సముద్రం 'ఒద్దు! ఒద్దు! నా దగ్గరకు రాకు' అని పెద్దగా అరుస్తూ వెనక్కి తగ్గింది. పక్షి చేతులు చాచుకుని ముందుకు దూకేడు...సముద్రం తన శక్తినంతా వినియోగించి ముందుకు తోసింది...కాని ఆ బలంకన్న పక్షి ఆత్మబలం గొప్పది.. అతడు తన దాహం తీరా సముద్రాన్ని తాగేడు...తమ సొత్తు కాజేస్తున్నాడని కాబోలు తాగుబోతు చేపలు అతని ముఖాన్ని పీకి ముందుకు తోసాయి. కాని పక్షి తన దాహాన్ని తీర్చుకునిగాని బయటకు రాలేదు.

కరుణాసముద్రుడు పక్షిని ఒడ్డుకు చేరవేసాడు. శరీరానికి మత్తెక్కించే ఆ సముద్రపు ఘోష వింటూ...బండరాళ్ల సందులో పక్షి మత్తుగా పడుకున్నాడు. ఆ మత్తు దిగదు...పక్షి ఆనందం చెదరదు.

---

# యోగప్రయోజనము

## శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

ఈనాడు- దేవుడు, అదృష్టము, మంత్రము, యోగము, జ్యోతిషము, పుణ్యము, పాపము— ఇత్యాద్యనేక విషయముల మీద జనులకు విశ్వాసము సడలుచున్నది. ఇందుకు మొదటి కారణము, పైని పేర్కొన్నవన్నియు ప్రత్యక్ష ప్రమాణమున కందక, అనుమాన ప్రమాణమునకు అందీ అందక, కేవలము ఆగమ ప్రమాణమునకు మాత్రమే గోచరించున వగుట. రెండవ కారణము, దేవుని సాక్షాత్కరించుకొన్న తత్త్వజ్ఞులుగాని, యోగమును సాధించిన యోగులు గాని, మంత్రజ్యోతిషాది విద్యలను కడముట్ట నెఱింగి తత్త్వభావమును జూపు వేత్తలుగాని కరవగుట. అతీంద్రియ విషయములు వస్తుతః బుద్ధి కందునవి కావు. అవి చిరకాలిక సాధన, తపస్సు, అంతర్వీక్షణము సలిపి తెలిసికొనదగినవి. ఇట్టి సాధనచేత తెలిసికొన్నను అవి తెలిసికొన్నవారికే తప్ప ఇతరుల కగమ్యములు. ఇతరులు, వానియందలి భక్తిచేతను, ఆశక్తులను సాక్షాత్కరింపజేసికొన్న యోగులు, తపస్వులు మున్నగు పెద్దల మీది విశ్వాసముచేతను మాత్రమే వానిని నమ్మవలసి యున్నది.

ఆంధ్రదేశమున పెక్కురు శైవసిద్ధులు, వేమన, వీరబ్రహ్మాది యోగులు ఇట్టి అతీంద్రియ విషయ సాక్షాత్కారము నందిన ఋషులు. అందు కనియే వేదభాష్య కర్తయగు సాయణు లిట్లన్నారు:— 'యః పరోక్షం పశ్యతి స ఋషిః. ఋషిర్దర్శనాత్' అతీంద్రియ విషయములను ఇంద్రియములతో దర్శించి నిర్వచింపబోవుట ప్రవాదము. అవి యీ ఇంద్రియములకు పరోక్షములు. వానిని యోగ పరిపూతమగు అంతర్దృష్టితోనే — ఆర్షదృష్టితోనే అనుభూతికి తెచ్చుకొనవలసియున్నది. అట్లు దర్శించిన వారి నుండియే మనము తద్విషయకమగు శిక్షణమును గాని, ఉపదేశమును గాని పొందవలయును. వేమనాదులకు పిదప ఆధునిక యుగమున అట్టి మహార్షులని చెప్పదగినవారు రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి, అరవిందయోగి ప్రభృతులు కొలదిమంది మాత్రమే. వీరిలో అరవిందుడు ఒక విశిష్టమైన దివ్యజీవనమునకు, పూర్ణయోగమునకు మార్గదర్శకు డైనాడు. కాని. ఆయన విశిష్టమార్గము గమ్యము నందుకొనక పూర్వమే, ఆయన సిద్ధి పొందినాడు. ఇప్పుడాయన మార్గమును కొనసాగింపవలసిన బాధ్యత తన్మార్గానుయాయులైన యోగ సాధకులపై నున్నది.

యోగ శబ్దమున కనేకార్థము లున్నవి. 'యోగ, స్సన్నహ, నోపాయ, ధ్యాన, సంగతి, యుక్తిషు' అని నిఘంటువు. యోగమనగా ప్రయత్నము, ఉపాయము, ధ్యానము, సంగతి, యుక్తి—అని వివిధార్థముల కవకాశ మున్నది. శబ్ద వ్యుత్పత్తినిబట్టి చూచినచో 'యుజ్యతే అనేన ఇతి యోగః' దీనిచేత పొందదగిన గమ్యముతో సాధకుడు డేకీభవించును. అనగా గమ్యము నందునని భావము' 'మానవుడు పొందదగిన పరమ గమ్యము భగవత్ప్రాప్తి' లేక, మోక్ష పురుషార్థ సంసిద్ధి. అని యెంచినచో, అందుకై చేయు ప్రయత్నముగాని, చేపట్టిన ఉపాయముగాని, యుక్తిగాని యోగమగుచున్నది. ఏ సాధనము ననుష్ఠించుటచేత సాధకుడు పొందవలసిన పరమ పురుషార్థ సిద్ధి నందునో, అది యోగమగుటలో ఆక్షేపము లేదు. ప్రత్యేకించి సాధకు డొనర్చు ఈశ్వరాది పదార్థముల

ముద్దేశించిన ధ్యానము గూడ యోగ మగుటలో నెట్టి విరోధమును లేదు. యోగ శబ్దమున కింతటి విస్తృతార్థ మున్నది. మరొక నిర్వచనము 'తాం యోగ మితి మన్యన్తే స్థిరా మింద్రియ ధారణాం' అని. అనగా, జ్ఞాన కర్మేంద్రియములను, అంతరింద్రియ మగు మనస్సును స్వాధీన మొనర్చుకొని, వాని నొక ధ్యేయ వస్తువుపై నిలకడ గూర్చుటయే యోగమే! అని.

మంత్ర, లయ, హఠాది భేదములచే ఈ యోగము పలుభేదములు గలది. అందు, పతం జలి యోగమును రాజయోగమని పిలుచుట పరిపాటి. తక్కిన యోగము లన్నింటిలో ఇది రాజువంటి దగుట చేతనే దీని కీ పేరు సార్థక మగుచున్నది. మంత్ర జపమువలన, ఆయా దేవతల (శక్తుల) నుపాసించి, ఆయా సిద్ధులను సంపాదించునది మంత్రయోగము. మనస్సును ఆత్మయందు గాని, మరొక ధ్యేయవస్తువు నందుగాని లయింపజేయునది లయ యోగము. అనేక ములగు ఆసనములు మున్నగు శరీర క్రియలచేత, దేహమును జరామరణ భయవర్జితము చేయునది హఠ యోగము. ఈ మూటిలోను హఠయోగము క్లిష్టమును, ప్రమాద భూయిష్ఠమును అయినది. ఈ యోగ మహిమను శ్వేతాశ్వతరోపనిషత్తు క్రింది రీతి వర్ణించు చున్నది.

> 'న తస్య రోగో న జరా న మృత్యుః,
> ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరం.'

యోగాగ్ని తప్తమగు శరీరముగల వానిని రోగములు, జరామృత్యువులు అంటవు. కాని ఈ హఠ యోగమందరికిని సిద్ధించునది కాదు.

యోగ శబ్దమునకు ఈశ్వరప్రాప్తి సాధనమని అర్థము చెప్పుకొన్నయెడల—జానము, భక్తి, కర్మము, ధ్యానము, ఉపాసనము, ప్రార్థనము—మున్నగునవి సైతము యోగములే అగుచున్నవి. అందుకే గీతా కారుడు గీతలో తానుపదేశించిన సాంఖ్యాదులన్నింటికీ యోగశబ్దమునుచేర్చి తురీయ పురుషార్థ సాధనములే యివి అన్నియునని సాధనమార్గములు కానంత్యమును సంపాదించినాడు. భగవత్ప్రాప్తికి శతాధిక, సహస్రాధిక సాధనములున్నవని అనేక మహర్షులయు, సాధులయు, భక్తులయు జీవిత చర్యలనుబట్టి మన గ్రహింపవచ్చును.

హఠయోగమువలెగాక, మంత్ర, లయ, రాజ యోగములు సౌమ్యమైన సాధన ప్రణాళికతో గూడి నట్టివి. ఈ మూటిలోకూడ, రాజయోగము రాజ యోగమే; అనేకులనుష్ఠించునది రాజయోగమే. మంత్రయోగమును గూడ పెక్కురు సాధకు లాచ రింతురుగాని, సిద్ధివరకు ప్రయత్నించినవారి సంఖ్య మిక్కిలి తక్కువ.

'చిత్తవృత్తుల నిరోధము యోగ'మని పతంజలి అను శాసనము. (యోగ శ్చిత్తవృత్తి నిరోధః. ప. యో. సూ.) ఈ చిత్తవృత్తుల నిరోధ మంత తేలికైన పని గాదు. దీని కనుసరింపదగిన సాధన ప్రణాళిక యెంతయో ఉన్నది. సాధకులు ఉత్తము లనియు, మధ్యములనియు, అధములనియు మూడు విధములుగా నుందురు. ఉత్తమ సాధకులకు గుర్వను గ్రహమున చిత్తవృత్తి నిరోధము సుకరముగా సిద్ధింప వచ్చును. కాని తక్కిన రెండు తరగతులవారికిని అది సులభము గాదు. వా రనుష్ఠింపదగినది ఎంతయో ఉన్నది. దానినే—యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి—అని ఎనిమిది రీతుల పతంజలి తన యోగ శాస్త్రములో సాధన పాదమున వివరించినాడు. ఈ అష్టాంగ యోగ సాధనము శైవములోను శాక్తము లోను భూయిష్ఠముగా ఉన్నట్టిదే. మొహంజోదారో, హరప్పాలలో దొరకిన ప్రాచీన శిల్పమూర్తులలో ధ్యాన వస్థలోనున్న ఒక విగ్రహము దొరికినది. దానినిబట్టి హిందూదేశమున యోగవిద్య యెంత పురాతన కాలము నుండి కలదో ఊహింపవచ్చును. అనేకులగు ప్రాచీన శివయోగులు ఈ యోగ మార్గమునకు పట్టు గొమ్మలు.

'శైవసిద్ధులెల్ల చాటినా రష్టాంగ
యోగమార్గ ముత్తమోత్తమమని;
కపటయోగులెట్లు కనుగొందు రద్దాని?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర!

యోగమును కేవలము మోక్ష విద్యగానే భావింపనక్కరలేదు. ఐహికముగగూడ యోగమువలన అనేక ప్రయోజనములు కలుగుచున్నవి. యోగమనగానే ముక్కు మూసికొని మూలకూర్చుండుట అను భావన వ్యాపించియున్నందున, దాని జోలి కెవ్వరును పోవుటలేదు గని, యోగ ప్రయోజనములను సాంగ ముగ పర్యాలోచించిన వారెవ్వరును, దాని నుపే క్షింపరు ఒకానొక కాలమున యోగమునునది కేవ లము. ముముక్షువులకేగాని, జనసామాన్యమునకు గాదను దురుద్దేశ్యమేదో జనులలో వ్యాపించినది. ఆ యభిప్రాయమును చాలవరకు నుగియోగీశ్వరుడగు పోతులూరి వీరబ్రహ్మము పోగొట్టుటకు ప్రచారము చేసినాడు. తన కుటుంబమునకు, శిష్యకుటుంబములకు యోగము నవశ్యానుష్ఠేయ సాధనముగునట్లు ఆ యోగివర్యుడు చేయగలిగినాడు. అటుపిమ్మట ఈ యుగమున దానిని పునరుద్ధరింప దీక్షపూనిన వాడు అరవిందమహా యోగియొక్కరుడే!

యోగములోని మొదటి రెండంగములును యమము,నియమము—అనునవి. ఇందు యమము బ్రహ్మ చర్యము అహింస, అస్తేయము, సత్యము, అపరిగ్రహము— అను నయిదు విషయములతో నొప్పును. సత్యాహింసా వ్రతముల గొప్పదన మెట్టిదో మనకు గాంధిమహాత్ముడే ప్రబోధించి పోయినాడు. బ్రహ్మచర్య మనగా వీర్య ధార ణము కదా. దానివల్ల మనుజునకు కలుగు దివ్యశక్తి అమోఘమైనది. వెలుపలికి ప్రవహింపని వీర్యము— ఊర్ధ్వాభిముఖమై ఓజస్సను దివ్యశక్తిగా మారు చుండును. ఊర్ధ్వరేతస్కుడగు వాని శక్తి అప్రతి హత మనుటలో ఎవ్వరికినీ అభ్యంతరము లేదు. పరమ శివుడు ఊర్ధ్వరేతుడే కదా! 'ఊర్ధ్వరేతం విరూ పాక్షం' అని మనమా మహాదేవుని స్తుతించుచున్నామే కాని, బ్రహ్మచర్యమును పాలింప బూనుటలేదు. గృహ స్థులకీ బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన మెట్లని శంకింప వచ్చును. అందుకు గూడ తగిన మార్గము లున్నవి. యాజ్ఞవల్క్య మహర్షి గృహస్థు లనుసరింపదగిన బ్రహ్మచర్యమును గూర్చి యిట్లు పలికినాడు—

'ఋతౌ ఋతౌ స్వదారేషు
సంగతి ర్యా విధానతః
బ్రహ్మచర్యం తదే వోక్తం
గృహస్థాశ్రమ వాసినాం.'

గృహస్థునికి స్వదారతో నియమబద్ధ ప్రవర్త నమే బ్రహ్మ చర్యము. యోగులలో అనేకులు గృహస్థులై యుండుట మనకు తెలియనిదికాదు. అహింసవల్ల కలుగు ఫలము ఆయా క్రూరప్రాణు ములతో సైతము మైత్రి నెంపొందుట. మన ఋషుల ఆశ్రమములలో ఎలుకలు, పిల్లులు, పాములు, నెమిళ్ళు, గజములు, సింహములు స్నేహముతో మెలగి నట్లు పురాణ కావ్యములలో వర్ణనములు చదివి తత్త్వము తెలియక అవి అతిశయోక్తులనుకొని ఆ కవు లను పరిహసించు చుందుము. ఇది పొరపాటు ఆ మహ ర్షులు అహింసాదులను పూర్ణముగా అనుష్ఠించి తత్ఫలములనందుట వల్లనే వారి యాశ్రమములలోని ప్రాణులుగూడ స్నేహముతో మెలగినట్లు తెలిసికో వలయును. అహింసకు పూర్వ స్థితి అద్వేషము. ఎవరియందును ద్వేషము లేకున్నచో హింసించుట పొస గదు. ద్వేషరాహిత్యమనుగుణము విశ్వప్రేమ భావము నకు పునాది యగుచున్నదికదా. ఈ విధముగా చూచినచో సత్యాహింసాదుల అనుష్ఠానము, సాధకునికి లౌకికముగా గూడనెట్టి ప్రయోజనములను సాధించి పెట్టునో తెలియగలదు.

నియమములు—శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము— అనునంగము లున్నవి. శౌచమనునది మానసికము, వాచికము, కాయ కము అని త్రివిధములు. తన మనోవాక్కాయములను పరిశుద్ధముగా నుంచుకొనుట ప్రతివానికివి కర్త వ్యముకాదా! అది లేనివా డపరిశుద్ధుడై పోవుటలో వింతయేమి? ఇందలి తపస్స్వాధ్యాయాదుల స్వరూ పము నీ చిన్ని వ్యాసమున వివరింప నయితిగాదు. మొత్తమువిూద, యమనియమములట రెండంగముల నాచరించుటచేతనే మానవుడెంతటి శిష్టుడుగానో, మహామభావుడుగానో తయారగుచున్నాడు.

తరువాతిది ఆసనము. ఆసనము ముఖ్యముగా శరీర సంబంధి. ఈ ఆసనములు సహస్ర సంఖ్యలో

మున్నవి. అందుండి 128 ముఖ్యములన్నారు. ఆసనాభ్యాసమువలన మనుజుని శరీరములోనున్న రోగములు దూరమయి చక్కని ఆరోగ్యము నెలకొనగలదు. కరచరణాద్యవయవములు, కండరములు, ఇంద్రియములు వరునకు వశము కాగలవు. యమ నియమాసనముల నభ్యసించుటచేత మనుష్యుని త్రికరణములని చెప్పదగిన మనోవాక్కాయములు మాలిన్య దూరములయి పవిత్రములగుట లేదా? ఈ పవిత్రత ఒక్కపారమార్థికముగనే కాక, ప్రాపంచికముగను మానవున కెన్ని ప్రయోజనములను సంపాదించి పెట్టుచున్నదో తెలియనగు. ఈనాడు విద్యాశాలలలో చేయించు శరీరపరిశ్రమ (వ్యాయామము)కు యోగములోని ఆసన విధానములను జోడించినచో ఉత్తమ పౌరులు కాదగిన విద్యార్థులెట్టి ఆదర్శ మానవులు కాగలరో ఊహించుకొనవచ్చును. అట్లేయమ నియమములుకూడ యోగ్య మానవులను సృష్టించుట కుపయోగించు శిక్షణ సాధనములుగూడననుట మన విద్యాధికారులు, విద్యావేత్తలు గుర్తింపవలసి యున్నది.

ఇక నాల్గవ యోగాంగము, ప్రాణాయామము. ప్రాణాయామము పలువిధములుగానుండును. యోగ్యుడగు నాచార్యుడు శిష్యుల అర్హతానర్హతల నెరింగి, వివరికెట్టి ప్రాణాయామము సరిపడునో వారి కట్టి దానినుపదేశించి సాధన చేయింపవలయును. అట్లుకాక అందరికొకే ప్రణాళిక నుపయోగింపరాదు. ప్రాణాయామమనగా వాయు సాధన, వాయు నిరోధము అని స్థూలముగా తలంచుచుందురు. కాని యోగుల అనుభవమును దృష్టిలోనుంచుకొని సూక్ష్మముగా ప్రాణాయామముయొక్క తత్వార్థమును భావింపవలసి యున్నది.

గాలిలో ప్రాణశక్తి విలక్షణముగా నుండును. అది మనుష్య ప్రాణులలో హృదయదేశమునుండి బహిర్గతమగుచు, మరల వెలుపలనుండి హృదయము వరకు పోవుచు శరీరములో జీవునియొక్క ఉనికిని సూచించుచుండును.' ఈ ప్రాణము స్థూలశరీరము నాశ్రయించియున్నను, దాని సూక్ష్మశక్తులు సూక్ష్మ శరీర గతములయియే యుండును. అందుకే తత్వశాస్త్రము 'బుద్ధి కర్మేంద్రియైః ప్రాణపంచకైః ర్మనసా ధియా, శరీరం సప్తదశభిః సూక్ష్మం తల్లింగ ముచ్యతే' కర్మజ్ఞానేంద్రియలు పది, పంచ ప్రాణములు, మనస్సు, బుద్ధి — అనుపదునేడును సూక్ష్మ (లింగ) శరీరమని చెప్పుచున్నది. ప్రాణాయామము, స్థూల శరీరగత ప్రాణశక్తిని వశీకరించుకొనుటతో నారంభమయి సూక్ష్మ శరీరగత ప్రాణశక్తి వశీకరణమువరకు పయనించవలసియున్నది. ఇది సుసూక్ష్మమగు ప్రాణాయామ ప్రకారము సర్వసాధకాసాధారణము కాదు.

'ప్రాణ +ఆయామము' అను సమస్త పదమును పరిశీలింతము. ఆయామపదమునకు దైర్ఘ్యము (పొడుగు) నిజార్థము కదా! కనుక, ప్రాణాయామమనగా ప్రాణమును దీర్ఘీకరించుకొనుట యని యేర్పడుచున్నది. ప్రాణమును=ఆయుష్కాలమును పెంచుకొనుటయని సారాంశము. ఏతావతా, ప్రాణాయామమనుయోగాంగాభ్యాసము ఆయుర్వృద్ధికర మన్నమాట. మన ప్రాచీనయోగులు దీర్ఘకాలము జీవించినట్లు మనకనేక నిదర్శనములున్నవి. ఇదియెట్లు సాధ్యము?' 'శతాయుర్వై పురుషః' అను ప్రమాణమునుబట్టి 120 ఏండ్లు ఆయుః ప్రమాణము—ఇది ఎంతటి ఆరోగ్య భాగ్యము కలవారికో కాని సాధ్యముకాదు. ఇట్టి స్థితిలో వందలయేండ్లు జీవించుటకు ఈ ప్రాణాయామసిద్ధియే హేతువు. బందరులో ఈ శతాబ్దారంభమున నున్న దొంతులమ్మయు, గుంటూరులో సమాధి నిష్ఠుడయిన మస్తాను సాహెబును కొన్ని వందలయేండ్లనుండి యున్నట్లు మన తండ్రి తాతలు చెప్పుచుండువారు. వారు ప్రాణాయామ సిద్ధినందిన మహాయోగులు కనుకనే, వారి కట్టి ఆయుర్వృద్ధి కలిగినది.

ఈ వ్యాసమున యోగములోని నాలుగంగముల ప్రయోజనములను మాత్రము అతిసంగ్రహముగా సూచించుటయైనది. ఇంకతక్కిన ధ్యానధారణాదుల జోలికే పోలేదు.

దీని కంతటికీ సారాంశము, యోగమనువది ముముక్షు జనులకు మాత్రమే కాదనియు, సర్వాశ్రమస్థులకును స్త్రీ బాలవృద్ధాది భేదములేక సముపాస్యము, ఆచరణీయమననియు యోగసేవవలన నరుడు—భార్యకు ఉత్తమ భర్తయు, బిడ్డలకు ఆదర్శ పితయు, తలిదండ్రులకు యోగ్యపుత్రుడును శిష్యులకు పరమ గురువును సమాజమునకు సముద్ధారకుడును, సర్వభూతములకు నేస్తమును, భగవంతునికి అత్యంత సన్నిహితుడును, ఆత్మీయుడును కాగలుగుచున్నాడు. తన లౌకిక పారమార్థిక జీవనములలో అసదృశ వ్యక్తిగా రూపొంది తాను తరించి, పరులను తరింపజేయ గలుగుచున్నాడు.

# పిలుపు!

శ్రీ కె. శివారెడ్డి

ఎవరన్నా
రాకపోతారా అని
తలుపులు తెరిచే ఉంచాను

ఎప్పుడూ
తెరిచే ఉంటాయి
అందరినీ ఆహ్వానిస్తూ—

పల్లవాల్లాంటి పాదాల్తో
అతిమృదువుగా గాలిలా
తరలివచ్చి నా ఇంటిని పావనం చెయ్యక పోతారా అని—

ఎవరన్నా వచ్చిన
చిరునవ్వు అలికిడి
నా ఏటి నిశ్శబ్దం మీద ఒక్కరాయి విసిరితే
స్తబ్ధతంతా విరిగి
వాన్లో తడిసిన పాత ఇంటిమట్టి గోడలా కూల్తుందని—

ఎల్లప్పుడూ
తలుపులు తెరిచే ఉంచుతాను
ఆ దారిని పోతూ ఎవరన్నా
ఒక్కచూపు విసిరితే కిటికీలో గుండన్నా
నట్టిల్లంతా చూపుల మంటల్తో వెచ్చదనం పొందక పోతుందా అని—

లోపల
ఒక్క పురుగన్నా లేని
కుర్చీలు, బెంచీలన్నీ ఖాళీగా ఉన్న
నిరీక్షణలో మునిగిన ఉద్యాన వనంలా
బాహువులెత్తి—యుగాల ఎదురు తెన్నుల్లో—
తలుపులు తీసి నిలబడి ఉన్నాను
ఊహుఁ ఎవ్వరూ రాలేదు—రాలేరా?

ఈదురు గాల్లో
టప టప కొట్టుకుంటున్న ఆకుల్లా—రెప్పలు
అల్లల్లాడుతున్నా
శూన్యంతోనిండి, అంధకారంతో బండబారిన
కనుగుడ్లులేని—గుంటలువడ్డ లొట్టకళ్లనావి—
ఎవరైతే మాత్రం ఎలా రాగలరు?
కళ్ళుంటే తప్ప, గుండెలుంటే తప్ప!

---

# హరప్పా మొహెంజొదారో లిపులు

## శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి

ఆంధ్రేతిహాసిక పరిశోధక మండలివారు ఆంగ్లమున ప్రకటించుచుండిన పత్రికను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు పుచ్చుకొని Vol XXXIII-Part సంచికను, డా. అర్. సుబ్రహ్మణ్యంగారు ప్రధాన సంపాదకులుగాను, శ్రీ మహమద్ అబ్దుల్ వహీద్‌ఖాను గారు సహాయ సంపాదకులుగాను వెలువరించిన ఈ సంచికలో శ్రీ ఎస్. అర్. రావు (M A) Superintending Archaeologist, Archaeological Survey of India, వారిది, ఒక్కటే వ్యాసము, బొమ్మల లిపులతోను, వానికి శ్రీ రావుగారి నూతన వివరణములతోను ముద్రింపబడినది. పుట లేమో రాయలు సైజులో 42 ధర రు 6–50. వట్టి కాగితపు అట్ట. పరిశోధక విషయము కాబట్టి, పరిశోధక పండితులు ధనికు లగుదురో కారో గాని వస్తుగౌరవము చేత కాబోలు ఈ మహాధర. సామాన్యు లింత ధర పెట్టజాలరు. దీనిపేరు— The Indus people Begin to Speak.

### సింధు నాగరికత

దాదాపు అర్ధ శతాబ్దముగా ప్రపంచ పురాతత్త్వ పరిశోధకులను, చరిత్రకారులను గగ్గోలు పరచుచుండిన ఈ లిపి లలాట లిపిని మించి మానవులను బాధించుచుండినట్టి ఆఖరుకు సులభముగా విడిపోయినది. శ్రీ ఎస్ అర్. రావుగారు చక్కగా పరిశోధించి చేసిన నిర్ణయము ఇక అప్రతిహతమని తోచుచున్నది. ఇక ముమ్ముందు మనము చేయగల పరిశోధనలకు చక్కని పునాది ఏర్పడినది చాల సంతోషింపదగిన విషయము. చరిత్రకారులకు సామాన్య విద్యావంతులకు అసలు విషయము చక్కగా అవగత మగుటకు వివరముగా వ్రాయుచున్నాను.

### మన భారతీయ లిపులు

వీనిని లిపు లనుట తప్పు. ఒక్క లిపియొక్క క్రమ పరిణామము గాన వ్రాత భేదము లనుటయే సరి. ఎందుల కనగా అన్ని భారతీయ లిపులును అశోక చక్రవర్తియొక్క బ్రాహ్మీ లిపినుండి పరిణామ మందిన పుత్రికలు, పౌత్రికలు, ప్రపౌత్రికలు, సందేహమే లేదు.

ప్రపంచములోని అనేక లిపులను ప్రధానముగా నాలుగైదుగా వర్గీకరింపవచ్చును. (1) ఈజిప్టు దేశపు చిత్రలిపి (హీరో గ్లిఫిక్) చాల ప్రాచీనమైనదనియు దానినుండి వంకరగీటుల లిపియు, అందుండి వ్రాతయు వచ్చినదట. ఇది కుడివైపునుండి ఎడమవైపునకు వ్రాయబడును. (2) రెండవది కీల లిపి. ఆసియాఖండమందలి పారసీకాది దేశములలో బాణములవంటి గీతలతో వ్రాయుచుండిరి ఇది ఈజిప్టు లిపికన్న చాల ప్రాచీనమేమో. సుమేరియను (మేరుః సుమేరుః హేమాద్రీ?) లనబడువారును (క్రీ. పూ. 4500) వారినుండి బాబిలోనియనులును అసీరియనులును, వారి ననుసరించినవారును ఉపయోగించి క్రమపరిణామమంది పారసీకులవరకును వచ్చినటువెంట్లిది. దీనికి అక్షరాత్మకమైన గుణింతము కూడ నుండినదట. (3) మూడవది క్రీటు అనబడు మధ్యధరా సముద్రపు లిపి—చిత్రలిపి వంటిది (4) నాల్గవది సెమిటిక్‌లిపి, సిరియాదేశముది. దీనికి ఈజిప్టు గ్రీకు లిపులతో సాజాత్య మున్నది. కుడినుండి ఎడమకు

రచన. అన్నియు హల్లులేవట, అచ్చులే లేవు. యూరపుఖండమువారికి మాత్రమే గాక అనేక నాగరక జాతులవారి లిపుల కిది మూలము ఫొనీషి యనులనబడు (ఫణిక్—వణిక్—వాణిజ్యంద్రో వాణి కోమటిః—మల్లినాథసూరి, వైశ్యవంశ సుధాకరము?) పోతవర్తకులు ఈ లిపుల నన్నిటిని కలిపి ఒకలిపి తయారుచేసి దానినుండియే గ్రీకులు మొదలైనవారు గ్రహించిరని యొక్క సిద్ధాంతము — అంగీకృతము ఉన్నది. వీరు సిరియావారే. భూమార్గమునను జల మార్గమునను ప్రపంచమందలి సందుగొందులకు వ్యాపించి వ్యాపారము చేయుచుండిరి. అచ్చులులేని 22 అక్షరములను కుడినుండి ఎడమకు వ్రాయుచుండిరి.

లిపి శాస్త్రకారులు వీనినుండి పరిణామమందిన లిపులను మరల నాలుగుగా విభాగము చేసిరి. (1) యూరపియను లిపులు (2) పశ్చిమ ఆసియా లిపులు (3) తూర్పు ఆసియా లిపులు (4) భార తీయ లిపులు.

(1) యూరపునందలి లిపులు గ్రీకులిపి నుండి పుట్టినవి. గ్రీకులు దీనిని ఫొనీషియనులనుండి గ్రహించి క్రమముగా మార్చుకొని ఎడమనుండి కుడికి వ్రాయనారంభించిరి. ఇటలీ రోమక సామ్రాజ్యకాలము నుండి వ్యాపించి ఇంగ్లీషు వారికికూడా ఆధారమైనది.

(2) పశ్చిమ ఆసియా లిపులు సెమిటిక్ లిపినుండి పుట్టిన అరెమానియను లిపినుండి పరిణ మించినవి. యూదులు (జ్యూస్) అనగా హీబ్రూ వారు. అరబ్బీ, పారసీ సిరియాదేశాల లిపులు దీని నుండి వచ్చినవే. మన ఉరుదు కూడ దీని ననుసరించినదే.

(3) తూర్పు ఆసియా అనగా, చీనా, జపాను టిబెట్టు మున్నగు దేశాలు. చీనా వారిది ఈజిప్టువారి దానివలె చిత్రలేఖనమునుండి ఉద్భవించినను ఎక్కువ మార్పునందలేదు. వ్రాతపైనుండి క్రిందికి, అక్ష రముక్రింద అక్షరము.

(4) మన భారతీయ లిపు లన్నియు అశోకుని శాసన లిపులనుండి పుట్టినవే. ప్రస్తుతము మన భారతదేశమందు లెక్కలేని భాషలు, లిపులు. గందరగోళముగా నున్నది. కాశ్మీరమందలి శారద, పంజాబులో గురుముఖి, బెంగాలునుండి మహారాష్ట్రము వఱకు, నాగరి, గుజరాత్‌లో తల గీటులేని నాగరి, ఒరిస్సాలో ఓఢ్రము, మహారాష్ట్రమందు తర్వాత మోడీబాలబంధు, దక్షిణమందు తుళు, మలయాళము, తమిళము, తెలుగు, కన్నడము, సింహళము, బర్మా, జావా, సయాం సుమత్రా లిపులు—ఇవన్నియు అశోకుని లిపులనుండి వచ్చినవే. తమిళ ప్రాచీన గ్రంథాక్షరియు, వట్టెళుత్తు కూడ.

అశోక లిపి మొదట రెండుగా—గుప్త లిపి, గుహ లిపిగా చీలినది. గుప్త లిపినుండి ప్రాచీన నంది నాగరిలిపియు, అందుండి ఆర్యావర్తపు లిపులును ప్రస్తుతపు నాగరిలిపియు జనించినవి.

గుహ లిపినుండి చేరలిపి, చాళుక్య లిపి, వేంగి లిపియు పుట్టినవి అశోకలిపి దక్షిణమున హైదరాబాదు, మైసూరు, రాయలసీమ, భట్టిప్రోలు, అమరావతి, జగ్గయ్యపేటలకు వ్యాపించి ద్రావిడ బ్రాహ్మి యైనది. ఆంధ్రరాజులు గుహలలో వేయించిన శాసనములే మన దాక్షిణాత్య లిపులకు మాతృక. వీనినుండి తర్వాత కదంబ, గంగ, పల్లవ, రాష్ట్రకూట, పూర్వ పశ్చిమ చాళుక్య, చేర చోళరాజుల లిపులును. కళింగ గాంగలిపినుండి నేటి ఓఢ్రలిపి. వట్టెళుత్తనబడు తమిళ లిపి స్వతంత్ర మందురుగాని కాదని ఆధునిక సిద్ధాంతము. అది కూడ చేరలిపినుండి పుట్టినదే. చేర లిపినుండి పురాతన గ్రంథలిపియు అందుండి తుళుమళయాళ లిపులును, మధ్య గ్రంథాక్షరములును వీని నుండి ఆధునిక తమిళ లిపులును పుట్టినవి. చాళుక్య లిపికిని వేంగిలిపికిని భేదములేదు. ఇవి క్రమముగా పశ్చిమ చాళుక్య లిపిగాను పూర్వచాళుక్య లిపిగాను కొద్ది ప్రాంతీయత నందినను కాకతీయులు వఱకును ఒకటే. వీనినుండి హళెగన్నడమును, ఆధునిక కన్నడమును, పాత తెలుగు ఇప్పటి తెలుగును పుట్టినవి. కొన్ని వంకరసుడులుతప్ప నేటి తెలుగు కన్నడ లిపులకు భేదము లేదు మన వేంగిలిపి నుండియే జావా లిపి పుట్టినది.

## మన సంస్కృతమునకు సొంత లిపిలేదు!

మన ప్రాచీనులు మనకు లెక్కలేని శాస్త్రములు వ్రాసి నెత్తిన రుద్దినారుగాని, ముఖ్యమైనది లిపి శాస్త్రము వ్రాసి మనలలాటమున రుద్దియుండిన మనలిపి ఇంతకన్న బాగుండెడిది. లెక్కలేని వ్యాకరణ గ్రంథములు వ్రాసి భాషనుకట్టి హద్దులో నిలిపిన వారు లిపిని గురించి బొత్తుగా మరచిపోయినారు. వారే ఒక లిపి శాస్త్రము వ్రాసియుండిన యెడల మన లిపికూడ, సంస్కృతభాషవలె, అట్లే నిలిచి పోయి, ఆ కల్పాంతము ఎట్టివారును పొందక, దేశము ఇన్ని తునుకలుగా పగిలిపోక ఉండియుండు నేమో. ఆ భాగ్యము అభాగ్యమైనది. లిపి ఆచరణ యోగ్యమైనందునను, వ్రాయువారు కొద్దిమందియే యుండినందునను (వ్రాయసం—రాయసం?) గురు శిష్య పరంపరగా ఒకరినిచూచి యొకరు (కాయసులు మాత్రమే కాబోలు?) నేర్చుకొనుచుండిరి. కవులును పండితులు నోటిమాటలవారే. కవిత్వము చెప్పెడివారే గాని వ్రాయువారు వేరు. లిపికారులు, అదొక ప్రత్యేక విద్య కాబట్టి లిపి క్రమముగా ప్రాంతీయ భేదమును పొందినది. పైగా—ఒక గొప్ప రహస్యము—సంస్కృత భాషకు సొంతముగా పేరుగాని లిపిగాని లేదు. చూడగా ఊరు పేరులేని భాష. పాణిన్యాచార్యుడు వ్యాకరణకారులలో చాల తర్వాతివాడు. ఆతడు కూడ తనది భాషావ్యాకరణ మన్నాడుగాని సంస్కృత వ్యాకరణ మనలేదు. రామాయణమందు సంస్కృత శబ్దము కలదు గాని అది భాషాపరముగా గాక సంస్కార పర ముగా (Cultured) వాడబడినట్లు కలదు. ఇల్వలు డును, ఆంజనేయుడును సంస్కృతము భాషింతురు. భాషాపరముగా నిస్సందేహ ప్రయోగము మృచ్ఛకటి యందే. ఇంత వ్యాకరణమును పాణిని ఏ లిపిలో వ్రాసెనో లేక వ్రాయించెనో గాని లెక్కలేని లిపులను పేర్కొనియున్నాడు. మరి ఇది రెండవ రహస్యము— సంస్కృతమునకు తనదని లిపి కూడ లేకపోవుట. ఆయా ప్రాంతములవారు తమతమ ప్రాంతీయ లిపులలో సంస్కృతమును వ్రాసికొనుచుండిరి — మలయాళ తమిళ దేశములలో గ్రంథాక్షరి, ఆంధ్రదేశమందు తెలుగు లిపి, కర్ణాటకమందు కన్నడలిపి, కలకత్తా వారొక లిపి, బొంబాయి వారొకటి, కాశ్మీరుమందు శారద, గుజరాతు మధ్యప్రదేశ మహారాష్ట్రాదులు తమ తమ లిపులు. ఆంగ్లేయులు వచ్చి, ముద్రణము ప్రారంభమై, ఇంగ్లీషు అర్థము ఉపోద్ఘాతములలో నాగరాక్షరములతో గ్రంథ ముద్రణము ప్రారంభమై నంతట, హిందూదేశమందేకాక ప్రపంచమంతయు నాగరాక్షరములు పర్వి అదే సంస్కృత లిపి యను భ్రమ చాలమందికి కలిగినది. ఏకొందరు సంస్కృత పండితులో తప్ప చాలమందికి ఈ విషయము తెలియదు. సంస్కృతభాషకు ఆ పేరెట్లు కలిగినదనుటను గూర్చి ఒక ప్రత్యేక వ్యాసము వ్రాయ తగును.

మరి అశోకలిపి మన లిపుల కన్నిటికి మూల మనుటకూడ పాశ్చాత్య పండితుల పరిశోధనవలననే మనకు తెలియవచ్చినది—లిఖిత రూపమున మనకు దొరకిన అతిప్రాచీన సమగ్ర లిపి అశోకునిదే. ఇతని శాసన ములలో రెండు విధములైన లిపులు ఖరోష్ఠి—కుడి నుండి ఎడమకు వ్రాయబడునదియు, బ్రాహ్మి—ఎడమ నుండి కుడివైపునకు వ్రాయబడునదియు నుండినవి. భారతదేశ వాయవ్య ప్రాంతమున ఖరోష్ఠికి చాలకొద్ది ప్రచారముండినదిగాని దేశమంతయు బ్రాహ్మియే అద్భుతమైనది. చక్కగా ఏర్పాటైన వర్ణసమామ్నా యము నాటికే సిద్ధముగా నుండినదనుట నిశ్చయము తత్పూర్వము ఎంతకాలమునుండియో పరిణామము నందియుండవలెను గదా.

ఈ పరిణామము, ఇచటనే, భారతదేశముందే, జరిగియుండినయెడల అందులకు తగిన గుర్తు ఒక్కటి కూడ దొరకక అంతయు తుడుచుకొని పోయినదా? లేక చక్కని లిపి యుండియు మనవారు అశోకునికి ముందు బొత్తుగా శాసనములు చెక్కించు అలవాటు లేనివారా? పాశ్చాత్య పండితులు మనదేశమున మిక్కిలి పురాతన కాలమున లిపి లేదనియు బౌద్ధుల కాలముననే అది వచ్చినదనియు విశేషముగా ఉపపత్తులుచూపి వ్రాసియున్నారు. అందులకు మనవారు ఆగ్రహ

పూరితులై మనకిది అవమానకరమని భావించి వైదిక కాలమునుండియు లిపియుండెననియు, అట్లు తలంచుటకు లెక్కలేని ప్రమాణములు కలవనియు, బుద్ధునకే 64 లిపులు తెలిసియుండెనదనియు, పాణినీయాది వ్యాకరణములు లిపులను పేర్కొనుచున్నవనియు, జ్యోతిషాది గ్రంథములలోని విషయముల వలనను, లిపి లేకుండ ఉండియుండదనియు శరపరంపరలుగా గ్రంథములు వ్రాసియున్నారు.

కాని అశోకుని పూర్వమువని గ్రంథాధారములే గాని దొరకిన ప్రత్యక్షోదాహరణములు ఒకటి రెండే, ఒకటి పిప్రవా పాత్ర శాసనము, బుద్ధుని నాటిదో కొంత తర్వాతిదో? కాని అశోకునికి చాల ముందుదే. ఉత్తరమున కాశ్మీరమునను, దక్షిణమున భట్టిప్రోలులోను దొరకినవి కొన్ని ప్రాచీనములు, అని తోచుచున్నది. నిశ్చయము తేలలేదు. కొన్ని శైశునాగ శిలా ప్రతిమలమీద కొన్ని అక్షరములు దొరకినవి ఆశ్చర్యమేమనగా, వాఙ్మయమునుబట్టి చూడగా కొల్లలుగా దొరకవలసిన శాసనములు ఇంత కొద్దిగా దొరకుటయే! శిలా శాసనములు చెక్కించుటయో, పాత్రల మీదను ప్రతిమల మీదను వ్రాయుటయో తక్కువగానుండి, ఒక్కమారు ఉప్పెనవలె పొంగినదా! క్రమ పరిణామమునకు ఇది విరుద్ధము గదా.

అతిపురాతనకాలమందు భారతదేశమందు లిపి యొకటి యుండినట్లు ఈ మొహెంజోదారో హరప్ప ప్రదేశముల శాసనములవలన తేలినది. త్రవ్వను త్రవ్వను క్రొత్తవి బయలుదేరుచున్నవి, వీనియందు విశేషమేమనగా, ఎక్కువగా ముద్రికలు దొరకుట, వాని మీద బొమ్మలును, బొమ్మలనుండి మార్పునందిన లిపివంటి గుర్తులును, చక్కని నగరము లుండిన వాస్తుశకలములగు పునాదులును దొరకినవి. ఈ నాగరికత యెంతయు క్రీ. పూ 2000 చిల్లర 3000 చిల్లర యేండ్లకు మునుపటివని పురాతత్త్వ శాస్త్రకారుల అంచనా. మఱి యీ లిపి యొక్క ప్రపంచ సమస్యగా నేర్పడినది. సర్ జాన్ మార్షలు దీని ప్రథమ పరిశోధకులు. ఈ జనులకు లిపి పరిచయము చక్కగా నుండినదనియు, వ్రాత సాధనము లేవియుండెడివోగాని వ్యాపారము నిమిత్తము, మఱి యితర నిమిత్తమును ఉపయోగించియుండిరనియు, ఈ ముద్రికలు తాయెతులుగానో రక్షరేకులుగానో కూడనుండి యుండుననియు, ఎడమనుండి కుడివైపునకు వ్రాయవలసి యుండుననియు వ్రాసియున్నారు. ఇవి సుమేరియా, సుస, మెసపొటేమియా, మున్నగు మధ్యప్రాచ్య స్థలములందలి శకలములుకూడ సింధు శకలములను పోలియుండుటయేగాక, సరిగా ఇట్టి భారతీయ ముద్రికలే దొరకుటచేత వీని కాలమున కూడ మొదట సార్గన్ (Sargon) కు ముందువి (క్రీ. పు. 2700) అనియు, 'ఉర్'లో క్రీ. పూ. 2700 నాటికిల లిపిదికూడ దొరకియుండుటవలన ఇది ఇంకను గట్టిపడి, అట్టివే మొహెంజొదారోలో బయలుపడినందువలన ఇవి క్రీ. పూ. 3500, 2500 లకు నడిమి కాలమునకు చెందినవనియు— ఈ విధముగా పోలికలచేత నిర్ణయించినారు. మొహెంజొదారోకన్న హరప్ప ప్రాచీనతరమట.

ఈ పరిశోధనలనుబట్టి భారతదేశమందు లిపి చాల ప్రాచీన కాలమందే ఉండెననియు భారతీయులకు ఇతర ఖండాంతరముల వారికిని రాకపోకలు వర్తక వ్యాపారము లుండియుండినవనియు స్పష్టపడుచున్నది. కాని, ఈ లిపియే మన అశోక లిపికి గాని మన గ్రంథములలో చెప్పబడిన లిపులకు గాని మూలరూపమని చెప్పుటకు సాధ్యపడుట లేదు. ఈ లిపి అక్షరములో బొమ్మలో, సంకేతములో, భాష ఏ భాష, క్రమ పరిణామ ముండివదా, పరిణామ సోపానములు ఏవి— ఇత్యాది ప్రశ్నలకు తగు సమాధానములు దొరకుటలేదు. ఇంతవఱకు ఎవరు పరిశోధించినను ఏవో ఊహలుగా నేర్పడుచున్నది గాని విషయము గోచరించుట లేదు. ప్రస్తుత వ్యాసకర్త గారైన శ్రీ ఎస్. ఆర్. రావు గారు ఇంతవఱకు జరిగిన పరిశోధనలను చర్చించి, వాని గుణదోషములను నిర్ణయించి తమ యభిప్రాయములను — ఈ నాగరికత ఇండో యూరోపియన్ (ఆర్య) భాషాశాఖలకు సంబంధ పడి

నట్టిదనియు, సంస్కృతము, గ్రీకు, హిట్టైటు భాషలలో సమర్థులు పరిశోధించినయెడల వాస్తవము వెలువడగలదనియు తేల్చినారు. వైదిక సంబంధము లైన పదములే సింధు నాగరికతవనియు, చూపి యున్నారు. వీరి సిద్ధాంతములో కొంతవరకు ఒక మార్గము దొరకునట్లు నాకు తోచుటచేత వారి యభి ప్రాయములను సంగ్రహముగా చర్చించెదను ముందుగా తమకు ముందరి పరిశోధనల సారాంశములను వారే ఈ క్రింది విధముగా తెలిపినారు. విషయము కొంత గడ్డుది గాన వారి మార్గమున తెలిపినదే అవసర మగును.

భారతదేశ స్వాతంత్ర్యానంతరము హరప్ప మొహెంజొదారో ప్రదేశములు పాకిస్థానమునకు చేరినందువలన భారతీయ పురాతత్త్వ శాఖవారికి పరిశోధించుటకు ఈ స్థలము లేకపోయినది. ఈ సింధునాగరికత బెలూచిస్థానమునుండి దక్షిణ గుజ రాతువరకు విస్తరించి యుండినందువలన మిగిలిన భారతీయ ప్రదేశములలో వెదుకగా గుజరాతులోను లోతల్ అను ప్రదేశములోను చాల ప్రదేశములు కన బడినవి. సింధునాగరికతయే. అట్టిమట్టపములైన నగరములేగాక లోతల్‌లోని నౌకాశయము చాల విశే షము సముద్ర వ్యాపారము జరుగుచుండినట్లు పర సీక సముద్రమునకు సంబంధించినరేకు (ముద్ర=Seal) కూడ దొరకినది. బహ్రీన్‌తో పేరుకుండిన నౌకా వ్యాపారమును గుర్తించుటకు ఇది ప్రథమముగా దొరకిన ఆధారము. లోతల్, రంగ్‌పూర్, రాజోడి ప్రదేశముల త్రవ్వకములవలన తెలిసిన క్రొత్త విశే షము—హరప్ప నాగరికత కొంతమార్పుతో ముగిసిన తర్వాత మూడువందల సంవత్సరములవరకును గుజ రాతు ప్రాంతములలో నుండినట్లు తెలియుటయే. దీని అనంతర హరప్ప నాగరికత (1900–1600 B. C.) అనిరి. ఈ సింధులిపి లేఖనము గుజరాత్ ప్రాంతములో చాలకాలము వాడుకలో నుండినట్లు స్పష్టపడుచున్నది.

లోతల్ కాష్ఠానాలలోని ముద్రలవలన వాని ప్రయోజనము తెలిసినవి. ఇవి సరకులను పరీక్షలు చేసిన అనుమతి ముద్రలు, బంగీలమీద వేయబడి నవి. వ్యాపార సంబంధమైనవి. ఒక్కొక్కప్పుడు ఒకే బంగీమీదనే రెండు ముద్రలు కూడ—రాజకీయాధి కారుడది, వ్యాపారిది — కలసినట్లు కూడ తెలియు చున్నది. ఇవి తాయెతులు కావు.

లి పి – ర చ న

2000 బిళ్లల దొరకినవి. మొహెంజొ దారోలో, లోతల్‌లో 210 బిళ్లలు ముద్రలు. లిపి యేదో, భాషయేదో తెలియదు. ఇప్పటికి చేసిన ప్రయ త్నముల వ్యర్థములు. కారణము—తమకు తోచిన నిర్ణ యములకు తగినట్లు—చరిత్ర రచనలకు సిద్ధాంతము నకు అనుగుణముగా—ద్రావిడ నాగరికత— ఆర్య నాగరి కతయన్న నిశ్చితాభిప్రాయములతో పరిశోధనలకు పూను కొనుటయే. ఇది నిష్పాక్షికదృష్టికి నిరోధకమైనది. మఱియొక కారణము లిపి పరిశోధకులును, భాషా శాస్త్రకారులును 500 ఏండ్ల వ్యత్యాసములో, భాష లోను లిపిలోను మార్పులను పరిణామములను ఎదురు చూడకపోవుట. తర్వాత ఈ లిపిలో వర్ణ సమామ్నాయ మింకను ఏర్పడలేదనియు, శబ్దస్ఫోరకములగు అక్షర ములు లేవనియు—మార్పులను గుర్తించుటకు కావలసి నంత ఆధారములు పరిశోధకులకు దొరకకపోవుట— కారణమై యుండును కాల, కాలక్రమ పరిణామ మును గుర్తించుటకు తగిన ప్రమాణములు ఇప్పుడు దొరకినవి. ఇదివరలో పరిశోధకులు ఒక్కొక్క సంకేత మును ఒక భావమనియో, భావభాగమనియో భావిం చిరిగాని అక్షరముగా అచ్చోహల్లో—అని తలచినట్లు కానరాదు. ఇటీవలి వారి నిర్ణయములను పరిశీలింతము. (అని శ్రీ రావుగారు కొందరి సిద్ధాంతములను విమర్శించిరి).

వాడ్డెల్—1925 ఆర్యభాష యనెను.

పాదిరిహీరాసు—ప్రాచీన ద్రావిడమనెను. కొంత అపహాస్యముగాకూడ సిద్ధాంతీకరించెను. ఒక్కొక్క సంకేతమును ఒక పదమని తలచెను. కాబట్టి వర్ణము లేవో గుర్తింపబడలేదు.

ఇటీవల ఎస్. కే. రే. వీనిని శబ్దోచ్చారణగల వర్ణముల సమామ్నాయమని తలచి బ్రాహ్మీలిపిలో ముడపెట్టజూచెను అందుచేత అది కుదురలేదు.

రష్యావారైన కొనొరొజోవ్, వాల్‌కాక్, గురోవ్, అనువారు కాంప్యూటరు పద్ధతిలో, ఏ గుర్తు ఎన్ని పర్యాయములు, ఏ వరుసలో వచ్చునన్న లెక్కల ననుసరించిరి. కాని వారుకూడ ద్రావిడ భాషయను భావములో పడినందునను ఒక్కొక్క సంకేతము పద మనుటవలనను, వారి పద్ధతి ఫలప్రదము కాలేదు.

ఆస్కొ పర్‌పోలా అను ఫిన్‌లాండు విద్వాంసుడును అతని అనుయాయులును కాంప్యూటరు పద్ధతిని అనుసరించిరి కాని ద్రావిడ భావము చెడిపినది. ద్రావిడ శబ్దములని ఈతడు తలంచినవి సందేహగ్రస్తములు సెమిటిక్ గుర్తులతో పోల్చిన అర్థము మారును

పైగా ఈ ఇరుతెగలవారి పరిశోధన అసంపూర్ణము. సంయుక్తాక్షరములను వారు విడదీయ లేదు. పూర్తి పదములన్నారు. ఒక్కొక్కబొమ్మయు ఒక పదమట. ఒక్కొక్క గుర్తునకు వారు ఒక ఉచ్చారణ చూపియుండవలసినది. వ్యాకరణాంశములు కూడ ద్రావిడ భాషా మర్యాదకు వెలితిగా నున్నది. వీనిలో అంత్యప్రత్యయములే యుండుటచేత ఇవి ద్రావిడములట. ఇండో ఆర్యను భాషలలో లింగభేదము విభక్తి నిర్ణయము అంత్యప్రత్యయముల చేతనే హరప్ప భాషలో ఉపసర్గలు అంత్యప్రత్యయములు రెండును కలవు. ఉదా. ప్ర—బక=గొప్ప —బక— బక ప్ర=బక గొప్ప (=గొప్పవాడైన బక).

శ్రీ ఎమ్. వి. ఎన్. కృష్ణరావుగారిదికూడ తృప్తికరముగాదు. శబ్దోచ్చారణను సరిగా పాటింపక వర్ణరూపమును నిర్ణయింపక, కుదురని చోట్ల సరిపెట్టుటచేత ఐరావతం మహాదేవన్‌గారు చాల వరకు ఊహపైన ఆధారపడినారు. ఒక సంకేతమును 'ఆన్‌ఆ' అని మనుష్యుడు, బంటు అని, 'ఆన్‌రాల్' ఆంధ్రభృత్య=ఆంధ్రుల సేవకుడు వేళ్—ఆళ (వేళుల సేవకుడు) ఆంధ్రులే వేలిర్ అనబడువారు—ఇత్యాది. వీరికొక పద్ధతి లేదు. మొదటి గుర్తు వర్ణమని, రెండవ దానిని చిత్రమని—వాస్తవముగా రెండక్షరములను వర్ణోచ్చారణ గలవానిని చెప్పుట వట్టి ఊహాగానము. ఆంధ్రభృత్యులకు వేళాళులకు ఏమి సంబంధము. పైగా సంఘం వాఙ్మయమందలి నగరములు క్రీ. పూ. 300 లేక 400 లకు ముందు సాగవు ఇవి తమిళ శబ్దములే కావలయునన్న మహాదేవన్‌గారు పఠించిన మార్గమున అది ఆర్-ర్—అల్ (ఆళ)' అగునేగాని 'వేళాళ కాదు.' మఱియొక పొరపాటు ఏమనగా ఒకే చిత్రమునకు అనేకార్థములు—వానితో ఒక్కొక్క గీటునకు చెప్పుట. ఒక చేపగుర్తే 'మిన్, మిల్, మిట్, మివ్, వెన్, వెల్, కే, కొ' ఇత్యాది. దీనికి అంతము లేదు. ఒక్కొక్క గుర్తు ప్రత్యేక పద మనుట తప్పు. వానికొక ఉచ్చారణ ఉండవలెను.

(అని తమ యభిప్రాయమును శ్రీ రావుగారు విశదీకరించినారు) ఒక్కొక్క చిత్రమును దాని మూల రూపమునకు యథాస్థితముగా సాధించుట అనర్థకారి. 1960 తర్వాత దొరకిన అపార వాస్తుసామగ్రినిబట్టి ఈ లిపిలోకూడ మార్పు, పరిణామము, ఉండినట్లు తోచినది. చిత్రములలో కూడ మార్పును, కొన్ని లేక పోవుట, రెండుమూటిని కలుపుటలు, తగ్గుట ఇత్యాది తర్వాత (ఇటీవలి) హరప్ప చిత్రపు గుర్తులు 44 గుగా తేలినది. వీనిలో 20 ప్రధాన చిహ్నములు. మిగిలిన అచ్చులగు ఇతర చిహ్నములు చేర్పుటచేత నేర్పడినవి. హరప్ప నాగరికతయొక్క నిండుదశలో నుండిన మొత్తము 52 ప్రధాన చిహ్నములుగాక 300 నుంచి తర్వాతి కాలమునకు ఈ ప్రధాన చిహ్నములు 20 కి కుదింపబడుటయే యొక విశేషము. ఎందుకనగా ఉదాహరణముగా చూచిన, ఉత్తరపు సిరియా, పాలెస్టైను, జెరూసలెంలలో ఈ విధమైన కుదింపు ఒక వర్ణ సమామ్నాయ మార్గమునకు దారి తీసినట్లు గ్రహింపగలము. అందుచేత హరప్పజనులుకూడ తమ వ్రాతలను ఒక లిపి పద్ధతికి వ్యాపార సౌలభ్యము నిమిత్తము, లెక్కలు తయారు

చేయుటకును కుదించినట్లు కొంత భావింపవచ్చును. ఇది సరియైన మార్గమైనయెడల పరిణతమైన హారప్ప నాగరికతయొక్క ఈ 20 రూపములను సమకాలికములైన సెమిటిక్ రూపములతో పోల్చి చూపుట సరియైన మార్గము. చూడగా 20 లో ప్రాచీన ఫినీషియన్, కానన్‌లవి. వీరివి 14 గుర్తులు ఒక్కటే. అక్షర సామ్యము ప్రస్ఫుటము. కొన్నిటికి వర్ణాంతరములు కూడ కనబడినవి.

ఇందులో చూడదగినది లిపి కాల సామ్యము వగాతము కాదు. ఈ రెండు దేశాలవారికి వ్యాపార వైజ్ఞానిక సంబంధముండెనా యనుటయే ముఖ్యము. ఫినీషియనులను ఋగ్వేదమునందలి పణియను వ్యాపార సంఘమువారితో సంవదించుట పరిపాటి. పడమటి తీరపు రేవులకు హరప్ప కాలములో, సుమర్ బాబిలో నియా, ఉత్తరపు సిరియా బహరిన్‌లతో నౌకా వ్యాపార సంబంధము లుండినది తెలిసినదే. తర్వాత కూడ. కాబట్టి అత్యంతర హరప్ప లిపిని ఫినీషియా దక్షిణపు సెమిటిక్కు లిపులతో పోల్చుటచేత హరప్ప వారిని వారి వంశములవారిని, వారిని చక్కగా ఎరిగిన వారితో పోల్చుట యగుచున్నది.'బోగజ్‌కాయ్'లో దొరకిన అక్కేడియన్ సాహిత్యమునందలి పదములు హిట్టైటు సాహిత్యమును సామాన్యముగా బాబిలోనియా పద్ధతిని అనుసరించునవి. (హిట్టైటులో కొంత మార్పు వృద్ధి) ఇట్లివన్నియు పరస్పర సంబంధము కలవిగా మున్నవి.

## వీనికి శబ్దోచ్చారణ

పరిణతమైన హారప్పలిపి ఒక వర్ణసమామ్నాయ పద్ధతికి రూపొందినట్లు స్పష్టముగా తెలియుటచేత ఒక్కొక్క గుర్తును ఒక శబ్దముగానో గణము (Syllable) గానో గుర్తించుట అనవసరము వీనికి తగిన ఉచ్చారణను సమకూర్చుటయే కర్తవ్యము. ఈ విధమైన తలంపే ఒక త్రోవను కనిపట్టుట కాని ఈ అనంతర హరప్ప లిపికి ఉచ్చారణను నిర్ణయించుటకు తగిన ఆధారమును కనిపట్టుటయే ప్రధాన సమస్య. చిహ్న సామ్యమువలన వర్ణోచ్చారణకూడ సమమేయనుట పొసగక పోవచ్చును. కాని నూతనోచ్చారణ కల్పన, ఇతరులవలె, నిర్ణీత భాషాభావ పూర్వ సిద్ధాంతమునకు సమకూర్చుటగా పొరపాటులకు దారి తీయునేమో యను భయము యుండినది. వీరి భాష యేదో తెలిసికొనుటయే ప్రధానము గాన పూర్తిగా (Objective) ఉద్దేశములేని, విస్మయమును కుదుర్చుకొనని పద్ధతి. అనుసరణీయము. కాబట్టి తప్పిపోని మార్గమేదన—ఎఱిగిన సెమిటిక్ నుండి ఎఱుగని (ఎఱుగదగిన) పరిణత కాలపు హరప్ప పదములను నిర్ణయించుట. ఎందుకనగా సెమిటిక్ గుర్తులలో 20 కి 15 ఒకటే.

వ్రాతయొక్క వైపు (Direction) కుడినుండి ఎడమకు. ఇందులో బిళ్లలకు ముద్రలకు భేదమును జాగ్రత్తగా నిర్ణయింపవలెను. కుండలమీది, బిళ్లల మీది వ్రాతను యథాస్థితముగా చదువుకొనవలెను. ఇట్లు పోల్పగా ఈ క్రింది మాటలు కుదురుచున్నవి.

'బక మనా, దశ, తాపక, షక్రా, హప, పద' ఇవి ఉచ్చారణలో సంస్కృత శబ్దములవలె నున్నవి. కాని సెమిటిక్ గుర్తులవలె నుండుటచేత వాని ఉచ్చారణయే వీనికిని సరియగును. ముఖ్యముగా ఇచ్చట U వంటి గుర్తునకు ఉచ్చారణ నిర్ణయించుట ఆవశ్యకమాయెను. ఇది అడుగడుగునకు వచ్చుచున్నది. ఇండోసుమేరియా ముద్రలను పఠించిన వాడెల్‌గారు దీనిని అకారముగా నిర్ణయించినారు. (AMA) అట్లే ఇక్కడను. దీనితో రెండు మొదలు ఆఱువఱకు ఇతరమైన గుర్తులు కలసియుండుటచేత (అ ఏ ఓ అగునటు) ఇది నిశ్చయము కాదు. ఏలన ఏ ఓ లకు వేరు గుర్తులు కనబడుచున్నవి. కాని అక్కేడియను, ఉగర్‌చోట్ల బాణ లిపులలో U గుర్తు, దానికి ఇతర గీటు పెట్టుటవలన 'అ ఆ' ఇత్యాదు లగును ఇట్లు 'అ, ఆ, ఎ, ఏ, ఓ' లను కనిపట్టి, 14 లేక 15 హల్లులు, 5 అచ్చులతో 25 ముద్రికలను పఠింపగా 'ఇండో యూరోపియను' భాషా కుటుంబమునకు చెందిన పదములు చాల దొరికినవి— అవి

'హప్త, మనా, ఆమ, అమ, ఒమ, అప, అపహ్, బ, బక, పర, బ—క—త—హ, ప—అ—అ—బ—క—అ, (పా బ క), ప—బ హ వ,—మహ—మ—ఆ—త—అ, దశ, పా, ప్త, పత్, పక, త, తఅప, తాపక, తప్త, అత్, ఆ-త్–హవ, (అత్ప్వా), ప—అ—త్, హవ (ప—త—హ్వా) పద, పాదః, సదాప్త (=సతప్త)'

ఇండో ఇరేనియన్ (సంస్కృత పారసీక) సంబంధము గలవి—హ (ఖ), సప్త—హప్త, అపహ్—అపస్. బ-హ్—బకస్.

ఈ విధముగాను తర్వాత అక్షరముల మార్పు, క్రొత్తవాని చేరిక, ఇతరత్ర లేనివి, ఒకచోటనుండి ఒకచోట లేనివి ఇట్లు పరిశీలించి తుదకు ఈ భాష ఇండో యూరోపియను (ఆర్య నాగరికత)కు చెందినదని నిశ్చయించిరారు. తమిళములో లేని యక్షరములు కూడ నుండుటచేత ద్రావిడభాషకు బొత్తిగా సంబంధము లేదని ఇంకను గట్టిపడినది. 360 పదములలో 30 పదములు మాత్రము అన్యభాషా పదములు కొందఱు ఇతర జాతులవారు కూడ ఉండిరేమొ.

హిటై ట్టు భాషా పదములే కొన్ని ఇచ్చటను కలవు. ఉపసంహారములో ఈ లిపిలోని విశేషములను మరల సంగ్రహించిరి. (1) 700 సంవత్సరముల కాలములో ఈ లిపి అట్లే మార్పులేక ఉండినది కాదు. భావ రచన (ideographic) కాదు చిత్ర లిపి (Heiroglyphic) కాదు. గణ (పద)ము అక్షరమును కలిసినదిగానుండి క్రమముగా వర్ణ సమామ్నాయముగా కుదిరినట్టిది. ఇది లోతల్‌లోని రెండు వందల ముద్రికల పరిశీలనవలనను, రంగ్‌పూర్, దాబోడి అను ప్రదేశములలోని శాసనములవలన ఊర్జితమైనది. ఈ వర్ణ సమామ్నాయ పద్ధతి హారప్పకాలము తర్వాత గుజరాత్‌లోనేకాక దక్కనులో ఉత్తర భాగమున తేఊర్‌లోను, గంగాతీరమునను, కౌశాంబిలోను ఇతరత్ర ఉండినది.

(2) ఈ సింధు లిపిలో మొదట బొమ్మలతో చేరి 52 ప్రధానమైన గుర్తులుండి చివరి దశలో 20 కి దిగి, వాని చేర్పులును కూర్పులును కలసి గుణింతములైనవి.

(3) అనంతర హరప్ప లిపి సెమిటిక్ లిపికి సరిపోవుటచేత, సెమిటిక్ లిపికి, సమకాలిక తుల్యాక్షరములకు (సినాయి ఉత్తర సిరియా పాలెస్టైన్ల లోని Abdo—Safatbal — Lechush — Akhiram శాసనములలోని) నిర్ణయించిన ఉచ్చారణనే, ఈ లిపికి నిర్ణయించుట—పూర్తిగా సాధు మార్గమే. ఈ పద్ధతి ప్రసిద్ధ లిపి శాస్త్రవేత్తలైన ప్రొఫెసర్ డేవిడ్ డిరింజర్‌గారిచేతను, సింధు లిపిని పరిశోధించుచున్న డా. ప్రాబాగారును, వారివంటివారును అంగీకరించుటచేతను-సాధు మార్గమని అంగీకరింపబడినది.

(4) శబ్ద శాస్త్రరీతిగా సింధులిపి (భాష) హిటైట్ భాషకు సంబంధించినది. శబ్ద పరిణామము (Semantics), శబ్దజాలము శబ్ద స్వరూపముల రీతి (Morphology) ఇత్యాదులలో వైదిక భాషలకు సమీపముగా నున్నది. అవెస్త భాషకును సంబంధము కనబడుచున్నది. గ్రీకు స్లేవోనిక్ భాషాపదములును కొన్ని కనబడుచున్నవి.

(5) 400 ముద్రికలలో 200 లలో రాజులు, పరిపాలకులు ఋషులు, అసురులు, దైత్యులు మున్నగు వైదిక నామధేయములు కనబడుచున్నవి. ఇందువలన మత సంబంధముగాను రాజకీయముగాను వైదిక కాలమునందలి భావములకు ముందరి స్థితి హరప్పలో నున్నదని తలంచుట తప్పు కాదు. వేదములు వ్రాతపై ఆధారపడక నోటిపాటగానే గదా వచ్చినదను వాదమునకు బదులుగా బ్లూంఫీల్డు పండితుని వాక్యములు స్మరింపదగినవి. 'నావరకు—ఈ కర్మకర్మ (శ్రౌత) పద్ధతి పరంపర కొంత ప్రాచీన కాలమునే—ఎప్పుడని చెప్పలేము—రచనా పరంపర ననుసరించి యుండవచ్చును అని నాకు నిస్సందేహముగా తోచుచున్నది? (AVXIX - 72)

(6) వైదిక భాషలనుండి ప్రాకృత భాషలకు మార్పువందిన పదజాలములకు ఇతర భాషా విధానము

లకు ఎట్టి సూత్రములు చెల్లునో, అట్టివే ఈ హరప్ప భాషనుండి కలుగు మార్పులకు కూడ అన్వయింపవచ్చును. వైదికభాష చక్కగా వ్యాకరణ విధాన కట్టుదిట్టములకు కుదింపబడినందువలన దాని పూర్వ రూపము ఎట్లుండెనో—ఈ హరప్ప+ఇండో యూరపియన్ భాషలతో పోల్చి సశాస్త్రీయముగా పరిశోధించిన యెడల నిర యింప వీలగును.

(7) పైన అనుసరింపబడిన పరిశోధనా విధానము సశాస్త్రీయమైనదని లిపి శాస్త్రజ్ఞులును, శాసన పరిశోధకులును అంగీకరించినందువలన ఈ లిపి పరిశోధకు లందరును కలసి, ఒక విధానమును అనుసరించుట మంచిది. చిన్నచిన్న పొరపాట్లుండ వచ్చును. సంస్కృతము, హిట్టైటు, గ్రీకు భాషలను చక్కగా ఎఱిగిన పురాతత్వ పరిశోధకులు పూనుకొన్నయెడల చిన్నచిన్న అవాంతర సమస్యలను క్రమముగా పరిష్కరించుకొనవచ్చును. ఇంత పనియు ఒకరి వలన నెఱవేరునట్టిది కాదు.

ఈ విధముగా శ్రీ రావుగారు సంగ్రహించినదే గాక వీనిలో 'తారక' 'అంగిరస' శబ్దము లుండుట—యజ్ఞాదులు చేసిన వాస్తుశకలము లుండుట—సుమేరియనులలో నొక గుండ్రని ముద్రికలో 'మెలుహ్హా' అను పేరుగల యొక ప్రదేశము సింధుదేశ ప్రాంతముగా పలుమార్లు నిర్ణయము నందినట్టిది, ఇక్కడ హరప్పలో కూడ ప్రస్తావింపబడియుండుట—ఇత్యాద్యనేక ప్రమాణములనుబట్టి— వీరు చేసిన నిర్ణయము చాలవఱకు అంగీకార్యముగాను, ఈ మార్గముననే పరిశోధన జరుగుట మంచిది. ఫలప్రదమనియు, ఇంత కాలమునకు దిక్కుతోచనిచోట కొంత సందు—మంచి సందే—దొరకినదనియు సంతోషింపదగియున్నది.

## ఆలోచింపవలసిన విషయములు

ఇది చాల మంచి నిర్ణయము. కాని—(1) ఈ సింధు నాగరికత (ద్రావిడముకాక) వైదిక నాగరికతకు ముందరి పరిస్థితియైన యెడల; ఆర్యు లనబడువారియొక్క ఇండో యూరపియను నాగరికతకంతయు మూలస్థాన మేది? (2) భారతీయులును సుమేరియనులును, తదితరులును పరస్పరము సంబంధపడినవారా కారా? (3) వైదిక నాగరికత భారతదేశమునకు వచ్చినట్టిదా లేక, ఇచ్చట పుట్టి వ్యాపించినదా? (4) వైదికులు ఆదినుండియు అశ్వికులు గదా, సింధు నాగరికతలో వారికి అశ్వముల సంబంధము లుండిన నిదర్శనములు లేవు గదా, వీరు ఆర్యులెట్లు కాగలరు? (5) ఆర్యులు, అనగా వైదికులు చక్కని కట్టడముల నెఱుగరట గదా. ఈ కట్టడముల నాగరికత వైదికమా? (6) ఆర్యద్రావిడ సమస్యల గతి యేమి? ద్రావిడు లెక్కడివారు? ఎక్కడ నుండిరి, వీరిని ఆర్యు లనబడువారు ఎట్లు, ఎప్పుడు, తరిమిరి? లేక ఆదస్యులు ఆర్యుల 'సదస్యు'లే కాని ద్రావిడులు కారా? (7) పైగా, అన్నిటికన్న ముఖ్యము— ఈ హరప్ప—సెమిటిక్—ఇత్యాది లిపికిని అశోకుని లిపికిని ఏమి సంబంధము. కుడినుండి ఎడమకు వ్రాయుచుండినవారు, ఎప్పుడు, ఎందువలన ఎడమనుండి కుడివైపునకు వ్రాయ నారంభించిరి? ఇత్యాది ప్రశ్న పరంపరలకు సమాధానము చెప్పుటకు మరల ప్రపంచ చరిత్రనంతయు ఒకమారు కలియబెట్టవలసియుండును. ఇంతవఱకు నిర్మించుకొన్న చారిత్రక జ్ఞానముయొక్క సాధుత్వా సాధుత్వములు తేలవలసి యుండును గదా.

చూడగా మనకు చాల ముఖ్యమైనది నిష్పాక్షిక దృష్టి. వైదిక వాఙ్మయము, ఆర్య నాగరికత, వీనియొక్క మూలస్థానము భారతదేశమే, సప్త సింధు ప్రదేశము 'మన సింధుదేశమే, ఇక్కడిదే—అని మనవారు మొండిపట్టుపట్టి పాశ్చాత్య విధానముల మీద కోపమును వహించుట కొంత సడలించినయెడల ఈ ప్రశ్నలకు సమాధానము చక్కగా కుదురును. 'మన సిద్ధాంతములకో, ఉద్దేశములకో అనుగుణముగా ఉపపత్తులను కల్పించుకొనుటకన్న, ఉపపత్తులనుబట్టి నెమ్మదిగా, ఎట్టి పూర్వ నిశ్చితాభిప్రాయము గాని లేక, ఏ నిర్ణయము కుదురునో దానిని అనుసరించుట మంచిది. ఇప్పటికే ఎందరో పండితులు పరిశోధించి

చేసిన నిర్ణయములను ఈ సందర్భమున స్మరించుట చాల మంచిది.

'ఆర్యు' లనబడువా రెక్కడ నుద్భవించిరో గాని వారు ఇండియా యనబడు నీ ప్రదేశమునకు వచ్చిన వారే గాని ఇక్కడివారు కారు. సాంస్కృతికుల పూర్వులు, గ్రీకు, లాటిను, పారసీక భాషలాదిగా గల వారొక కుదురునుండి చీలినవారే గదా. ఇది సరియైన యెడల తొలుత వారికి లిపి యుండియుండదు. ఏల యన అశోక బ్రాహ్మీ లిపికిని గ్రీకు లాటిను మున్నగు వారి లిపులకును పారసీకుల లిపులకును అంత భేద ముండుట కవకాశము లేదు. వీరికి భాషా సాజాత్యము, సాంస్కృతిక (Cultural) సాజాత్యమే గాని లిపి సాజాత్యము కానరాదు గదా. కాబట్టి ఇండో యూరపి యనులు లిపులను చేపట్టుటకు ముందే విడిపోయి తర్వాత వేరువేరు లిపులను స్వీకరించి యుండవలెను.

లిపులకు ముందుండిన మతములో అందరను అగ్న్యారాధకులే గాని గ్రీకులు మొదలైన పాశ్చాత్య దేశాల నాశ్రయించినవారికి వేదములు గాని, యజ్ఞోప వీతములు గాని, వర్ణాశ్రమ ధర్మములు గాని లేవు. కాబట్టి వేదకాలమునకు ముందు వారు విడిపోయి యుండవలెను గదా. పారసీకులకు అగ్న్యారాధన యజ్ఞోప వీతము లుండినను వారికి నాలుగు వేదములకు బదులు అవెస్తమాత్ర మున్నది. మన శవదహన విధానము వారికి పనికిరాదు. జరదుష్ట్ర (జరోష్ట్ర) అను పారసీక ఋషి ఇట్లాదేశించినందున వైదికులు పార సీకులుగాను అగ్నిలో శవదహన మొనర్చువారుగాను చీలిపోయిరట. ఇది ఎప్పుడో. ఋగ్వేదకాలమునకు ముందా వెనుకనా? ఇదంతయు చూడ నాటికి కూడ లిపి లేక ఋగ్వేదాదులను ఋషులు 'చూచిన' యనం తర మెప్పుడో భారతీయులు లిపి పరిగ్రహణ మొనర్చి యుండవలెను. ఆర్యజాతులు తమ మూలస్థానమును వీడి ఇతర దేశములకు పోయి ఆయాప్రాంతీయ జాతుల సంస్కృతుల ప్రభావములవలన క్రమముగా మారియుండవలెను. ఆర్యజాతులు, ఇండో యూరోపి యనులు ప్రపంచమున వ్యాప్తి చెందిన చరిత్రము చక్కగా జల్లెడపట్టి సంశోధించిన పెక్కు నూతనాంశ ములు వెలువడగలవు.

బోగజ్‌కాయ్ లనబడుచోట దొరకిన (క్యూని ఫారం) కీల లిపి శాసనములలో దశరథ, ఆర్తతవాది రాజుల నామధేయములును ఇంద్రాగ్నివరుణ నాసత్యాది దేవతల పేళ్లను కనబడి, ఆయా రాజులు క్రీ. పూ. 1400 ప్రాంతముననే సంబంధ బాంధవ్యములు నెరపి ఈ వైదిక దేవతలను తమ యొప్పందములలో సాక్షులుగా నుదాహరించు కొనుటవలన కొంతకాల మచ్చట వైదిక దేవతోపాసన యుండెననుట విశ దము. సూర్యోపాసన (మిత్రన్) ఫీబస్, (ప్రభాకర) ఇత్యాదులు అచ్చట ప్రసిద్ధములే. జాతమృతా శౌచ ములు, పునర్జన్మాదులు, స్వర్గమర్త్య పాతాళ లోక ములు, యమధర్మరాజు, నరకములు — ఇత్యాదులు వారికిని ఉండినవే. గ్రీకు రోమనులకు అగ్నిపూజలు, అగ్నిగృహములు, దేవాలయములు, దేవదాసీలు వీనికి లెక్కలేదు. అన్నిటిని మించినది ఆ దేశాలలో దేవీ పూజ. ఎఫీసస్ అను ప్రదేశము దీనికి ప్రఖ్యాతి గాంచినది.

మనమే ఉపాధ్యాయులము, ప్రపంచమంతయు మన శిష్య పరంపరయను మూర్ఖ సిద్ధాంతమును మూలపెట్టి, మెసపొటేమియా, బాబిలోనియా, అసీ రియా, ఈజిప్టు, ఫినీషియా మున్నగుదేశాల చరిత్ర లను చక్కగా అవగత మొనర్చుకొని వానితోడి మన సామ్యములకు సరియైన సమాధానముల నరయ వలయును. వైదిక సంస్కృత వాఙ్మయ చరిత్ర మును, లౌకిక సంస్కృత వాఙ్మయ చరిత్రమును భారతదేశ చరిత్రతో సమన్వయించి పట్టీలు తయారు చేసి చూచినయెడల పరస్పర సంబంధములు సరిగా కనబడును. అశోకుని కాలమునకు ముందుగాని, అతని కాలమునగాని లేక తర్వాత మూడు వందల సంవత్సరములకా సంస్కృత శాసనములు కనబడుట. దేశమందంతయు సంస్కృతము వ్యాపించియుండిన యెడల ఎందుల కుండవు? కాని సంస్కృతము లేదన లేము గదా! పాణిని వాల్మీకి వ్యాసకౌటిల్యాదుల గతి

యేమి? కౌటిల్యుడు అలెగ్జాండరు చంద్రగుప్తుల నాటివాడు గదా. పాణిని తారీఖు క్రీ. పూ 7 వ శతాబ్దమునుండి నాలుగవ శతాబ్దమువఱకు నని తలంపబడుచున్నది. ఆయన నివసించినది శాకలపురము (సయాల్కోట్) పశ్చిమోత్తర పరగణాలలో, సింధు రాష్ట్రమున. ఆ దేశము చాలకాలము పారసీకుల పాలనలో నుండినది. మఱి పాణిని భారతీయుడా పారసీకుడా? పారసీకుల సామ్రాజ్యమున సంస్కృతము వర్ధిల్లలేదా? పాణిని సంస్కృత శబ్దమును చెప్పక వాల్మీకి చెప్పుటచేత ఎవరు ముందు, ఎవరు వెనుక. వాల్మీకి యొక భారతదేశ భౌగోళిక జ్ఞానము కొంత సందేహగ్రస్తము. ఆయన యెక్కడివాడు, ఎప్పటివాడు, ఏబదియారు దేశాలలో పారసీక, చీన త్రిగర్త యవనాదులు కలవు గదా—ఈ భూభాగములు ఇండియాలోపలివా, వెలుపలివి కూడనా? పాణిని తన కాలపు లిపుల నెన్నింటినో పేర్కొనెను. బౌద్ధులును పేర్కొనిరి గదా. వారు ఈ అశోక లిపినో, దీని పూర్వ రూపమునో వాడియుందురా? ఖరోష్ఠి లిపి యుండినను, పారసీకులు కుడినుండి ఎడమకు వ్రాయుచుండినను మనవారేల బ్రాహ్మి లిపిని ఆదరించిరి?

ఇప్పుడు కొన్ని కొండగుర్తులవంటి తారీఖులను చూతము. పారసీకుల సామ్రాజ్యము అలెగ్జాండరు కాలమున సమాప్తమైనది. దాని ప్రారంభ కాలము క్రీ. పూ. 550 వీరి సామ్రాజ్యము మధ్యధరా సముద్రమునుండి సింధునది వఱకు పెర్సిపొలి రాజధాని పెర్సి అనగా పార్సి అనగా పారసీక సంబంధమైన. పారసీక శబ్దము గ్రీకు వారు వ్రాసిరి. అదే మన ప్రాచ్య=తూర్పు. మఱి ఎవరికి తూర్పు ఎవరో సంస్కృతభాష మాటలాడుచుండినవారికి అని అర్థమగుచున్నది. కాబట్టి విడిపోవుటకు ముందు సంస్కృతము మాటాడువారు పారసీకులకు పడమట నుండి యుండరు. ఏకాలముననో తెలియదు. క్రీ పూ. 1400 నాడు సంస్కృతము—వైదికభాషయు మతమును నేటి టర్కీదేశమున బొగజ్కాయ్ వద్ద నుండినది గుర్తించితిమి గదా. తర్వాతి కథ ఎట్లు తెలిసికొనగలము చూతము.

పారసీకులకు ముందుండిన సామ్రాజ్యము అసీరియనులది. వీరే అసురులని మన పండితుల కొందఱి యభిప్రాయము గదా. వీరిని ఓడించియే పర్షియనుగా పైకి వచ్చిరి. మన గ్రంథముల ప్రకారము అసురులతో మహాయుద్ధము లొనరించి జయించినవారు దేవతలే. గీర్వాణులు. అశోకుడు 'దేవనాంప్రియు'డు గదా. ప్రాచీన బ్రాహ్మణు లనేకులును, రాజులును దేవశబ్ద వాచ్యులే. పారసీకులును వైదికులును కలసియుండి, అసీరియనులతో యుద్ధములుచేసి తుదకు వారిని పరాజితులను చేసియుండవలెను. అసీరియనుల కాలము క్రీ. పూ. 550—1000. అనగా యూఫ్రటీసు టైగ్రీసు నదుల దేశముతో ఇటు పారసీకమును అటు ఐయోనియావఱకును వీరి ప్రభావము వెలిగినది. మరి ఈ అసీరియనులకు ముందుండినవారు, నదీమధ్యమును (యూఫ్రటీసు టైగ్రీసుల నడిమి దేశమును) దాదాపు 400 సంవత్సరములు పాలించిన వారొక ఆర్యజాతివారు. మిట్టిలేకమిటన్ని యనబడువారు. వీరిని జయించినవారు అసీరియనులు, అనగా క్రీ. పూ. 1000—1400 లకు ఈ కాల పరిగణన పోవుచున్నది. పరిశోధకులు ఈ చరిత్రనంతయు ప్రతి అంశమును వదలక పరిశోధించినయెడల నాటి లిపులకును హరప్ప లిపికినిగల సంబంధము తెలియును.

ఒక విశేషమేమనగా ఆర్యజాతులనబడువారు సెమిటిక్ లిపుల ననుసరించినను ఎడమనుండి కుడివైపునకే వ్రాయుట గమనింపదగినది. గ్రీకులు ఈజిప్టువారినుండి గ్రహించిన ఫోనీషియనులనుండి గ్రహించినను వారివలె వ్రాయక 'ఆర్యపద్ధతి' ననుసరించిరి. దీని యంతరార్థమేమో.

మఱి ద్రావిడు లనబడువారో? వీరు బ్రాహ్మీ లిపినే ఏల ఆదరించిరి వట్టెళుత్తు బ్రాహ్మియేయని ఇప్పుడు తలంచుచున్నారు. మఱి సింధు లిపి వీరిది కాదుగదా ఐ యుండిన నేటిలేక ప్రాచీన తమిళ లిపికిని దీనికి లంకె యెట్లు కుదురును. వీరికిని మధ్యధరా సముద్రపు నాగరికతకును సంబంధము కనబడుచున్నది. ద్రావిడు లనబడువారెవరు? చేర

చోళపాండ్య రాజ్యాలవారి పూర్వులా ? వీరి భాష తమిళమా లేక ద్రావిడ భాషల పూర్వ రూపమా? తర్వాతి శాసనములు తమిళము నాదరించవని పల్లవులను వారి రాజ్యమును ద్రావిడ మనుచున్నవి. ఇది ఎట్లో! మొదట సముద్రతీరమునుండి లోపలికి మెట్టుమెట్టుగా పాండ్యులు వచ్చిరని తమిళ సంఘం చరిత్ర చెప్పుచున్నది. మొదటి సంఘమునకు మధుర రాజధానియట అది సముద్రమున మునిగిపోయినదట. కాబట్టే దానికి 'కడర్‌గొండ మధురై' సముద్రమున మునిగిపోయిన మధురయని పేరైనదట. తర్వాత రెండవ రాజధాని 'కపాటపురం' అట. ఇది రెండవ సంఘం కాలమందట. (మెగాస్తనీస్ పాండ్య కవాట మనుట దీనినేయై యుండునా?) ఇదియును సముద్ర మున మునిగిపోగా ఇప్పటి మధుర—ఉత్తరమదురై— నిర్మింపబడి మూడవ సంఘము వెలసినదట. ఈ కథ లెట్లుండినను రెండు నగరములు సముద్రముపాలై పోవుట, నేటికిని మహాబలిపురమువంటి ప్రదేశము లలో సముద్ర చొచ్చుకొనివచ్చుట చూడగా—సముద తీరవాసులై, నావికులై యుండినవారు క్రమముగా లోపలికి వచ్చియుండవలెను. వీరు నావికులుగా నుండి రనుటలో సందేహము. ఖారవేలుడను కళింగరాజు చేర చోళ పాండ్యుల సంయుక్త నౌకాబలమును, ఒక శతా బ్దముగా వారు కలసి గట్టుగానుండి వృద్ధినందించిన దానిని మహాసముద్రముమీద తన నౌకాబలముచేత జయించెనట. శాసనమే కలదు.! మఱి హిమవత్పర్వతమో లేక మధ్యనోయుండి ఆర్యులచేత తరుమబడి యుండిన యెడల ఆ జాడలేవి. అట్టివారు సముద్రతీరమునుండి క్రమముగా శతాబ్దములకు కొద్ది కొద్దిగా భూమిలో పైకివచ్చుట యేమి? సింధు నాగరికత ద్రావిడమవగా తమిళ సంబంధియై యుండినయెడల ఆ చిన్నెలు చేరచోళపాండ్య రాజ్యాలలో ఏల దొరకవు? కాబట్టి ఈ హప్ప లిపి ద్రావిడులు కొంతకాలము వాడి వదలు కొన్న లిపి కాదు. చేరచోళ పాండ్యులును పల్లవులు బ్రాహ్మీలిపినే ఆదరించిరి. క్రీటు ఈజిప్టు మున్నగు చోట్లనుండి తమిళ జాతులవారు వచ్చియుండినయెడల ఆ లిపులను వదలివచ్చియుండవలెను గదా. చాల కాలము నౌకా వ్యాపారములు చేయుచుండి వాఙ్మయా దిక మేర్పడునాటికి బ్రాహ్మీలిపిని తమిళులు ఆద రించి యుందురు. కాబట్టి తమిళనాడే వీరి మూల స్థానము.

శ్రీ ఎస్. ఆర్. రావుగారి పరిశోధన చాల దూరము చరిత్రకారుల భావములను రేకెత్తించునదిగా నున్నది. ఈ వ్యాసమునకు అనుబంధముగా పదముల పట్టికను, అర్థ వివరణములను, చిత్ర లిపి వర్ణ లిపి ఇత్యాది పటములను పట్టికలుగా అమర్చినారు. వీరు సూచించిన మార్గముననే పరిశోధించిన ప్రపంచ చరిత్రలో నొక నూతనాధ్యాయమే ఏర్పడగలదు. చాల గొప్ప వ్యాసము.

———



# మన ప్రకటనలు

## శ్రీ పులిచెర్ల సాంబశివరావు

వ్యాపారాభివృద్ధి నిమిత్తమై ప్రకటన లవసరము. తెలుగుదేశము లోనికి పత్రికలతోపాటు ప్రకటనలును వచ్చినవి.

ప్రకటనల రచన మొక కళ. ప్రకటన చూచి నంతనే ఆ వస్తువును కొనవలె ననిపింపవలెను! అప్పుడే ఆ ప్రకటన సార్థకమైనదనిపించును. ఇది ఆ రచయిత శక్తియుక్తులపై నాధారపడియుండును. చెప్పవలసిన విషయ మెంతోయుండి యుండవచ్చును. కాని పత్రికలో ఆ ప్రకటనకు కొద్ది చోటుమాత్రమే యుండును. ఇట 'అల్పాక్షరముల ననల్పార్థ రచన' అవసరము!

ఒక పుస్తక ప్రకటన ఇటులున్నది.

**ఢిల్లీ సామ్రాజ్యము**

ఇది యొక గొప్ప చారిత్ర గ్రంథము. కొన్నవారే మరలఁ గొనుచున్నారు. చదివినవారే మరలఁ జదువుచున్నారు!!!

ఢిల్లీ సింహాసనము మొదటఁ బాండవులచే స్థాపింపఁబడి, యిప్పుడు జార్జి చక్రవర్తిగారికి వచ్చెను. అందువలనఁ బాండవులు మొదలు జార్జి చక్రవర్తిగారివఱకు ఢిల్లీ సింహాసనమును బాలించిన సమస్త చక్రవర్తుల చరిత్రములు నీ గ్రంథమునందు వర్ణింపఁబడెను. ఇంకను నిందెన్నియో విశేషములు కలవు. ఒకేమాట. ఈ పుస్తకము కొఱకు ఆర్డరు రాని దినము లేదు! ఆలస్యమయినచో నిశ్చయముగాఁ బ్రతులు దొరకవు. వలసినచో వెంటనే వ్రాయుడు.

15. జూలై 1912 లో ప్రచురింపబడిన మనోరంజని అను మాస పత్రికలో నీ ప్రకటన మున్నది. ఆనాడు గ్రాంథికముననే సర్వవ్యవహారములు జరుగుచుండెను. ప్రకటన లన్నియు చక్కని సరళ గ్రాంథికమున చదువుట కింపుగా వ్రాయబడుచుండెవి.

ప్రకటనలు తాత్కాలికముగ వ్యాపారమునకు దోహదము చేయవచ్చును. కాని కాలము గడచిన తరువాత ఆ ప్రకటనలు, ఆ కాలమునాటి దేశ ఆర్థిక రాజకీయ సాంఘిక స్థితిగతులను తెలిసికొనుటకు చక్కని సాధనము లగును! పాత పుస్తకములలోని ప్రకటన లిప్పుడు మన కత్యంత ఆసక్తిదాయకము లగుట కిదియే కారణము. మనోరంజనిలో ప్రకటింపబడిన దీనిని చూడుడు!

**ఇది ముఖ్యముగా జదువుఁడు**

కొందఱు, మన చక్రవర్తిగారి పట్టాభిషేక సందర్భమునఁ దమ తమ పురములయందు జరుగు దర్బారులలో, మాచేఁ బ్రకటింపఁబడనున్న 'ఢిల్లీ సామ్రాజ్య' చరిత్రమును సభ్యులకు జదివి వినిపించుట కేర్పాటు చేయుచున్నారు. ప్రతి దర్బారు సభయందు నిట్లు జరిగినఁ జాల శోభగ నుండును. ఈ పుస్తకమునందు ఆంగ్లేయ పాలనము వచ్చిన వెనుక మన దేశమునకుఁ గలిగిన లాభము లన్నియు వర్ణింపఁబడెను.

జ్ఞాపిక: మనోరంజని కనుబంధముగా ఢిల్లీ సామ్రాజ్యమును బ్రకటించుచుంటిమి: కావున డిశంబరునెలలో మనోరంజనీ సంచిక వేఱుగా బయలు వెడల నేరదు—ఎడిటర్.

ఆ కాలమున భారతీయు లాంగ్లేయులవలన దేశమునకెంతో మేలు చేకూరినదని నమ్మిరి. ఈ విషయమును వివరించుటకై ప్రత్యేక గ్రంథములు

స్పైతము ప్రకటింపబడెనని పై ప్రకటనుబట్టి స్పష్టమగుచున్నది. 1913 ప్రాంతమున దేశమున క్రైస్తవ మాసపత్రికలు విరివిగా వెలువడెను. మేలు రకపు కాగితముపై పెక్కు విజ్ఞాన విషయములతో నీ పత్రికలు వెలువడినవి. అయినను నీ పత్రికలకు ప్రచారము తక్కువ. ఎక్కువ ప్రకటనలిందు కనుపట్టని దందుకే! 'వివేకవతి' అనునదీ విధమైన పత్రికలలో నొకటి. ఈ పత్రిక తననుగూర్చి తానే చివరి అట్టపై నిట్లు ప్రకటించి కొన్నది

### వి వే క వ తి

వివేకవతి స్త్రీలు చదువదగిన నానా విషయములను ప్రస్తావించు నొక మాసపత్రిక. ఇది క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారి వలన ప్రకాశింపబడెడిది. కావలసిన వారు మేనేజరుగారికి, పోస్టు బాక్సు నెం 3, మదరాస్, అనివ్రాసి చందాను, తమపై విలాసమును పంపినయెడల పత్రిక పంపబడును.

చందా : సంవత్సరమునకు పండ్రెండణాలు, నెలకు ఒకణా.

ఈ పత్రికయొక్క యుద్దేశమునకు సంబంధమయిన యే విషయమునయినను ప్రస్తావింపగోరెడి వారు తాము యోచించినది చక్కగా వ్రాసి, గుంటూరు జిల్లా గుంటూరులో నివసించెడి యీ పత్రికా సంపాదకురాలైన మెకాలి అమ్మగారికి పంపిన యెడల, ఆమె మిగుల సంతుష్టితో దాని నంగీకరించును. ఈ పత్రికను చదివెడు వారెవరైనను తమ తమ గ్రామములలో జరిగెడు యే విచిత్రమైన సంగతిని గూర్చియైన వృత్తాంతమును వ్రాసి ఆమెకు పంపిన యెడల, ఆమె దానిని నిండు కృతజ్ఞతతో నందుకొనును.

ఈ ప్రకటనలోని వ్యంగ్యము గమనార్హము. 'ఈ పత్రికయొక్క యుద్దేశమునకు సంబంధమయిన' అని పై ప్రకటనలో నున్నది. కాని ఆ ఉద్దేశ మేమియో వేరుగా వ్రాయబడలేదు. 'ఇది క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారివలన ప్రకాశింపబడెడిది' అను వాక్యమే దీనికి సమాధానముగా గ్రహింపవలెను. క్రైస్తవమత ప్రచారమునకు సంబంధించిన పత్రిక కాన, తత్సంబంధమైన విషయములనే వ్రాసి పంపవలెనని తాత్పర్యము.

ఔషధములను గూర్చి అప్పడప్పడే ప్రకటనలు వెలువడుచున్నవి. అనాడసత్యములు చెప్పు అలవాటు పెద్దగా లేదు. చివరకు ప్రకటనలలో స్పైతము అబద్ధములు వ్రాయుటకు భయపడుచుండిరేమో! 1911వ సంవత్సరము, విద్యావతి పత్రిక జనవరి సంచికలో నొక మందును గూర్చిన ప్రకటన మిట్లున్నది.

### ప్లేగు నివారణ ఔషధము

ఇప్పటికి 10-11 సంవత్సరములుగా ప్లేగు రోగము హిందూస్థానమునందున్నది. దానిని నివర్తి చేయు ఔషధము ఇంకను కనబడలేదు. అయినను జ్వరము వచ్చినతోడనే డాక్టర్ బాట్లీవాలాగారి ఎగ్యూమిక్చర్‌గాని, లేక ఎగ్యూపిల్సుగాని ఉపయోగించిన యెడల మిగుల మంచిది. ఈ ఔషధ ప్రభావము వాంయి ప్రాంతములోని ప్లేగ్ అధికార్లకు చక్కగా అనుభవమునకు వచ్చియున్నది. కావున అందరును తప్పక దీనిని చేతనుంచుకొని యుండవలసినది యత్యాంతావశ్యకము. దీని వెల బుడ్డి ఒకటికి, 1-0 0. 12 బుడ్లకయము 8-0-0. ఈ ఔషధము అన్ని మందుల షాపులలో దొరకును. లేక డాక్టర్ బాట్లీవాలా, వరలీ, దావర, బొంబాయి అని వ్రాసి మా వద్దనైనను తెప్పించుకొనవచ్చును.

'ఈ మందు వాడిన తప్పక గుణము కనిపించును' అని లేకుండుట గమనార్హము. హిందూస్థానము అనుటలో ప్రకటన కర్త ఉద్దేశము దక్కను కూడ దానిలో నంతర్భాగమనియే! 1911 లో మానవ సేవ అను పత్రిక వెలువడుచుండెను. ఇది సచిత్ర మాస పత్రిక. నాళము కృష్ణారావుగారు, కందుల శ్రీమన్నారాయణగారు దీని సంపాదకులు. ఆనాటి పత్రికలలో ప్రకటన లిందు నెక్కువగా వచ్చుచుండెడివి. ఆ కాలమున మూల్యము లెట్లుండెడివో ఇందలి ప్రకటనలు చూచిన స్పష్టమగును. ఇంతేకాక ఏవిధ

మైన గ్రంథము లానాటి తెనుగువారి కందుచుండెనో దీనినిబట్టి తెలిసికొనదగును గదా! ఒక ప్రకటన—

విజ్ఞాన చంద్రికా గ్రంథమాల

ఈ పేరుతో సంవత్సరమునకు నాలుగు వచన గ్రంథములు ప్రకటింపబడును. ఇంగ్లీషు రానివారికి ఆ భాషలో గల జ్ఞానమును తెలుగు మూలమున నేర్పుటయే యీ గ్రంథమాల యుద్దేశము. ఇది మాస పత్రిక కాదు.

ఇందు దేశ చరిత్రలు, ప్రకృతి శాస్త్రములు, చరిత్ర విషయిక నవలలు, మహాపురుషుల జీవితములు, ఇంగ్లీషులోని ఉద్గ్రంథముల భాషాంతరీకరణములు మాత్రము ప్రచురింపబడును. కావ్య నాటకాదు లిందుండవు

ఇదివరకు ప్రకటింపబడిన గ్రంథములు

| పేరు | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| అబ్రహాములింకను | 0– 8–0 | 0–12–0 |
| హిందూమహాయుగము | 0–11–0 | 1– 0–0 |
| జీవశాస్త్రము | 1– 0–0 | 1– 8–0 |
| రాణీసంయుక్త (అద్భుత నవల) | 0– 9–0 | 0–12-0 |
| మహమ్మదీయ యుగం | 1– 2–0 | 1– 8–0 |
| పదార్థవిజ్ఞానశాస్త్రం | 0–14–0 | 1– 5–0 |
| రసాయన శాస్త్రము | 0–13–0 | 1– 4–0 |
| ఆంధ్రుల చరిత్ర | 1– 0 0 | 1– 4–0 |
| విమలాదేవి (విచిత్రమైన నవల) | 0–13–0 | 1– 2-0 |
| కలరా | 0- 4–0 | 0– 6–0 |
| ప్రకృతి శాస్త్రముల ప్రథమ పాఠములు | 1– 2–0 | 1–10–0 |
| భౌతిక శాస్త్రముల ప్రథమ పాఠములు | 0– 7–0 | 0-10–0 |
| రా. బ. కం. వీరేశలింగముగారి స్వీయచరిత్ర | 1– 0–0 | 1– 4-0 |

ఈ పై వెలలలో శాశ్వతపు చందాదారులు పోస్టేజి నియ్యనక్కరలేద. ఇతరులు పోస్టేజి భరింప వలెను. శాశ్వతపు చందాదారులనగా మేము ప్రచురించు గ్రంథములన్నియు కొనుటకు నొప్పుకొనువారు. అట్టివారికి 100 పేజీలకు 0–1–0 చొప్పున వెలకట్టి ప్రతిపుస్తకము వి. పి. గా పంపి సొమ్ము వసూలు చేసికొనబడును. వెనుకటి గ్రంథము లన్నియు గొనువారు 0–4–0 లు, ముందు ప్రచురించునవి మాత్రము గొనువారు 1–0–0 ప్రవేశ రుసుము క్రింద చెల్లించవలెను. మా గ్రంథము లన్నియు చక్కని క్యాలికోతో బైండు చేయఁడి పెక్కు బొమ్మలతో ముద్దులు మూటగట్టుచుండుమ.

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి సి. ఎం.
మేనేజరు, విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట
మద్రాసు.

పత్రికలలో ప్రకటన రేట్లను గూర్చి ప్రకటించుకొనుట సామాన్యమే! ఆనాటి పత్రికలలో నీ విధమైన ప్రకటన లెట్లుండెనో తెలిసికొనుట కానాడు వెలువడుచున్న శ్రీ వైష్ణవ పత్రికలోని ప్రకటనము చూడనగును.

ప్రకటన రేట్లు

| | | |
|---|---|---|
| పేజీకి | నెల 1 కి | రు 8–0–0 |
| అర పేజీకి | ,, | 4–8–0 |
| పావు పేజీకి | ,, | 2-8–0 |

ఇతర వివరములు పత్రికా కార్యాలయమునకు వ్రాసిన తెలుపబడును. ప్రత్యుత్తరములను కోరువారు రిప్లయి కార్డులనుగాని తపాలా బిళ్లలనుగాని పంప వలయును.

పై విలాసము
మేనేజరు. శ్రీ వైష్ణవ పత్రిక కార్యాలయము
పెంటపాడు
అని వ్రాయవలెను.

ప్రకటన లానాటి సాంఘికస్థితి గతాదులను ప్రతిబింబించునని చెప్పితిని. ఈ శతాబ్ద్యారంభమున జను లెట్లు ప్రయాణములు చేయుచుండిరి? ఇతర దేశముల కెట్లు పోవుచుండిరి? ఓడల రాకపోక లేటిరున

పోగుచుండెను? ఆంధ్ర తీర ప్రాంతమున ఓడ లేయే ప్రాంతముల నిలుచుండెను? ఈ విధమైన ప్రశ్నల కీనాడు సమాధాన మెట్లు తెలియును? అనాటి పత్రిక లలో నీ విషయమై వచ్చిన ప్రకటనలు పరిశీలించిన తేటతెల్లమగును! 1912 వ సంవత్సరము 15 వ తారీఖున జులై నెలలో ప్రచురింపబడిన మనోరమ మాస పత్రికలో బ్రిటిషు ఇండియా స్టీమ్ నావిగేషన్ కంపెనీ లిమిటెడ్‌వారి ప్రకటన ఇట్లున్నది.

'ప్రతి శుక్రవారము రంగూను మోలుమేను వెళు స్టీమర్లు కాకినాడలో బయలుదేరి విశాఖ పట్టణము భీముని పట్టణము కళింగపట్టణము బారువా కోపాలపురముల మీాదుగా పోవును. యీా స్టీమర్లు ప్రత్యేకము మనుష్యలను సరకులను తీసుకనివెళ్ళ నిమిత్తమయి కట్టబడినవి. తట్టుమీాద కూర్చుండు జనమునకు వీలుగానుండునట్లు ప్రతి సదుపాయమున్ను యేర్పాటు అయియున్నది.

ప్రతివారమున్నూ అవే స్టీమర్లు రంగూను మోలుమేనులనుంచి పైన చెప్పిన రేవులమీాదుగా తిరిగి వచ్చుచుండును.

ఇండియా సిలోనులలోని అన్ని రేవులకున్నూ మోరిషస్‌కున్నూ మనుష్యులను సరుకులను కూడా యెక్కించుకొని పోవును.

బర్మాకు రేవుల విషయమై కంపెనీ రిక్రూటర్లవల్ల తెలుసుకొనవచ్చును. సరుకులను గురించి గాని జనమును గురించిగాని యే యితర విషయములు కావలసినను యీా క్రింది కంపెనీ వారివల్ల తెలుసుకొనవచ్చును.

ది. కోరమండల్ కంపెనీ లిమిటెడ్; యేజంట్సు, కాకినాడ.

ఆ కాలమున వెలువడుచున్న పత్రికలు పెక్కు ప్రకటనలకొరకై ఎదురు చూచుచుండెడివి. ఏవో బహుళ ప్రచారమునమన్న ఒండు రెండు పత్రికలలో తప్ప మిగిలిన పత్రికలలో ప్రకటన లుండెడివికావు. 1915 సంవత్సరమున బెంగుళూరు సిటీనుండి పండిత టి. సుబ్బరాయశాస్త్రిగారు భౌతిక కలానిధి యను పత్రికను ప్రకటించుచుండిరి. ఈ పత్రికలో ప్రకటనలు బహుస్వల్పము. ఒక సంచికలో—

## గ్రంథాలయ సర్వస్వము

ఆంధ్రదేశ గ్రంథ బాండాగార సంఘ పక్షమున మూడు మాసముల కొకసారి ప్రకటింపబడు గ్రంథము. సంవత్సరమునకు చందా అంచె కూలితో రు 2–6–0 లు మాత్రము. కార్యస్థానము బెజవాడ.

అను ప్రకటన ఒక్కటి మాత్రమున్నది. లందు వలన పత్రికాధిపతులు తమ పత్రికనుగూర్చి తామే ఒక ప్రకటన జేసికొనుచు ప్రకటన లాహ్వానించిరి. 'ఇది ప్రత్యాంగ్లేయ మాసమున కడాపటి వారమున ప్రకటింపబడుచుండు నాంధ్ర మాసపత్రిక. ఇందు సనాతన మతము ఆంధ్రభాష చరిత్ర వ్యవసాయ శాస్త్రము భౌతికాది భౌతిక శాస్త్రము మున్నగు నవేక విషయములు వ్రాయబడుచుండును. ఆంధ్రు లందరును తప్పక జదువ దగినది. ప్రకటన పద్ధతులు తెలిసి గొనువారు మాకు వ్రాయవలయును.

మ్యానేజర్, భౌతిక కలానిధీ ఆఫీస్, బెంగుళూరు సిటీ. ఈ విధముగ తమ పత్రికను గూర్చి వారు వ్రాసికొనిరి. ఇట్టి ప్రకటనలనుబట్టి తెలుగు దేశమున వెలువడుచున్నను, పెక్కు పత్రిక లాంధ్ర భాషకు సేవ చేయు నిమిత్తమే పుట్టియుండెనని తెలియు చున్నది. విజ్ఞాన శాస్త్రమును ఆంధ్రభాషలో నందింపవలెనని వారు పడు తహతహ వెల్లడి యగుచున్నది. 1909 లో సుదర్శన పత్రికాధిపతి తమ పత్రికలో నిచ్చిన ప్రకటనలోని అంతరార్థమును పాఠకులే ఊహించికొనగలరు!

## ప్రకటన

మాయొద్ద చక్కగా నచ్చుపడునట్టి ఫూల్ స్కేపు సైజు ఆల్‌బియన్ ప్రెస్సు 1 టి సరి క్రొత్తది అమ్మకమునకు సిద్ధముగా నున్నది. ఇంకయుం గావలయునేని దానితో గావలసిన టైపులు మొదలగునవికూడ సప్లయి చేయగలము. స్వంత

గ్రంథములు తరుచు ఇతరమైన ఆఫీసులలో అచ్చు వేయించుకొనుటకు మిక్కిలి ప్రయాసపడుచున్న కవులు మొదలగువారికి మిక్కిలి యుపయోగము. మిక్కిలి చిన్న స్కేలులో అచ్చు ఆఫీసు అంతయు గుదరును.

వలయువారు పత్రికాధిపతి
కస్తూరి శివశంకర కవి
విశ్వాసరాయపురము
శివకోడు పోస్టు
గోదావరి జిల్లా అని వ్రాయవలెను.

'హిందూ సుందరి' కాకినాడనుండి వెలవడు తెనుగు వరాన పత్రిక జూలై, 1919 సంచిక చివరి పుటలో వాంధ్రపత్రికవారి ప్రకటనల సమూహ మున్నది.

సుందరము! స్వదేశీయము! ఉపయోగము!

కాళయుక్తి సంవత్సరాది సం.

పింగళ సంవత్సరమున జరిగిన ఐరోపా మహా సంగ్రామ చరిత్రమును, ఆధ్యాత్మిక, నైతిక, సాంఘిక, రాజకీయ, వ్యావహారిక, విశేష విషయమ్ములవిజ్ఞాన దాయకమ్ములగు వ్యాసరాజమ్ములును, దర్శనీయమ్ములగు మహాజనుల పటములును, ఇతరములైన చిత్ర పటములను గలిగి మంచి కాకితముల పై చక్కగ ముద్రింపఁబడుచున్నది.

కాగితముల కఱవునం జేసి కావలసినన్ని ప్రతులు మాత్రమే సిద్ధము చేయించుచుంటవలన వలయువారు వెంటనే వ్రాసికొను టుచితము: వెల రు 2- 0-0

| | |
|---|---|
| ఆంధ్ర దిన పత్రిక సంవత్సర చందాదారులకు: | 0- 8-0 |
| ఆంధ్రపత్రిక అర్ధ సంవత్సర చందాదారులకు: | 0-12-0 |
| వార పత్రిక సంవత్సర, లేక దిన పత్రిక 3 మాసములకు | 1- 0-0 |

ఆంధ్రపత్రికా కార్యాలయము, పోస్టుబాక్సు నెం 212 మదరాసు.

అమృతాంజనము నొప్పులకు సిద్ధామృతము తామర తైలము డబ్బీ 1-కి 0-4-0 లు, పండ్లపొడి డబ్బీ 1-కి 0-2-0, మోహినీ తైలము సీసా 1-కి 0-12-0 పోస్టు ఖర్చులు ప్రత్యేకము. అనేక చోటలలో విక్రయింపబడును. 109 ఫ్రేరి రోడ్డు, బొంబాయి, 6 తంబుశెట్టివీధి, మద్రాసు. యుద్ధమువలన క్యాలండరులు కొద్ది ప్రతులు ముద్రింపబడుచున్నవి. దరఖాస్తులను వెంటనే పంపుకొనిన ఆశాభంగము గలుగదు.

పై ప్రకటనలవలన ఈనాడు మనము పెక్కు విషయముల నెరుగగలము. యుద్ధమువలన అన్నిటికి కరవైనది. కాగితము దొరకలేదు. యుద్ధ విశేషములను వివరించు ప్రత్యేక వ్యాసములు వెలువడినవి. క్యాలండరుల నిచ్చు ఆచార మా నాటిదే!

హిందూ సుందరి పత్రికను ప్రచారములోనికి తెచ్చుటకై ప్రకటన విషయమున వారు క్రొత్త మార్గమును త్రొక్కిరి. తండ్రి కూతుళ్ల సంభాషణ రూపములో నా ప్రకటనయుండి, ఈ నాటి సినిమా ప్రకటనలను తలపించుచున్నదది

హిందూ సుందరి

తండ్రి—కుమార్తె

కు—నాన్నగారు! అవేమి పుస్తకములు ఆ పిల్లలు అల్లా పట్టుకు పోతున్నారు.

తండ్రి—అమ్మా! అవి హిందూ సుందరి పత్రికలు.

కు—వాటికి ఏమి యివ్వవలెను.

తండ్రి—సం॥రమునకు రెండు రూపాయిలు యిస్తే, నెలకొకసారి యిటువంటి సంచికలు పంపెదరు.

కు—ఇంతేకద, రెండు రూపాయిలు యిచ్చి నాకు పత్రిక తెప్పించి పెట్టలేరా? నా చదువు మీ కిష్టము లేదా. నిన్నటి మీటింగులో మీరేకాదు స్త్రీలకు విద్య చెప్పించమనిరి.

ఇప్పుడు వేమన ప్రసిద్ధుడు. వేమనగూర్చి ఎంతో కృషి జరిగినది, ఈ కృషిలో నొక భాగమే

రాధారాణి అందు కంపెనివారు 1925 లో అచ్చు వేసిన వేమన పద్యములు అను పుస్తకము. ఈ పుస్తకమునకు ముందు వారొక ప్రకటన నిచ్చిరి. ఈ ప్రకటనమునుబట్టి ఆ నాటికి వేమన పద్యము లెట్లచ్చగుచుండెనో మనకు తెలియుచున్నది.

వేమన పద్యములు

ఘనులారా! ఈ నోటీసును మిగుల జాగరూకతో గవనించవలయునని కోరుతున్నాము.

నోటీసు యొక్క పత్రికటనము

ఇందువలన యెల్లరకు తెలియజేయు విజ్ఞాపన మేమనగా:—ఇదివరలో వేమన పద్యములు అనేక అచ్చాఫీసులలో అనేక విధములుగా చిన్న అక్షరము లందు ముద్రించి మితిలేక వాండ్లకు దోచినట్లు క్రమముతప్పి తమ కిచ్చవచ్చినట్లు ముద్రించి యున్నారు. కాబట్టి యిప్పుడు గ్రంథము మేము పురాతనము తాటియాకుల పుస్తకములలోనుండి క్రమక్రమముగా మొట్టమొదటి పద్యమునుంచి ఆరంభించి యెత్తి పెద్దక్షరములుగా అచ్చువేసి యున్నాము. ప్రస్తుతము ముందు చిన్న అక్షరములలో అనేక అచ్చాఫీసులయందు విశేషముగానున్నను మిక్కిలి అసందర్భముగాను అనగా తప్పిదములుగాను కొన్ని చోట్ల అక్షరములు కనుపడి కనుపడక యుండుట యును చక్కగ పరిశీలింపక యుండుటవలన బొత్తిగనే వదలిపెట్టి యుండుటయును చిన్నక్షరములుగా నుండుటవల్ల అనగా దూరదృష్టికి గోచరింపని బాలురకును, పెద్దలకును చత్వారము కలిగిన వారలకును, చదువుటకు యోగ్యము లేక అననుకూలముగ నుండుటచే, నదరహీ పై కనుపరచిన మూడు తెగలవారికిని ద్రావిడమందు పరిచయముగల నూతనముగ ఆంధ్రమునే అభ్యసింప గోరినవారికిని, అనుకూలముగను, సులభోపాయముగను, స్పష్టముగను, నుండునటుల మున్ను దెలిపిన కష్టముల నివారింపబూని, పండితులచే చక్కగను, శ్రద్ధతో సాహిత్యములు లేక యుండునట్లు పరిశీలనచేసి పెద్దక్షరములలో శుద్ధ ప్రతిగా నున్న ముద్రించి యున్నాము వలయువారలు 'మాయందు దయయుంచి యుత్తరము బంపినయడల తోడనే వి. పి. పోష్టు ద్వారా పంపెదము యిదిగాక మా వి. పి. కంపెనీ క్యాట్‌లాకు వలయు వారలు అర్ధణా స్టాంపు పంపిన పక్షమున తోడనే మా కంపిని క్యాట్‌లాగు పంపుతున్నాము.

పై ప్రకటన ఈనాడు వేమనపై పరిశోధన చేయువారికి మిగుల ఉపయుక్తము!

రానురాను ప్రకటనలు వ్యావహారిక భాషలో వెలువడినవి. ఇప్పటి ప్రకటనలు పరిశీలించినచో మన కొక విషయము స్పష్టమగును. ప్రకటనల రచన విషయమున మన మెంతో అశ్రద్ధ చూపుచున్నామనుటయే అది! ఈనాడు వార్తాపత్రికలలోని ప్రకటనలును, వివిధ భారతి తెలుగు ప్రకటనలును తెలుగుగా కన్పట్టవు. ఆ ప్రకటనలలోని తెలుగు విన్నంతనే ఆ వస్తువుపై రోత పుట్టుచున్నది. మొదటికే మోసము వచ్చుచున్నది.

———



కలగూరగంప :

# దశరథరాజనందన చరిత్ర - సమీక్షా పరిశీలనము"

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1970 సం॥రంలో మరింగంటి సింగరాచార్యుల దశరథ రాజనందన చరిత్రమను గ్రంథమును నాపరిష్కరణతో ప్రకటించిరి. ఈ గ్రంథముపై 1973 ఏప్రిల్ నెల భారతిలో సమీక్ష వచ్చినది. పూజ్యులైన నోరి నరసింహశాస్త్రిగారు సమీక్షించినారు. పండితులు కవులు — అనుభవజ్ఞులు నైన శాస్త్రిగారు సమీక్షించుట సంతోషావహము.

వీరి ఈ దీర్ఘ సమీక్షలో కొన్ని నూతన విషయములను తెలిపినారు, నా పొరపాట్లను పేర్కొని వానికి సవరణలుకూడా చూపి కృతజ్ఞతా పాత్రులైన శాస్త్రిగారి సమీక్ష చదివిన తర్వాత వారు వ్రాసిన కొన్ని విషయాలకు పరిష్కర్తనైన నేను సమాధానము వ్రాయవలసి వచ్చినది. ఇది శాస్త్రిగారిపై నాకు కల గౌరవ భావముతో వ్రాయుచున్నట్టిది.

భారతి 71 వ పుట మొదటి రెండు పేరాలలో సమీక్షకులు నా శ్రమకు సంతోషించి సంతృప్తులైనందుకు కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను, అదే పేరాలో చివర—'కాని' ఒక్కవిషయములోమాత్రము పరిష్కర్త ఈ గ్రంథమునకు కవియైన సింగరాచార్యులకు న్యాయము చేయలేదని నా మూల దృష్టికి తోచి నిశితముగా పరిశోధింపగా ఆ భావము ధ్రువపడినది—' అని వ్రాసి నిరోష్ఠ్యముగూర్చిన విషయములు కొన్ని తెల్పినారు. ఇట్లుగా నేను తెల్పక పోవుట గ్రంథమునకు గ్రంథకర్తకు అన్యాయము చేసినట్లు వారి 'స్థూలదృష్టికి' తోచి ఆ భావము 'ధ్రువపడిన'దట. అంతేగాక నిరోష్ఠ్య నియమమును గూర్చి నేను (గ్రంథ పీఠిక 39 వ పుటలో) 'తప్పుగా తెలుపుట క్షంతవ్యము కాదు. అందువలన వారి పరిష్కరణమంతయు పెడదారి పట్టినది.'—అని వ్రాసిరి. నిరోష్ఠ్య విషయమై విన్నకోట పెద్దన, అప్పకవి వీరి పద్ధతులను పేర్కొని పెద్దన పద్ధతి సంశయాస్పదమని నేను వ్రాసితిని. శాస్త్రిగారు వ్రాసినట్లు నేను మాత్రము 'కంఠోక్తిగా' దానిని తప్పని తెల్పలేదు. 39 వ పేజీలో 'తప్పు' అని వ్రాసినట్లు లేదు. ఇది వీరికి నచ్చకనో లేక, వివరముగా లేదనియో బాధపడుచు నాది 'తప్పు'గా తెల్పుట విచారణీయము. 36 వ పుటలో 'నిరోష్ఠ్య రచనా సంప్రదాయము' అను శీర్షికలోని విషయములోకాని 37 వ పుటలోని పెద్దన లక్షణమునుగాని నేను ఖండింపలేదు. 'సింగరాచార్యులు పెద్దన నియమానుసారముగా ఆ వర్ణముల ధారాళముగా వాడి యున్నాడు' (39 పుట.) అనియే తెల్పినాను. ఈ భాగమే 'క్షంతవ్యముగాదు' అని శాస్త్రిగారు వ్రాయుటకు వీలు కలిగించినది. అది సరియగునని 'కాదు' అని వారు తెల్పినచో ఇంతకు మునుపు తెలిపిన వానివలెనే వీనిని గ్రహించుటకు నేను సంసిద్ధుడను. అంతేగాని 'అన్యాయము' (?) చేసి 'క్షంతవ్యుడను' కానని శాస్త్రిగారు వ్రాయుట. అన్యాయముగా నున్నది.

ఇక భారతి 72 వ పుటలో అప్పకవి లక్షణము విషయములో నేను వ్రాసిన భాగము నుదాహరించి 'అప్పకవి మీద దండయాత్రలు చేయుట పరిపాటి యైనది' అనిరి. అయ్యా! నేను అప్పకవి

లక్షణము సంశయాస్పదమన్నాను గాని సరిగ దన్నానా? మంచిని మంచిగాను మంచితనముగాని దానిని, మంచి తనముకాని దానినిగను తెల్పుట దండయాత్ర చేయుటయా? అందులో అప్పకవి విషయములోనా? అయినా తాము ఇంకా కొంత శ్రమించి సంశయ నివృత్తి చేసినచో సంతోషించెడివాడను గదా!

73 వ పుటలో శాస్త్రిగారు '—తక్కిన గ్రంథములో కవి పాటించిన నిరోష్ఠ్య నియమమును సరిగా పరిశీలింపక—' ఇత్యాదిగా వ్రాసిరి తక్కిన గ్రంథమనగా ఇచట సింగరాచార్యులయొక్క 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము'—దానిలో కవి నిరోష్ఠ్య నియమమును తెల్పినాడు. దానిని నేను పరిశీలింప లేదని వీరి భావన కాని నేను దానిని పరిశీలించితిని. వివరింపక పోవుటకు రెండు కారణాలు గలవు 1. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము అచ్చ తెనుగు రచన, ప్రస్తుతము సమీక్ష చేయబడిన గ్రంథము తద్భిన్నమైనది. అచ్చతెనుగులో చేయు నిరోష్ఠ్య రచనకు. ఈ గ్రంథ రచనకు కొన్ని నిరోష్ఠ్యాక్షరములు, అచ్చతెనుగు పద్ధతిలోనివి చేరవు అను భావనయు, 2. దశరథరాజనందన చరిత్ర తరువాత సీతా కల్యాణము వ్రాసి ఉండవచ్చునను భావనతో (చూ. పుస్తకముల జాబితా: గ్రంథ పీఠిక—పుటలు 22, 23.) సీతా కల్యాణములోని లక్షణము దశరథ రాజనందన చరిత్రమునకు ఎట్లుగా అనువర్తింప చేయుదు అనియే నా కనుమానము. ఇట్టి నా అనుమానము సమీక్షకులకు వేరుగా అవకాశము కల్పించినది. గ్రంథములోని 1—56 వ పద్యములోని నిరోష్ఠ్య విషయమును పేర్కొని 'ముద్రాపకు లెవరో పూరించిన భాగము ప్రమాణముగా గ్రహించి పరిష్కర్త సింగరాచార్యుల నియమమును నిర్ధారించుట శోచనీయము' అని (73 వ పుటలో) వ్రాసిరి. ఈ పద్యము 1917 ముద్రణలోను, ప్రస్తుత ముద్రణలోను కుండలీకరణముతో ప్రారంభమైనది. దీని తరువాతగల 'కానన్—నేనిడు...' ఇత్యాది పద్యమునుండి కుండలీకరణము ప్రారంభము గావలయును గ్రంథ పీఠిక 31 వ పుటలో 'ఐనను నూన హీను...' పద్యము తత్పూర్వతనుండి' అని నేను వ్రాసినాను. అంతే కాక ఎకాడెమీకి నేను వ్రాసియిచ్చిన ప్రతిలో ఈ పద్యము క్రింద 'ఫుట్‌నోట్సు' ఇట్లు వ్రాసితిని 'తాళపత్ర ప్రతిలోను, లిఖిత ప్రతిలోను, ఈ పద్యము కలదు. ముద్రాపకులు దీనికి బదులు 57 వ పద్యము నుండి కుండలీకరణము చేర్పవలసి యుండెడిది!' అని వ్రాసితిని. ముద్రణ ముగాని ముఖ్యవిషయములలో ఒకటై ఇది పోయినది. ఇది యే శాస్త్రిగారికి అనవసర శ్రమ కలిగించినది.

ఇక 73 వ పుటలోనే నోరివారు ఆశ్వాసములలోని పద్యములను వానిలో పూర్తి నియమము గలవానిని, నియమ భంగమైన వానిని, నియమ భంగములైన అక్షరములుగల వానినిగా విభజించి పేర్కొనిరి ఈ జాబితా 'రెండు మూడు—సార్లు పరీక్షించి తయారు చేసిన పట్టిక' అని వారే తెల్పిరి. కాని 1—56 కు బదులు 1—115, 4—173 కు బదులు 4—175, 5—303 కు బదులు 5—306 అని ఉండవలయును. నియమ రాహిత్యముగల పద్యములని వారు పేర్కొనిరి వాని సంఖ్య యిచ్చినచో పరిశీలింప వీలుకలిగెడిది.

4—153 వచనము 'కిరీటాద్యలం క్రియల్' అని యుండునట్లుగానే నేను కాపీ వ్రాసితిని. ('ల్' అనియేగాని 'లు' మాత్రముకాదు.) కనక, కన్క, కనిక అనియే నా వ్రాత. కాని ప్రెస్ కాంపోజిటర్లు, ప్రూఫ్‌రీడర్లు వీటిని దిద్ది (వారికి ఇవి తప్పు అను భావన కలిగి) ముద్రించినప్పుడు అట్టి తప్పుల బాధ్యతకూడా పరిష్కర్త వహింప వలసినదేనా? ఎకాడెమీవారు కనీసము ఫైనల్ ప్రూఫ్‌లైన నాకు పంపక పోవుట యనునది ఇట్లుగా జరిగినది. ఈ విషయములో నేను చేయునదేమియును లేదు.

74 వ పుటలో శాస్త్రిగారు 'ముఖ్యముగా ఆశ్వాసాద్యంత పద్యములు పరీక్షించినచో కట్టతెగిన జలప్రవాహమువలె ఓష్ఠ్యవర్ణములు గుంపులు కట్టినట్లు చూడవచ్చును.' అనివ్రాసినారు. కవి నిరోష్ఠ్య

నియమమును కథా భాగములో మాత్రమే పాటించి నాడని పీఠికలో నేను తెల్పినాను. కృత్యాది కృత్యంత ములయందుగాని, ఆశ్వాసాద్యంతములలోగాని నిరోష్ఠ్య నియమము పాటింపబడలేదు అని స్పష్టముగా తెలియు చుండగా శాస్త్రిగారు భ్రమపడిరనుకొందమా? అది యును కాదు. ఎందుకనగా 73 వ పుటలో 'ఆశ్వా సాద్యంత పద్యములు వదలి వేసినచో (నిరోష్ఠ్య విషయమున) అని వీరే వ్రాసిరిగదా! ఇట్లు స్వవచన వ్యాఘాతమును వారు కల్పించుకొని ఇతరులననుట ఎట్లుండునో వారికే తెలియవలయును. సమీక్షకులు 'కవి మంచి లక్షణవేత్తగా కనిపించుట లేదు' (74 పు.) అని కొన్ని ఉదాహరణము లిచ్చిరి. అవి మొత్తము 7. 5-265, 285 లోను 'సంతన గతి' 'సంతన గతిచేన్' అని కలవు వానిని 'సంతన సంగతి' అని పేర్కొనిరి. 5-157 'దశరథయుగ్ర తనయు' అనిరి. 157 నెంబరు అచ్చుతప్పులో ఇదే ఆశ్వాసములో 'కాంచన స్యందన' 'అస్పరకర్త' ఇత్యాది రెండు పద్యములకు గలవు. 'దశరథ యుగ్రతయన' మాత్రము ఎక్కడిదో? మిగతావి వారు సూచించి నట్లే గలవు. పరిష్కరణలో వీనికి సవరణలు ఈయక పోవుట నా పొరపాటే.

ప్రథమ ముద్రణప్రతి అచ్చుస్థితిని గూర్చి దోషముల గూర్చి (పీఠికలో పు. 29) నేను తెల్పిన దానిని నరసింహశాస్త్రిగారు వాహరించి 'ఆ మాటలు సాహిత్య అకాడెమీ పక్షమున ముద్రింపబడిన ఈ గ్రంథమునకుగూడా అన్వయించుననుటకు గ్రంథ మంతయు ప్రత్యక్ష సాక్ష్యము—' ఇత్యాదిగా ఏమేమో వ్రాసిరి ఈ పద్ధతి ఈ ఒక్క గ్రంథమునకే గాదు. ఏకాడెమీవారు ముద్రించిన ప్రతిగ్రంథమునకును వర్తించునని నేను చెప్పుటయేగాదు పత్రికలలో వచ్చిన విమర్శలు గూడా సాక్ష్యాధారములు. శాస్త్రి గారి అడ్రెస్ తెలిపితే ప్రథమ ముద్రణ ప్రతి, నేను సిద్ధముచేసి ఏకాడెమీ వారి కొసంగిన ప్రతికి సరియైన ప్రతి పంపుకొందును. వానిని చూచిన తర్వాతనైన వీరి భావనకు మార్పు కలుగునేమో యని నా భావన.

దశకుమార చరిత్రలోని నిరోష్ఠ్య విషయము, నేను దశకుమార చరిత్రలోగల (సంస్కృతము) నిరోష్ఠ్య రచనను పేర్కొని ఆంధ్రీకరించిన వారు దీనిని నిరోష్ఠ్యముగా చేయలేదని తెల్పుచూ ఎకా డెమీ వారి కేతన దశకుమార చరిత్రముపై వచ్చిన విమర్శలను పేర్కొని వీరుకూడా ఈ విష యములను పేర్కొనలేదని తెల్పుట కవి సామ్రాట్టు గారికి బాధ కలిగించినది. విమర్శకులు సూక్ష్మ పరిశీలన చేసిరిగదా, ఈ నిరోష్ఠ్య విషయమును ఎందుకు ప్రస్తావింపలేదో అనియే నా యూహ. అంతేకాని అది 'అనవసరమని' నేననుకోను.

సింగరాచార్యుల అచ్చుతెనుగు రచనను గూర్చి వీరునాది 'స్వవచన వ్యాఘాతము' అనిరి. అచ్చట బాగుగా పరిశీలించినచో 'స్వవచన వ్యాఘాతము' ఉండజాలదు. (1972 జూన్ భారతిలో' యయాతి చరిత్రము మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యమా!' అను నా వ్యాసమును శాస్త్రిగారు చూచియే యుందురు. మరియొకమారు చూడగోరుదుము.)

77 వ పుటలో 'ప్రాంతీయ దురభిమానము'ను ప్రస్తావించిరి. గోలకొండ కవుల సంచికలోని విషయ మును నేను పేర్కొన్నందుకు వీరి యూహలో అది ప్రాంతీయ దురభిమానమైనది. ఇచ్చటి వారు జాతీయ కవులను పేర్కొని 'ప్రాంతీయ దురభి మానములు వదలవలసిన అవసరమెంతో యున్నది.' అని ఒక ధర్మ సూక్తిని ప్రవచించిరి. అయ్యా! మీరా నేనా అనుకున్నంతలో ఈ దురభిమానము పోవునట్లు లేదు. అయినను సాహిత్య విషయములో ప్రాంతీయమైన అభిమానమున్ననాడే అది అభివృద్ధి చెందగలదు. అంతేగాని మీరు ఊహించినట్లు గాదు. జగ్గయ్యపేటలో, గుంటూరులో సింగరాచార్యుల రచనలు ముద్రింపబడుటకు ఆనాటి కారణములు వేరు. దానిని ప్రాంతీయ భావన క్రింద జమకట్టు కొనుట ఎట్లో? 'అతడు' 'అతగాడు' అను ఎద

ములను పట్టుకొని నిఘంటువుల పేర్కొని సింగరాచార్యులను ఎక్కడి వాడుగానో భావించి సమీక్షకులు 'సందేహము'ను వ్యక్తపరచిరి. నయమే! సందేహము తోనే పోయినది. ఇంకను నిరూపింపలేదు. ఈ విధముగా పదములబట్టి నిర్ణయించినచో ఒక ప్రాంతము కవి వేరొక ప్రాంతము వాడగుటకు వీలున్నది.

ఎకాడెమీవారు నా పై పెట్టిన భారమును తృప్తికరముగా నిర్వహింపలేదని, ఉత్సాహము ఆవేశమును కలిగించి శ్రద్ధను, నిగ్రహమును పోనాడ చేసినది అనివారు వ్రాసినారు గ్రంధ పరిష్కరణలో ఇదియే నా ప్రథమ ప్రయత్నమని పీఠికలో తెల్పియే యున్నాను. కొన్ని కొన్ని పొరపాట్లు జరిగియుండ వచ్చును. అంతమాత్రము ననే నోరి వారూహించినట్లు అందరును ఊహింప వీలు కలుగదు. నిగ్రహము లేకుండునట్లు వ్రాసిన వ్రాత వేరొకవిధముగానుండును. ప్రస్తుత సమీక్షలో కొంతవరకు శాస్త్రిగారు ఇట్టి దానికి లోనైరని విదితమగుచున్నది. పెద్దలైన వీరు యువకులకు ఉత్సాహము కలిగించుటకు బదులు నిరుత్సాహమును వృద్ధిచేయుట తగనిది. ఎంతో అనుభవముగల వీరు కూడా ఎకాడెమీవారి యయాతి చరిత్ర పీఠికలో 'చిలువ పడిగ తేనికత.'అను గ్రంథము సింగరాచార్యులదని వ్రాసితిరి. ఇది చిన్న పొరపాటేనా?

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి ఈ విపుల సమీక్షా చివరి భాగము ఇట్లు గలదు. 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణమును సాహిత్య అకాడెమీవారు ప్రచురించుటకు పూనుకొని ఉత్సాహముతోబాటు శ్రద్ధయు, సమర్ధతయు కలవారిని ఎన్నుకుందురు గాత!' అనిరి. ఎకాడెమీలో ఇట్టివి కలవారే యోగ్యులు. ఈ ఉత్సాహం శ్రద్ధ, సమర్ధత లేనివారు ఎకాడెమీ అధికారుల ఆదరణ పొందుట కష్టము. ఎకాడెమీలో ప్రచురింపబడిన సరియైన గ్రంథము ఏ ఒక్కటైన ఉన్నచో సంతోషము. అన్నివిధాల సమర్థులైన శాస్త్రిగారే 'సీతా కల్యాణము'ను పరిష్కరించి ప్రకాశింపజేసినచో వారిని గౌరవించు వ్యక్తులలో నాకన్న ఎక్కువ సంతోషించువారుండరు.

శ్రీ శ్రీరంగాచార్య

---



# గ్రంథ విమర్శలు

## వ్యావహారిక భాషా వికాసం

(కర్త: డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ; పేజీలు: 170; వెల: 6 రూపాయలు; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1972.)

'వ్యావహారిక భాషా వికాసం, చరిత్ర' అనే అంశం మీద ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పుస్తకాలను ఆహ్వానించింది. బహుమతికి అర్హమైన పుస్తకాలు రాలేదని గడువు పొడిగించింది. చివరికి రెండు పుస్తకాలను బహుమతి కర్హంగా ప్రకటించింది. అందులో ఒకటి ఇప్పుడు విమర్శిస్తున్న పుస్తకం. రెండోది అక్కిరాజు రమాపతిరావుగారు రాసిన 'వ్యావహారిక భాషా వికాసం—చరిత్ర' అనే పుస్తకం. ఇది కూడా అచ్చయింది. ఒకే అంశం మీద రాసిన పుస్తకం గనక దాని ప్రస్తావన కూడా ఈ విమర్శలో వస్తుంది. బూదరాజు రాధాకృష్ణగారు తమ వంతు బహుమానాన్ని నిరాకరించారు. 'మరొకరితోబాటు' తనకు బహుమానం ఇయ్యటం అందుకు కారణంగా రాధాకృష్ణగారు ఈ పుస్తకంలో చెప్పారు. దీన్ని కారణంగా చెప్పటం అంత ఉచితంగా కనపడదు. బహుశా తమ కెక్కడో అన్యాయం జరిగిందని ఆయన ఉద్దేశం కావచ్చు. ప్రభుత్వ సంస్థల్లో ఇట్లాంటివి జరగటం అసాధారణం కాదు. ఇదే నిజమయితే ఇది మొదటిసారి జరిగిందని కూడా అనుకోనక్కర్లేదు. ఈ విషయంలో సాహిత్య అకాడమీని ప్రత్యేకంగా కేటాయించాల్సిన పని కూడా లేదు. వీటన్నిటికీ మూల కారణాలు ఈ వ్యవస్థలోనే ఉన్నై. అది గుర్తించిన వారికి ఇది పెద్దవిశేషంగా కనపడదు.

అచ్చయిన రెండు పుస్తకాలను పోల్చి చూస్తే రాధాకృష్ణగారి పుస్తకం మేలుగా కనిపిస్తుంది. రాధాకృష్ణగారి ఆలోచనల్లో స్పష్టత ఉంది. రచనలో చురుకుదనం ఉంది. డొంకతిరుగుళ్లు, కప్పదాట్లు, గోడమీద పిల్లివాటాలు లేకుండా కుండ బద్దలు కొట్టినట్టుగా చెప్పటం రాధాకృష్ణగారికి అలవాటు. అయితే ఒక్కోసారి అతిశయోక్తి మీద మోజు చూపిస్తారు. ఈయన శైలిలో చురుకుదనంపాలు కొన్ని చోట్ల ఎక్కువై అవహేళనలుగానో, దూషణలుగానో మారుతుంటై కొన్ని వాక్యాలు. అట్లాంటి చోట్లను తరవాత చూపిస్తాను.

రాధాకృష్ణగారికి భాషను గురించి ఉన్న అవగాహన సరి అయిన మార్గంలో ఉంది. మరీ ఇటీవలి సిద్ధాంతాలతో పరిచయం తక్కువైనా భాషా శాస్త్ర పద్ధతుల్లో ప్రవేశం ఉంది. మంచి విశ్లేషణ దృష్టి ఉంది. శాసన భాషమీద వీరుచేసిన పరిశోధన ఈ పుస్తకానికి చాలా లాభించింది. వ్యావహారిక భాషా వాదానికి 'కమిట్' అయిన పరిశోధకుడీయన. ఇట్లాంటి పుస్తకం రాయటానికి ఈ 'కమిట్మెంటు' అవసరం.

రమాపతి రావుగారి పుస్తకంలో వ్యావహారిక భాషా వాదానికి సంబంధించిన 'డాక్యుమెంటేషన్' ఎక్కువ, ఈయనే విన్నపంలో చెప్పుకున్నట్టు గిడుగు సీతాపతిగారితో ఉన్న 'బాంధవ్యం' ఈయనకు ఉపయోగపడింది. కథా కథనం ఈయన పద్ధతి. పుస్తకంలో కొన్ని అధ్యాయాలు చదువుతుంటే జీవిత చరిత్రలు చదువుతున్నట్టుంటుంది. అయితే ఈయనకు భాషను గురించి సరైన అవగాహన లేదు. విశ్లేషణ దృష్టిలేదు. సూటిగా చెప్పే అలవాటు లేదు. శైలిలో కన్సిస్టెన్సీలేదు. రచన చాలా మందకొడిగా ఉంటుంది. 'ఏమైనా, ఏదేమైనా' అనే మాటలతో మొదలయ్యే వాక్యాలగా, 'అనే చెప్పాలి', 'అని చెప్పవచ్చు' వంటి క్రియలతో అంతమయ్యే వాక్యాలు ఎక్కువ. పాతకాలపు వ్యావహారిక భాషా వాదుల 'న్నూ', 'న్నీ' (వారున్నూ, అనిన్నీ వంటి రూపాలు) వంటి సన్నా

వ్రుయాలూ, 'ఉంటవి, చేస్తవి' వంటి క్రియా రూపాలూ, తెలుగు అకాడమీవారి 'వలె', పదాంత 'ము'లు కలగలిపిన శైలి రమాపతిరావు గారిది. వీటన్నిటినీ భరించవచ్చుగాని భాషను గురించి వీరు చేసిన ప్రవచనాలు మాత్రం సహించరానివి. మచ్చుకు కొన్ని

(1) 'వ్యావహారిక భాషలో కావ్యభాషలోకన్నా నియమ రాహిత్యం ఎక్కువ'. (పేజీ 22)

(2) 'పామరులు వ్యవహరించే భాష గ్రంథ స్వీకారార్హం కాదు. సంస్కార హీనతవల్ల ఉచ్చారణాది దోషాలు ఆ భాషలో వ్యవస్థ ఉండదు...పామర భాషలో కన్నా శిష్టభాషలో ఎక్కువ వ్యవస్థ ఉంటుంది.' (పేజీ 52).

(3) 'గ్రామ్యము, నియమ రహితము'. (పేజీ 55).

(4) 'వ్యవస్థలేని భాష గ్రామ్యము, వ్యవస్థ ఉన్న భాష వ్యావహారికము'. (పేజీ 61)

'భాష, వ్యవస్థ, నియమం, వ్యాకరణం' అనే మాటలు రమాపతిగారికే మాత్రమూ అర్థం కాలే దనటానికి పై వాక్యాలు సాక్ష్యాలు. ఈ వాక్యాల్ని ప్రత్యేకంగా ఇయ్యటానికి కారణం, భాషాశాస్త్రం బాగా ప్రచారంలోకి వచ్చిన ఈ కాలంలోకూడా ఇట్లాంటి తప్పుడు భావాలు విద్యావంతుల్లో. కాస్తో కూస్తో పేరు తెచ్చుకున్న రచయితల్లో ఉన్నయ్యన్న బాధే.

పామర భాషకన్నా శిష్టభాషలో ఎక్కువ వ్యవస్థ ఉంది, శిష్టభాషకన్నా కావ్యభాషలో ఎక్కువ వ్యవస్థ ఉంది. కాబట్టి కావ్యభాషనే రచనా భాషగా ఎందుకుంచగూడదు? ఇదంతా నాన్సెన్సు. శిష్టభాష అశిష్ట భాషకన్నా వ్యాకరణరీత్యా ఉత్తమం అనటానికి ఆధారాల్లేవు. శిష్ట శిష్టేతర విభాగం భాషా సంబంధికాదు. వ్యవహర్తల సాంఘిక స్థితికి సంబంధించింది. వర్గవిభక్త సమాజంలో పై తరగతి వారు తమను తాము శిష్టులమని పిలుచుకుంటున్నారు. ఇది వర్గ దురహంకారం. విద్యావకాశాలు పై తరగతుల వారికే ఉన్న వర్గవ్యవస్థలో వాళ్ల భాషే రచనా భాషగా చలామణి అవుతున్నది. ఇదే పరిస్థితి ఎల్లకాలమూ ఉంటుందన్న గ్యారంటీ లేదు, ఇవంతా శిష్ట వ్యావహారికం అనే మాట తెచ్చిపెట్టిన తిప్పలు. గిడుగు రామ్మూర్తిగారూ, గురజాడ అప్పారావుగారూ మహా మేధావులై కావచ్చు. కాని వారిమీద బూర్జువా సమాజ ప్రభావం విపరీతంగా ఉంది. వారు ప్రయత్నించింది బూర్జువా సంస్కరణల కోసమే. వారి తిరుగుబాటు ఫ్యూడల్ వ్యవస్థమీద.

రాధాకృష్ణగారు శిష్టవ్యావహారికం అనే మాటను వాడినా ఇట్లాంటి తప్పులు చెయ్యలేదు.

రాధాకృష్ణగారి పుస్తకంలో మొత్తం 6 అధ్యాయాలున్నై. 1. ఉపోద్ఘాతం. 2 వ్యావహారిక భాషా వికాసం (శాసన భాష, పాఠ్యన్నయ భాష, నన్నయానంతర భాష) 3 వ్యావహారిక భాషా వికాసం (సాహిత్యం, అన్యదేశ్యాలు, వ్యావహారిక రూపాలు, మాండలిక పదాలు) 4. వ్యావహారిక భాషా వాదం పూర్వరంగం. 5. వ్యావహారికోద్యమ చరిత్ర. 6. సిద్ధాంత చర్చ : వాదోపవాదాలు.

శాసన భాషను గురించి తాము చేసిన పరిశోధన, కందప్పచెట్టిగారు చేసిన పరిశోధన ఆధారంగా విశేష విషయములు చెప్పారు. తెలుగు భాషలో వచ్చిన పరిణామాలను, ముఖ్యంగా వర్ణాల్లో జరిగిన మార్పులను శతాబ్దాలవారీగా సాక్ష్యాలతో సహా ప్రదర్శించారు.

గ్రాంథిక భాషావాదుల తప్పుడు వాదాల్ని సమర్థంగా ఖండించారు. ప్రామాణిక భాష ఏర్పడే తీరును గురించి విశేషమైన చర్చ చేశారు. ఇవన్నీ ఈ పుస్తకం విలువనూ, ప్రయోజనాన్ని పెంచినై.

ఇన్ని విశేషాలున్న ఈ పుస్తకంలో ఈ సమీక్షకుడు అంగీకరించలేని అంశాలు కూడా అధికంగానే ఉన్నై. ఈ విషయాలను విస్తారంగానే వ్రస్తావిస్తాను. ఈ విమర్శలన్నీ గ్రంథకర్త ఒప్పుకోకపోవచ్చు. తోటి పరిశోధకుడిగా నా అభిప్రాయాలను నిర్మొగమాటంగా,

అనెస్టుగా రికార్డు చెయ్యటమే ఈ విమర్శ ఉద్దేశం. ఈ విమర్శలను సహృదయంతో పరిశీలించి రెండో ముద్రణలో మార్పులుచేస్తే ఈ పుస్తకం విలువ ఇంకా పెరుగుతుందన్న ఆశ ఈ సమీక్షకుడి కుంది.

నా అభిప్రాయాలను 'అయిటం'వారీగా క్రమ సంఖ్యలో రాస్తాను. సంఖ్య వెంటనే రాధాకృష్ణగారి పేరాల సంఖ్యలను, అవసరమైనచోట్ల పేజీల సంఖ్యలను బ్రాకెట్లలో ఇస్తాను.

1. (1.5, 6.1, 6.2) 'తమ తమ అభిప్రాయాలను అన్యోన్యం తెలుపుకోటానికి ప్రజలు ఉపయోగించే ధ్వని సమాహారమే భాష' అన్న నిర్వచనం బ్లాక్, ట్రేగర్లు తమ 'Outline of linguistic analysis' అనే పుస్తకంలో ఇచ్చిన 'Language is a system of arbitrany vocal symbols...' అన్న నిర్వచనాన్ని పోలిఉంది. ఇది అసమగ్రం భాషను నిర్వచించేది ధ్వని సమూహం కాదు. అభిప్రాయ ప్రకటనకు ధ్వని సమూహాన్ని ఉపయోగించే జంతువులు చాలా ఉన్నై. భాషకు వ్యాకరణం ఉంది. జంతువుల అరుపులకు లేదు. అనంత వాక్యనిర్మాణ దక్షమైన వ్యాకరణాన్ని మానవులు నిర్మించు కుంటారు. ఆ శక్తి మనుషులకు మాత్రమే ఉంది. అందువల్ల భాషను మిగతా అభిప్రాయ ప్రకటన సాధనాలనుంచి వేరుచేసేది వ్యాకరణం.

2 (2.1) కావ్యభాషకు 'భావ్యాకాశాల మధ్య ఉన్న అంతరం' ఏర్పడిందనటం అతిశయోక్తి.

3. (2.34, 2.35) 'యకారంబును, వు, వూ, వొ, వోలును తెలుగు మాటలకు మొదట లేవు.' అనే సూత్రాన్ని గురించి రాధాకృష్ణగారు అంత 'యాగీ' చెయ్యాల్సిన అవసరం కనపడలేదు. బాల వ్యాకరణం కావ్యభాషకు రాసిన వ్యాకరణమని గుర్తించినప్పుడు 'పదాది యవలను ఉచ్చారణలో ఉన్నా నిషేధించాడు' అనే వ్యాఖ్యకు అవసరంలేదు. ఉచ్చారణలో ఉన్నై కాబట్టే రాతలో వస్తయ్యన్న భయంకొద్దీ ఈ సూత్రం రాశాడు ఙ, ఞ, ణ, ళ లు పదాది ఉచ్చారణలోనూ లేవు, రాతలోనూ లేవు. కాబట్టి దాన్ని ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. పదాదిన ద్విరుక్త వర్ణాలు తెలుగులో లేవు. అది కూడా చెప్పలేదని చిన్నయసూరిని తప్పు పడతామా? ప్రాచీన వ్యాకరణాలను వాటి ప్రయోజనాల దృష్ట్యా మాత్రమే విమర్శించటం సమంజసం.

పదాదిన; యకారానికీ, ఓష్ఠ్యచ్చుల ముందు వకారానికీ వర్ణత్వంలేదు అనే Phonotactic Rule గా దీన్ని వ్యాఖ్యానించే అవకాశం ఉంది.

4. (2.37) అను స్వారశేఖనాన్ని గురించి చెపుతూ, 'పదాంశంలోనూ, పదాంశావధుల దగ్గరా, పదాంతంలోను ఈ లేఖన పద్ధతి...వాడుకలో ఉన్నా...' అని రాశారు. దీన్ని పదాంశ పద్ధతిలో చెప్పక్కర్లేదు. పదమధ్యంలోను, పదాంతంలోను అంటే చాలు పదాంశావధి పదాంశానికి రెండు పక్కలా ఉంటుంది. అప్పుడు దీనికి అతివ్యాప్తిదోషం అంటుకోవచ్చు.

5. (2.4) పదాంతాచ్చులు హల్లుకు ముందు లోపించటం కద్దు. శాస్త్రీయంగా చెప్పాలంటే హలంత శబ్దాలకు అజాగమం ఈ రూపాల్లో రాలేదనాలి' అని రాశారు. మొదటి పద్ధతి అశాస్త్రీయ మెందు కవుతుంది? అజ్లోప పద్ధతి కూడా శాస్త్రీయమే

6. (2.43) మన్ని+అణ్ణా > మన్న్యణ్ణా అనేది సంస్కృత పద్ధతిలో జరిగిన సంధి అనుకోను. తెలుగు పద్ధతిలోనే తాలవ్యత్వాన్ని పరంలోని అకారానికి అంటించి ఇకారం తొలగిపోతుంది. యావత్తును

తాలవ్యత్వాన్ని మాత్రమే గుర్తుగా గ్రహించటానికి వీలుందేమో రాధాకృష్ణగారు పరిశీలించాలి.

7. (2 54) మనిన> మన్న పురోగామి వర్ణ సమీకరణానికి ఉదాహరణగా ఇవ్వటం పొరపాటు. ఇక్కడ జరిగింది స్వరలోపం మాత్రమే.

ఇడిన> ఇడ్డ

ఉండిన> ఉన్న

ఈ రెండూ తిరోగామి వర్ణ సమీకరణానికి ఉదాహరణగా ఇచ్చారు. ఇందులో రెండోది మాత్రమే ఇందుకు సరిపోతుంది. మొదటిది (సమీకరణమైతే) పురోగామి సమీకరణ మవుతుంది.

8. (2.63, 6 54)" ఉన్న, కల, వవర్ణ కంబుల మీద తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు (క్రియ. 117)" అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు (ప్రకీ. 13)" దక్కులోనగు వాని దాకు డకారంబు విభాషనగు (ప్ర కీ. 14)" అనే బాలవ్యాకరణ సూత్రాలను ఉదాహరించి కొన్నిటిని చారిత్రకంగా తప్పులన్నారు. చిన్నయసూరి చారిత్రక వ్యాకరణం రాస్తున్నానని ఎక్కడా చెప్పలేదు చారిత్రక దృష్టితో చిన్నయసూరిని తప్పనటం అనుచితం. Process Statements చారిత్రక వ్యాకరణం లోనే కాదు, వర్ణనాత్మక వ్యాకరణంలోనూ ఉంటై. గణితసూత్రా లన్నిటినీ (Process Statements) చారిత్రక సూత్రా లనుకోవటంవల్ల కాబోలు ఇటీవల కొందరు పొరపాటు చేస్తున్నారు. వీటి తత్వాన్ని గ్రహించక తొందరపాటుతో 'మొదటి సూత్రంలో మిడతం భొట్లు పలికాడు, రెండో సూత్రంలో పార్వతీదేవి శాపం అడ్డుపడ్డందువల్ల వ్యవహారం బెడిసికొట్టింది (పేజీ 140), చిన్నయ్య రాసింది పెద్ద దవుతుందా? (పేజీ 141) వంటి వాక్యాలు రాయటం పరిశోధకులకు ప్రతిష్ఠాకరం కాదు. శాస్త్ర దృష్టి ప్రశాంతంగా ఉండాలని (పేజీ 19) తనే చెప్పి, అందుకు విరుద్ధంగా, తనే పొరపాటు పడి, పూర్వ వ్యాకర్తలను దూషించటం, విజ్ఞులు మెచ్చే పని కాదు. చిన్నయసూరి చెప్పిన దాంట్లో పొరపాట్లుండవని కాదు. ఎవరైనా పొరపాటు పడవచ్చు. కాని అకారణంగా దూషించటం మాత్రం అనుచితం అంటున్నాను.

9. (2 81, 2 82) తెలుగులో యత్తద్ర్ధక వాక్యాలూ, - కర్మణి వాక్యాలూ, సంస్కృత భాషా ప్రభావంవల్ల తెలుగులోకి వచ్చినయ్యనీ, అవి కృత్రిమమనీ చాలామందితోపాటు వీరూ నమ్ముతున్నారు. ఇవి అంత తొందరగా తేల్చదగినవి కావు.

'ఎవరు ముందు వస్తారో వాళ్ళకి తాయం పెడతాను' అని ఒక తల్లి అనటానికి వీలుంది. ఈ వాక్యం కృత్రిమమని తోసి వెయ్యలేం. సంస్కృత ప్రభావం వాక్య నిర్మాణం విషయంలో ఆ భాష తెలియని వ్యవహర్తల మీద ఉంటుందనుకోను.

కర్మణి వాక్య నిర్మాణం ద్రావిడ భాషల్లో సంస్కృతంకన్నా భిన్నంగా ఉంది. సంస్కృతంలో క్రియకు ప్రత్యయం చేరుతుంది. ద్రావిడ భాషలో అనుబంధక్రియ (తెలుగులో అన్నంత క్రియకు 'పడు') చేరుతుంది. భిన్న ద్రావిడ భాషల్లో ఒకే పద్ధతి ఉండటం, అది సంస్కృతంకన్నా భిన్నంగా ఉండటం చూస్తే ఇది సంస్కృతం ప్రభావం కాదేమో నని పిస్తుంది. ఇదే సంస్కృత ప్రభావమయితే అతి ప్రాచీన కాలంలో ద్రావిడ భాషలు వేరుపడకముందు ఎప్పుడో జరిగి ఉండాలి. ఇది తెలుగు కవులు తెచ్చిపెట్టిన కృత్రిమత్వం కాదు. పైగా కృత్రిమత్వం ఫ్రీక్వెన్సీ (frequency) ని బట్టి నిర్ణయించలేం.

10 (2.92) 'చెప్పారు' వంటి క్రియల్లో ఉన్న భూతకాల బోధకమైన ఏ అనే వివృతాచ్చు 'ఇప్పటి మన భాషలో ప్రత్యేక వర్ణమే' నంటారు. ఇది స్థూల దృష్టితో చెప్పిన మాట జనరేటివ్ ఫొనాలజీ (Generative phonology) పద్ధతిలో ఉచ్చారణ భేదంగా నిరూపించవచ్చు. వివృతమైన ఏ ఎక్కడ వస్తుందో Predict చెయ్యవచ్చు,

11. (3) ఈ అధ్యాయంలో ఇచ్చిన కావ ప్రయోగాలకు పెద్ద ప్రయోజనం కనిపించదు. ఈపని

గిడుగు రామమూర్తిగారు, వడ్లమూడి గోపాల కృష్ణయ్యగారు విస్తారంగా చేశారు. కవులు వ్యవహార బలంనుంచి తప్పించుకోలేదని వాళ్లు రుజువుచేశారు. మళ్లీ అదే పని ఇవ్వాళ చెయ్యాల్సిన అవసరం లేదు. ఈ సెక్షన్‌లో సరిగ్గా ఎడిట్ చేసుకోకపోవటంవల్ల దొరలిన ప్రమాదాలు కొన్ని ఉన్నై. వాటిని ఈ కింద చూపిస్తాను.

12. (3.2, పేజీ 55) తెలివిడి, మెఱుసుట, దున్నకము, చేసుట వంటి రూపాలను ధాతుజ విశేషణాలుగా ఇయ్యటం ప్రమాదికం. ఇవి భావార్థక రూపాలు. (పేజీ 56) 'విచారించుకోక' విశేషణం కాదు. 'అక' ప్రత్యయాంతావ్యయం.

'అయితె, కల్గితే, పోంతే, అల్లితే, పొడితే, మీటితే, ఆడితే' అనే రూపాలు పొరపాటున తద్ధర్మ విశేషణాలకింద చేరినై. వాటిని చేదర్థకాలకింద చేర్చాలి.

13 (4.1) ఈ పేరాలో రాసిన 'భగ్న పృష్ఠ కటిగ్రీవులై, స్తబ్ధదృష్టులై అధోముఖులై...' అనే వాక్యం ఈ పుస్తకం శైలిలో ఇమడటం లేదు. అంత గొట్టువాటలు వాడాల్సిన అవసరం ఇక్కడ కనిపించదు

14. (4.41) ఈ పేరాలో వ్యవహారికోద్యమానికి దారి తీసిన సమాజ పరిస్థితుల్ని ప్రస్తావించారు. దీన్ని ఇంకాస్త పెంచి వివరించి ఉంటే బాగుండేది. ఇది అంత తొందరగా మనసుకు పట్టేది కాదు. మన తెలుగు చదువరుల్లో చాలామందికి మార్క్సిజంతో పరిచయంలేదు. ఇది లోపంగా కూడా భావించదు మన తెలుగు పాండిత్యం.

వ్యావహారిక భాషోద్యమం బూర్జువా సమాజానికి అవసరమైంది. ఈ అవసరాలను గమనించిన విద్యావంతులు గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావులు వీళ్ల సంఘ సంస్కరణాభిలాషుల కూడా కావటం యాదృచ్ఛికం కాదు. అట్లాగే గ్రాంథిక భాషా వాదులు ఫ్యూడల్ సమాజపు ప్రతినిధులు. వాళ్లల్లో చాలామంది సంఘ సంస్కరణకు వ్యతిరేకులు కావటం గూడా గమనించదగింది. వీటిని కాస్త విపులంగా చర్చించిఉంటే ఎక్కువ ఉపయోగం ఉండేది.

15. (5.6) 'వ్యావహారిక భాషాదయం భరించలేని దివాంధాలు విశ్వవిద్యాలయ రక్షణలో, పాఠ్యగ్రంథాల్లో తలదాచుకోవాల్సిన దుస్థితి వచ్చింది.'

ఈ పై వాక్యంలో చెప్పిన విషయం యదార్థమే. అయినా ఇంత దురుసుగా చెప్పాల్సిన అవసరం లేదు. ఈ కాలంలో వ్యావహారిక భాషోద్యమం డిఫెన్సులో లేదు. అందువల్ల గ్రాంథిక భాషావాదుల మీద కత్తులు నూరాల్సిన పనిలేదు. గ్రాంథిక భాషలోనే రచన జరగాలనే మొండి పండితులు ఈ కాలంలో చాలా కొద్దిమంది ఉన్నారు. వాళ్లైనా, భాషను గురించిన విజ్ఞానాన్ని తెలుసుకునే అవకాశం లేక తమ అభిప్రాయాలు మార్చుకోలేకపోతున్నారు. తిట్లద్వారా కాక వాళ్లకి భాషా విజ్ఞానాన్ని అందించటం ద్వారా వాళ్లని ఒప్పించటానికి వీలుందనుకుంటాను. కొంతమంది గ్రాంథిక భాషావాదులు తమ బతుకు తెరువు పోతుందనే భయంవల్ల గ్రాంథిక భాషను వదులుకోలేకుండా ఉన్నారు. గ్రాంథికంలోనే పరీక్ష పేపర్లు రాయాలనే నియమం ఆ స్కూళ్లలోనుంచిపోతే గ్రాంథికభాషలో పుస్తకాలు రాసుకొని పాఠ్యగ్రంథాలుగా పెట్టించుకుని నాలుగు రాళ్లు చేసుకునే అవకాశం పోతుందని వీళ్ల నిజమైన భయం. ఈ పుస్తకాలవల్లనైనా పాపం ఈ పండితులకు ముట్టేది చాలా కొద్ది. వచ్చే లాభమంతా ప్రచురణ కర్తలే దోచుకొని, ఏదో కొద్దిగా ఈ పండితులకు ముట్టజెపుతారు. ఈ విషయాలను గ్రాంథిక భాషావాదులకు నచ్చజెప్పి వీళ్ల భయాందోళనలు పోగొట్టే మార్గం వెతకటం అవసరమనుకుంటాను.

16. (5.7) గ్రాంథికభాషావాదులు 'జయంతి' పత్రిక ద్వారా (1958) లేవదీసిన దుమారం తరవాత తెలుగు అకాడమీ రాయించే పుస్తకాల్లో వాడాల్సిన శైలి విషయంలో ఇంకో ప్రయత్నం చేశారు. దాని

విషయం ప్రస్తావించారు గాని, ఇంకాస్త వివరంగా రాస్తే చరిత్రను రికార్డు చేసినట్టుండేది. అయితే రాధాకృష్ణగారికి ఈ పని చెయ్యటానికి కొన్ని ఇబ్బందు లుండవచ్చు

ఆంధ్రా యూనివర్సిటీవారు వ్యావహారిక భాషను పరీక్షల్లో ప్రవేశపెట్టటానికి ఆలోచిస్తున్న విషయం కూడా ఈ అధ్యాయంలో చేర్చవచ్చు.

17 (6.21, 6.22; .) ఈ పేరాల్లో ప్రామాణికభాష ఏర్పడే పద్ధతుల్ని చర్చించారు. ప్రామాణికభాషా నిర్ణయంకాని, పరిణామంకాని భాషే తర సాంఘిక పరిస్థితులవల్ల జరుగుతుందన్న విషయం ఇంకాస్త నొక్కి చెప్పాల్సింది. గ్రామ్యం కన్నా, శిష్ట వ్యావహారికానికి ఎక్కువ వ్యవస్థ ఉందనుకునే వాళ్లు ఇంకా ఉన్నారు. 'పెద్ద తరగతులు' వారి భాష ప్రమాణం కావటానికి వారికున్న విద్యావకాశాలు కారణాలు. ఇవి వర్గ సమాజపు సహజ లక్షణం. ఈ 'పెద్ద తరగతుల'వారే శిష్టు లవుతున్నారు. ఈ శిష్ట వ్యావహారికం అనే మాట అపార్థాలకు తావిస్తున్నది. ఒక రకమైన భాషను వాడే వాళ్లను శిష్టులనీ, మరో రకమైన భాషను వాడే వాళ్లను అశిష్టులనీ అనటం అన్యాయం.

18. (6.26) స్థానిక మాండలికాలను తుడిచిపెట్టిన తరవాతనే ఈ ప్రామాణికం ఇతర ప్రాంతీయ రూపాలను తన పరిధిలోకి తెచ్చుకుంటుందని రాశారు. ప్రామాణికభాష ప్రాంతీయ భేదాలను తుడిచిపెడుతుందనేది అనుభవ విరుద్ధం. ప్రామాణిక ప్రాంతీయ భేదాలు ఒకదాని సరసన ఒకటి సహవాసం చెయ్యవచ్చు. ఈ సహవాసంవల్ల ఒకదాన్ని ఒకటి ప్రభావితం చేస్తుంది. అంతేకాని పూర్తిగా తుడిచి పెట్టదు.

19. (6.33) యెస్పర్సన్ ప్రతిపాదించిన పండిత, భౌగోళిక, సాహిత్యకులీన, ప్రజాస్వామిక, తర్క, ఆలంకారిక ప్రమాణాల్ని పరిశీలించి ప్రజాస్వామిక ప్రమాణాన్ని ఎన్నిక చేశారు. కాని శిష్ట వ్యావహారికం ప్రజాస్వామిక ప్రమాణాన్నిబట్టి ఏర్పడింది కాదు. కులీన (వర్గ) ప్రమాణాన్నిబట్టి ఏర్పడింది.

'జనసామాన్యంలో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే రూపమే వ్యాకరణరీత్యా సాధువనే వాదాన్ని భాషావేత్త లనేకులు ఆమోదిస్తున్నారు.'

'(6.34) భాషలో ఇది తప్పని, ఇది ఒప్పని చెప్పదగింది లేదనే నిర్ణయానికి వచ్చారు.'

ఈ పై రెండు వాక్యాలూ ఒకదాని కొకటి విరుద్ధంగా కనిపిస్తున్నై. ఇవి పక్కపక్క పేజీల్లోనే ఉన్నై. వ్యాకరణరీత్యా సాధువు అంటే తప్పొప్పుల నిర్ణయమే అవుతుంది. భాషకూ వ్యాకరణానికీ ఉన్న సంబంధం విషయంలో రాధాకృష్ణగారు పొరపాటు పడుతున్నట్టున్నారు.

ఈ సాధువు. అసాధువు అనే మాటలు శిష్ట వ్యావహారికంలాగే మనకు వ్యావహారికోద్యమంనుంచి సంక్రమించినై. ఏది సాధువు, ఏది అసాధువు అనే చర్చే ఈ కాలంలో అర్థ రహితం.

(6.35) 'ప్రామాణిక రూప నిర్ణయానికీ సాధుత్వా సాధుత్వ చర్చలకు సంబంధంలేదు' అని ఒక పక్కన అంటూనే 'బహుళ వ్యాప్తిలో ఉన్న రూపం ప్రామాణికం—భాషా శాస్త్రజ్ఞుల దృష్టిలో అదే సాధువు. అప్రామాణిక రూపాలే (అంటే స్థానిక మాండలికాల వంటివే) తత్కాలంలో అసాధువులు' అని అనటం ఎందుకు? అప్రామాణిక రూపాలు అసాధువు లెందు కవుతై? కొందరు వ్యవహరించే భాషను, ప్రామాణిక భాషకు భిన్నమైనా అసాధువనే హక్కు భాషా శాస్త్రజ్ఞులకే కాదు, ఎవరికీ లేదు. రాధాకృష్ణగారైనా మాట వరసలో, వాదన పద్ధతిలో అట్లా రాశారనుకుంటాను అసలు సాధువు అసాధువు అనే గొడవ మన కెందుకు? ఈ మాటలవల్ల మనం దేన్ని వ్యతిరేకిస్తున్నామో, దాని వలయంలోనే చిక్కుకునే ప్రమాదం ఉంది.

20. (6.51) భాషా పరిణామంలో పూర్వ లక్షణాలు తరవాత కాలంలో మారతయ్యని వాదిం

చటం బాగానే ఉంది. సంస్కృత వ్యాకరణ సంప్రదాయాన్ని దేశభాషా వ్యాకరణా లనుసరించటానికి 'జన్యజనకభావం' (సంస్కృతంనుంచి తెలుగు పుట్టింది అనే భావం) ఒక్కటే కారణ మనలేం. సంస్కృత వ్యాకరణ సంప్రదాయం ప్రాచీనకాలపు భాషా సిద్ధాంతం (Linguistic Theory) ఆ సిద్ధాంతం సర్వభాషలకూ అన్వయిస్తుందని ప్రాచీన వ్యాకర్తలు భావించారు భాషల మధ్యభేదాలకన్నా సామ్యాలే ఎక్కువని వారి ఊహ అయి ఉండాలి. అది సరైన ఊహే. కేవలం సంస్కృతభాషకు మాత్రమే అన్వయించేవి ఏవో, ఇతర భాషల కన్వయించేవి ఏవో అనే విభాగం వాళ్లు సరిగ్గా చేసుకోలేకపోయి ఉండవచ్చు. అట్లాంటి చోట్లు చూపించి వాటిని విమర్శించటం సరైన పద్ధతి. అంతేకాని అయినదానికీ, కానిదానికీ చిన్నయసూరి మీద విరుచుకుపడటం సమంజసం కాదు. రాధాకృష్ణగారి విమర్శ యెస్పర్సన్, బ్లూంఫీల్డు వంటివారి అభిప్రాయాలను అనుసరించి చేసింది. భాషలమధ్య భేదాల్ని భూతద్దంలోలాగా చూపించారు అప్పటి భాషా శాస్త్రజ్ఞులు. 'భాషా విభాగాలు అనేవి భాష కొక తీరులో ఉన్నాయి' అనటం అప్పటి ఆలోచననుసరించే 'Languages could differ from each other without limit and in unpredictable ways... (Martin Joos)' అన్న ఒకనాటి అమెరికన్ సంప్రదాయాన్ననుసరించి రాధాకృష్ణగారు, భాషలమధ్య భేదం విపరీతంగా ఉంటుందనుకుంటున్నారు. భాషల మధ్య భేదాల కన్నా సామ్యాలే ఎక్కువని ఈనాటి భాషా శాస్త్రజ్ఞుల మతం. సర్వభాషలకూ ఒకే గుప్త నిర్మాణాన్ని ప్రతిపాదిస్తున్న ఈరోజుల్లో భాషలమధ్య భేదాల్ని గోరంతలు కొండంతలుగా చూపించటం భాషా తత్వాన్ని అర్థం చేసుకోటానికి సహాయపడదు. చిన్నయ సూరిలో లేని దోషాలు కనిపించటానికి కారణం ఈ అవగాహన లోపమే ననుకుంటాను. పదేళ్లకిందటికన్నా ఇప్పుడు భాషల్నిగురించి మన అవగాహన పెరిగింది. భాషా సిద్ధాంతం పెరిగింది. వ్యాకరణాల స్వరూపం మారింది.

21. (6.52) ఇంతకుముందే సూచించినట్టుగా (19. (6.33) రాధాకృష్ణగారికి ఎవర్ని విమర్శిస్తున్నారో వాళ్లవలయంలో తమకు తెలీకుండా చిక్కుకుపోయే అలవాటుంది. అందుకే (పేజీ 135) 'చెనగలు, సెనగలు' అనే రూపాల్నిగురించి రాస్తూ 'పీటిలో ఏది చెడిపోయి కుళ్లిపోయిన రూపమో పై ఉదాహరణమే నిరూపిస్తుంది' అని రాశారు. బాషాక్షయ సిద్ధాంతాన్ని నిరాకరిస్తూనే మళ్లీ 'చెడిపోయి కుళ్లిపోవటం' అనే మాటల్ని వాడటం ఎందుకు? బహుశా ఎత్తిపొడవటంకోసం ఇట్లా రాస్తారేమో? ఎత్తిపొడుపులు శాస్త్ర చర్చకు అలంకారం కావు.

22. (6. 54, పేజి 140) పరస్పర విరుద్ధమైన నిర్ణయాలు చిన్నయసూరి చేశాడని కొన్ని సూత్రాలను ఈ పేరాలో విమర్శించారు. ఏండ్లు అనే రూపాన్ని సాధిస్తూ సూరి ఏంఢ్లు అనే రూపాన్ని 'తెనుఁగున బిందుపూర్వక స్థిరంబు లేమిం జేసి' నిరాకరిస్తాడు. 'అంటే ఇక్కడ బిందువు ఉంటుంది, స్థిరం (ఢకారం) తొలగిపోతుంది' అని వ్యాఖ్యానించటం పొరపాటు. స్థిరం అసలు రానేరాదు. పరుష సరళములకు ముందే బిందువుంటుందన్న గ్రాఫోటాక్టిక్ సూత్రం (Graphotactic Rule) దీన్ని రానియ్యకుండా నిరోధిస్తుంది.

'నాఁడు' అనే రూపంలో బిందువు స్థిరం ముందు తొలగిపోతుంది.

పై రెంటిమధ్యనున్న వైరుధ్యం ఏమిటి? 'ఇదంతా సతార్కిక, సశాస్త్రీయ, ప్రామాణిక విధానమే గదా మరి' అని చిన్నయసూరిని ఎగతాళి చెయ్యాల్సిన అవసరం కనిపించటంలేదు—ఇదే పేజీలో 'ఇలాంటి అసందర్భాల నన్నిటినీ చర్చించటం ఇక్కడ సాధ్యపడదు. ప్రత్యేక గ్రంథమే రాయవలసి ఉంటుంది' అన్నారు. ఆ గ్రంథ మేదో త్వరగా రాస్తే అక్కడ ఇంకాస్త విపులమైన చర్చ ఉండటానికి అవకాశం ఉంది.

23. (6.6) ఈ పేరాలో వ్యావహారి

భాషకు వ్యాకరణాలను గురించి ప్రస్తావించారు. దీనికి ఒక అధ్యాయమే కేటాయిస్తే బాగుండేది. విదేశీయులు, తెలుగువాళ్లు, ప్రాచీన, ఆధునిక పద్ధతుల్లో రచించిన వ్యాకరణాలు, చర్చించిన వ్యాకరణాంశాలు విపులంగా పరిశీలించాల్సింది ఇట్లాంటి పుస్తకంలోనే. ఆ పని రాధాకృష్ణగారు చేసి ఉండాల్సింది.

ఇదే పేరాలో (పేజి 142) 'భాషలోని పద సంఘటనల క్రమ వికాసాన్ని సూచించేవి వికాసక వ్యాకరణాలు. వాక్య నిర్మాణక్రమంలో భిన్నపద జాతుల అన్యోన్య సంబంధాలను శబ్దార్థ సంబంధాలను నిరూపించేవి పరివర్తక వ్యాకరణాలు' అని నిర్వచించారు. ఈ నిర్వచనాలు తప్పు. ప్రామాణికమైన ఏ శాస్త్ర గ్రంథాల్లోనూ ఇట్లాంటి నిర్వచనాలు కనపడవు. ఈ నిర్వచనాలెందుకు తప్పో చెప్పాలంటే ఈ వ్యాకరణాల్ని గురించి విపులమైన చర్చ చెయ్యాల్సి వస్తుంది. అసలీ నిర్వచనాల అవసరం ఏమొచ్చిందిక్కడ?

తమ రాత ప్రతిమీద ఎవరో పెన్సిల్‌తో ఏవేవో రాసిన విమర్శలు కనిపించినయ్యని, ఆ ఆక్షేపణలను, సమాధానాలను సంక్షిప్తంగా అనుబంధంలో ప్రకటించారు. ఈ పుస్తకాలను బహుమతికోసం ఎన్నిక చెయ్యటానికి చదివిన పరిశీలకుల్లో ఒకరు ఈ వ్యాఖ్యలు చేసి ఉంటారు. వీటిని రాధాకృష్ణగారు ఉపేక్షించి ఉండాల్సింది. అవి చర్చార్హాలు కూడా కావు.

ఈ విమర్శ మొదటే చెప్పినట్టుగా ఈ విషయం మీద అచ్చయిన రెండు పుస్తకాల్లో ఇది మేలైనది. పై విమర్శలను రాధాకృష్ణగారు సహృదయంతో పరిశీలించి రెండో ముద్రణలో దీన్ని ఇంకా మంచి పుస్తకంగా తీర్చి దిద్దుతారని ఆశిస్తాను. ఒకే విషయాన్ని గురించి ఆలోచించే ఇద్దరు పరిశోధకులకు అభిప్రాయ భేదాలుండటం సహజం. వాటిని నిర్మొగమాటంగా ప్రకటించటం కూడా అవసరం. భాషా చర్చల్లో ఈ సంప్రదాయం ఉంది. ఈ సంప్రదాయమే ప్రస్తుత విమర్శలో పాటించబడింది.

—'వే రా'

# ఎర్ర పిడికిలి

రచన: శ్రీ కె. వి. రమణారెడ్డి. వెల: 3 రూపాయలు, బాలాజీ పబ్లిషర్స్, బజారువీధి, తిరుపతి. (ఆం. ప్ర.)

శ్రీ కె. వి. రమణారెడ్డి లబ్ధ ప్రతిష్ఠులయిన ఆధునిక తెలుగు కవులలో, విమర్శకులలో ఒకరు. వీరి కవితా సంకలనాలు అడవి, భువనఘోష, అంగార వల్లరి ఇంతకు ముందే వచ్చాయి. ఈ 'ఎర్ర పిడికిలి' నాలుగోది.

వీరి పూర్వ సంపుటాలలోని కవితలకూ, ఎర్ర పిడికిలిలోని వానికీ వుపయోగించిన భాషలో, శైలిలో సంపూర్ణమైన మార్పు వుంది. ఇతః పూర్వం అతి సామాన్యమైన మాటలలో చెప్పగల చిన్న విషయాన్ని కూడా సంస్కృత పదాలూ, సమాసాడంబరాలూతో ఎంతో బరువుగా తయారుచేయడం ఆయన అలవాటు. 'అనుకోకుండానే ఆ మాటలు దొర్లిపోతున్నాయి' అన్నారొకమాటు. కాని ఈ కవితలలో నిగ్రహం చూపగలిగేరు, భాషలో. విరసం నిబద్ధత తెచ్చిన మంచి పరిణామంగా దీనిని అభినందిస్తున్నా.

దేశంలోని ప్రజల కష్టాలకు అన్యాయాలకు, అక్రమాలకు తల్లడిల్లే మానవత్వంగల కవి రమణారెడ్డి.

హింసలు ఖైదులు హత్యాకృత్యాల్
హుజుమూ జులుమూ అత్యాచారాల్
నేరం మోపని న్యాయం చెప్పని
నరుల దుర్వ్యథలు నరక దండనలు
ప్రజాతంత్ర శతపత్ర దళాలా ?

—అని పరితపిస్తారు రక్తం కవితలో.

'ఒంటరిపాటులోంచి లోక కుటుంబంలోకి గలగలా సాగుతున్న' పద్మాసదని అభినందించగల అంతర్జాతీయ దృష్టివుంది.

'అనూరాధపురంలోని బుద్ధప్రతిమ కూడా క్రుద్ధరూపం ధరిస్తుంది' సుహాయని లంకలోని

అనంతపస్త్రయువతపై సాగుతున్న హింసాకాండకు వళ్ళు నూరుతారు. వియత్నాంలో అమెరికా సాగిస్తున్న పాశవిక యుద్ధకాండ చూసి ఉత్తప్తులై—

వల్లీకున పట్టపగలు
బందిపోటు జరగడమే
ప్రపంచ జనసమక్షాన
ప్రజావియత్నాంపై జులుమే!
ఊరకున్న ప్రతి ఒకడూ
నేరంలో భాగస్థుడు
చేయీ వాయీ ఎత్తని
చవటైనా 'అన్యాయ'!
ఇది ఖూనీ ఇది చోరీ
ఇది యాంకీ బాహద్దూరీ
అనరేం? మీరనరేం?
అశని ఘోషలిడరేం?

అని ఆక్రోశిస్తారు. మొహంమీద మొహం పెట్టి అడుగుతారు.

ఎత్తుకున్న వస్తువే కవిశైలినీ, కథన రీతినీ నిర్ణయిస్తాయి. ఎర్ర పిడికిళిలో అధికభాగం కవితలు స్వాతంత్ర్యానంతరం పాలకవర్గం ప్రజాక్షేమం పట్టించుకోక పోవడం, దేశసంపదను కొద్దిమంది ధనికులకు కట్టబెడుతూ ప్రజాసామాన్యాన్ని దుర్భరదారిద్ర్యంలో తొక్కేస్తూండడం గురించి అసమ్మతిని పలురూపాలలో కనబరుస్తాయి.

గాంధీజీ బోసినోటి (వరాలుపేసే)
ఫొటోజెనిక్ నవ్వుల్లో
పండిట్జీకోటు బొత్తాం కన్నంలోని
తాజారోజా పువ్వురెక్కల్లో
పటేల్ మోటులాఠీలో
మురార్జీకేటు లూటీలో
టిటికె ట్రిక్కుల్లో
పాక్‌బహిష్కార్ శాస్త్రి పెళ్ళాస్త్రి మోసంలో
ప్రియదర్శిని గాలిరివ్వుల్లో
వెతక్కు అబ్బాయీ, అమ్మాయీ వెతక్కు
స్వరాజ్యానికి అర్థం
స్వాతంత్ర్యం పరమార్థం! (పుట. 13)

—అంటారు. అందుకే...

రాజ్యమంటే నాకు తెలిసిందల్లా
జనం ఇబ్బంది.
రక్షణలేని పూళ్లమీదపడే
అడవిపందుల సిబ్బంది (పుట 29)

అంటూ కటకట పడతాడు కవి.

ఏమిటీ బ్రతుకు? ఎందుకీ నీరసం అని ప్రశ్నించు కొంటాడు అంతలో.

'చేవ ఇంకా మిగిలివుంటే
గండాల సుడిగుండాలకు
ఇష్టంగానే లోబడు!
ఛస్తే రేపటికి రెండు' (పుట 63)

అంటాడు. సుడిగుండాలకు ఇష్టంగానే లోబడే వీరులను 'ఇదే మీకు నా విప్లవాంజలి'— అని దోయిలి ఘటిస్తాడు.

'అచలం' కవిత అటువంటి ఆదర్శం చూపుతున్న కమ్యూనిస్టులకు శ్రీ రమణారెడ్డి సంఘటించిన అంజలి. ఆంధ్ర ప్రతి జిల్లాలోనూ ప్రజాసేవలో, కర్తవ్య నిర్వహణలో ప్రాణాలు పణంగా పెట్టి నిలిచిన వెంకటచలాలు పరశ్శతం!

శ్రీ రమణారెడ్డిగారి కంఠం మనతో వాదిస్తుంది. కోపం తెచ్చుకొంటుంది. మాటల వరద సృష్టిస్తుంది. సవాలు చేస్తుంది. వెక్కిరిస్తుంది. కవ్విస్తుంది రెచ్చగొడుతుంది.

కాని, దానికి ఆవేశమేగాని, సామాజిక అవగాహన తక్కువ. మాటలు పేర్చుకుపోవడంలో వున్న సరదాలో చారిత్రక, రాజకీయ పరిజ్ఞానాన్ని పట్టించుకోము. అసలు ఈ సంకలనమూ, దానిలోని ఇంచుమించు ప్రతి కవితా దానికి సాక్ష్యం.

స్వాహాతంత్రం, కత్తిలా ఖచ్చితంగా చెప్పాలి, శకారుడు—పేర్లు చెప్పూపోవాలంటే ఈ సంకలనం

కావి 37 కవితలలో సగానికి పైగానే చెప్పవలసి వుంటుంది—మొదలైనవానిని విడివిడిగా చదువుతాం. ఆనందించగలం. కారణం మన నిత్యజీవితంలో మనం అనుభవించే భావాల ప్రతిబింబాలే అవి. ఏ ఆగస్టు దినోత్సవమో, స్వాతంత్ర్య దినోత్సవమో సందర్భ పడినప్పుడు, మన నిత్యజీవితం గుర్తువచ్చి — 'ఇదేనా మనం కోరింది'—అని వెనుతిరిగి చూసుకొంటాం. మోసపోయా మనుకుంటాం మన్ను కొట్టుకుంటాం. ఎదుటివాళ్లను తిడతాం వెక్కిరిస్తాం. వెక్కిరించుకొంటాం నవరసాలూ కురిపిస్తాం. అక్కడ కార్యకారణాల స్ఫూర్తి, హేతువాదస్ఫూర్తి వుండదు. ఫర్వాలేదు.

కాని, ఆ క్షణమే మన జీవితానికి గమ్యాన్నీ మార్గాన్నీ నిర్దేశించాలనుకుంటే? ఆ క్షణిక దౌర్బల్యమో, మహోత్తేజమేనో, హేత్వాభాసమో, హేతువాదమూనో తేల్చుకోకుండా ముందుకు అడుగు వేసేయమంటే?

వేరే వేరే చూస్తూ విశేషం అభ్యంతరం చూపకుండా ఆనందించగల కవితలనే 'రాశి' చేసి ముందు పెట్టేసరికి గుణాత్మకమైన మార్పు వస్తుంది. శ్రీ రమణారెడ్డిగారి కవితల సంకలనంలో గమనించవలసిన అంశం అది.

అర్ధరాత్రి సూర్యోదయమైతే
అధికారంచెయి మారింది—

అనే చరణంతో ముగిసిన 'స్వాహాతంత్రం' కవిత రమారమి తొంభయ్యేళ్లపాటు సాగిన జాతీయ స్వాతంత్ర్యోద్యమగతిని అవహేళన చేస్తుంది.

ఆ స్వాతంత్ర్యోద్యమంలో అనేకదశలూ, అంతర్దశలూవున్నాయి. నాయకత్వాలూ, నినాదాలూ మారేయి. చిరస్మరణీయాలూ, సద్యోవిస్మరణీయాలూ అనేక ఘటనలు జరిగేయి. శ్రీ రమణారెడ్డిగారికి అవన్నీతెలుసు. తెలియనిదల్లా చారిత్రక గతిక్రమం! అవహేళనే కాదు కవికి కావలసింది—అవగాహన!

జాతీయోద్యమ లక్షణాల్నీ, లక్ష్యాల్నీ పోరాట రూపాల్నీ, పద్ధతుల్నీ నిర్ణయించేది—ఆ సమయంలో దానిలో పాల్గొంటున్న వర్గాలేవి? దేనిది నాయకత్వం—అన్నదేగాని మన వ్యక్తిగత వాంఛల్నిబట్టి అది జరగదు.

మనదేశంలో — వలసదేశాలన్నింటా కొంచెం పాటుభేదంతో ఇదేస్థితి—జాతీయోద్యమం జాతీయ బూర్జువావర్గం నాయకత్వాన జరిగింది. స్వాతంత్ర్యానికి పూర్వం కార్మికవర్గం ప్రభావం ఆ వుద్యమంమీద ప్రత్యక్షంగా, నిర్ణయాత్మకంగాలేదు కనక స్వాతంత్ర్యనంతరం అధికారం బూర్జువా వర్గం చేతబడింది.

ఈ వర్గం స్వప్రయోజన దృష్టితో, తన మనుగడకోసమే దేశంలో కొన్ని అభివృద్ధులను తెచ్చింది. ఆ అభివృద్ధి గతి ప్రజలందరికీ అవసరమే. కాని, ఆ ప్రగతి తన పిడికిలికి మించి పెరగకుండా చేయడం అధికారంలో వున్న వర్గం స్వభావం. అదే చేస్తూంది.

ఆ పిడికిలిని విప్పించి ప్రగతిని ప్రజలందరకూ అందచేయగల వర్గం వుంది. అదే కార్మిక వర్గం. బూర్జువావర్గ పాలనలో పెరిగిన పరిశ్రమలూ, ప్రాజెక్టులూ ఆ వర్గానికి సంఖ్యాబలం ఇచ్చేయి. అది నిర్మాణంలోనూ బలపడింది.

ఈ ప్రకృతిలోనూ, ప్రపంచంలోనూ, సమాజంలోనూ ప్రతి ఒక్కదానిలో వున్నట్లే మన దేశపు కార్మికవర్గం పెరుగుదలలో కూడ 'బూరుసు' భాగం వుంది.

ఈ కార్మిక వర్గంలో అత్యధికభాగం రైతాంగం నుంచి వచ్చిందీ వ్యవసాయమూ, గ్రామీణ పరిస్థితులూతో సంబంధం వున్నదీను. అందుచేత దానిలో పెట్టీ బూర్జువా భావాల ప్రభావం అధికంగా వుంది. అది చారిత్రక పరిస్థితి.

ఈ ద్వంద్వ స్వభావాన్ని అర్థం చేసుకోవడం అవసరం, ప్రతి మార్క్సిస్టుకూ, లేకపోతే సోషలిజం, కమ్యూనిజం గురించి మనం ఎన్ని చెప్పినా అవి వట్టి ప్రగల్భాలే అవుతాయి. మనకు మిగిలేది పెట్టీ బూర్జువా భావ ప్రవాహంలో కాళ్లు తేలిపోయి, కొట్టుకుపోవడమే శ్రీ రమణారెడ్డిగారిలో జరిగిం

దదే. యౌవనగీతం (పుట 50) చూస్తే ఆయన ఎక్కడున్నదీ అర్థం అవుతుంది. దానిలో—

కపాలాలతో కందుక
క్రీడలాడగల కఠినత
నెత్తురుతో అత్తరు
స్నానంచేసే క్రౌర్యపరత
హింసలకూ హత్యలకూ
హడలిపోని దారుణ్యం
యౌవనానికి అభివాదం

అంటూ యువజనులలో ఆయన అభిలషించే భావాలను పేర్కొన్నారు. హిట్లరు జర్మను యువకుల నుంచి కోరిన ఈ గుణాలు శ్రీ రమణారెడ్డిగారికి ఎందుకు వచ్చేయి?

బూర్జువావర్గం తన సంచులకీ, స్థానాలకీ ముప్పంవస్తే ఎటువంటి హింసలకేనా సిద్ధపడుతుందే కాని, నిత్యజీవితంలో ప్రత్యక్ష హింసాంతి కోరదు. ఏమంటే అల కల్లోలస్థితి దేశంలోవుంటే ఆ వర్గం ఇష్టపడుతుంది. (ప్రపంచకల్లోలం దానికి ఫరవాలేదు. లాభకరమేకూడ) అందుచేతనే 'అహింసను' బోధిస్తుంది. ఆ వర్గానికి పాలన పద్ధతులలోగల అనుభవమూ అధికారమూ సమాజంలో దాని సంఖ్యాల్పత్వాన్ని కూడ దీస్తాయి. అందుచేత వారు క్రౌర్యానికి ఈ విధంగా పట్టం కట్టనక్కర్లేదు. కట్టరు కూడా.

కార్మికవర్గం, దానికితోడుగా రాగలప్రజలూ సమాజంలో అత్యధిక భాగం. అధికారం స్వాధీనపరచుకొవడానికి వారికి కావలసింది నిర్మాణం. అధికారం పట్టుకొన్నాక దానికి సంఖ్యాబలం, నిర్మాణబలం, అధికారబలం కూడా వుంటాయి. అందుచేత హింస దానికి నియమం కాదు. కాని, అవసరం వచ్చినప్పుడు, దాని చేతిలోని అధికారాన్ని లాగివేసే ప్రయత్నాన్ని విరోధించేందుకు హింసాకాండకు వెనుదీయదు.

ఈ సందర్భంలో ఒక చిన్న వుదాహరణ నివ్వాలనిపిస్తూంది.

1919 లో సోవియట్ ప్రభుత్వాన్ని కూలదోయడానికై 'మిత్ర'రాజ్యాల ధన వస్తు సహాయంతో డెనికిన్ అనే జనరల్ యుక్రేన్‌లో విశేష భాగాలను ఆక్రమించేడు. డాన్‌బాస్‌లోని పరిశ్రమల కార్మికుల మీద క్రూరహత్యాకాండ సాగిస్తున్నాడు. అతని సేనలను బుడెన్నీ అశ్వీక దళాలు ఎదుర్కొంటున్నాయి.

డిసెంబరు 7 న పోక్రోవ్కా అనే చోట మామన్‌తోవ్ అనే జనరల్ సైన్యాల్ని రెడర్మీ 4, 6 డివిజన్లు వెనకముందులనుంచి నొక్కేసేయి.

యుద్ధానంతరం స్టాలిన్ యుద్ధరంగంలోకి వచ్చేడు. మైదానంలో, గుట్టలమీద మనుష్యులు, గుర్రాల కళేబరాలు పరిచినట్లున్నాయి.

'స్టాలిన్ చూడలేక పోయాడు. 'సెమ్యాన్ మిహైలోవిచ్! చాల భయంకరంగా వుంది. ఇంత నష్టం కలగకుండా చూడలేమూ? అవునులే. మన తప్పు మాత్రం ఏం వుంది?'— అంటూ ఆలోచనలో పడిపోయేడు.'

—అంటూ బుడెన్నీ వ్రాసేడు. హింసయెడ కమ్యూనిస్టుల, కార్మిక వర్గాల ఆచరణలు, ఆలోచనలూ అవి.

ఇంక ఇటువంటి హింసారతి పెట్టీ బూర్జువా అవలక్షణాలలో ఒకటి. ఆలోచనా శూన్యత, ఆవేశం, తక్షణ ఫలితాకాంక్ష, అసహనం, ఏ పనికేనా సిద్ధం కావడం, అంతలో నీళ్లు కారిపోవడం, పలాయనం, విరక్తి, ఇవన్నీ మనకి ప్రధానంగా కనిపించేది ఆ వర్గంలోనే.

కార్మిక విప్లవంలో గాని, కార్మిక పాలనల్లోగాని దురంత చర్యలు జరిగితే (నిరుద్దేశంగా) పెట్టీ బూర్జువా ఔత్సాహిక హింసారతుల మూలంగానే జరుగుతాయనడం సత్యదూరం కాదు. దానికి బోలెడు చారిత్రకోదాహరణ లున్నాయి.

శ్రీ రమణారెడ్డిగారిని ఎవరో మాట్లాడడం తగ్గించేరన్నారట. దానిమీద 'కుట్టకయున్న వృశ్చికము కుమ్మరిపుర్వని యందురే కదా!' అన్న భట్టుమూర్తి ఫక్కీలో తొడ చరిచి సవాలుచేస్తూ 'ప్రభా

చక్రం' వ్రాసేరు. అల్లాగే ఎవరో ఏదో చేసేరనో, చేయలేదనో వేళాకోళం చేస్తూ స్వేచ్ఛాజీవి, అవాచ్యుడు వంటివి వ్రాసేరు. ఇటువంటి కృతులు చదవడానికి బాగానే వుంటాయి, వినేవాళ్లకి ఆనందమూ కలగొచ్చు. అయితే వ్రాసేవాళ్లు చవకవుతారు. మరేం లేదు. వానిలో ఆత్మస్తుతీ, పరనిందా బహుళంగా వుంటాయి. ఏదో తాత్కాలికాక్రోశంతో రాసినా అవి ఇటువంటి సంకలనాల కెక్కడం అభిలషణీయం కాదు. చూడండి—

ప్రభాచక్రంలో— 'కావాలా కనిపించేదానికి కూడా ప్రమాణం?'— అని తనను చిన్న చేసినవారిని ఈసడిస్తూ,

యోజనం దూరాన
జనంగుండెలో మెదిలే
గర్జనం
చెవుల వినబడేదా మీకు
ఒకరికి కూడా?
యోచనా పరులమంటారు మళ్లీ!

— అని ధూత్కరించేరు.

దుర్గర్వానికి లోబడి దురపిల్లుతున్న
ఈవిశాల భూదేవిని
చెర విడిపించడానికి
దేవమాతనై వస్తున్నా

—నంటూ తమ విశ్వరూపం ప్రదర్శించే సంకల్పం దీక్షా కనబరిచేరు.

కాని 'కనిపించేదానికి ప్రమాణం' ఆయనే కానలేకపోవడం శ్రీలంకలో మనకు కనిపిస్తూంది చూడండి.

శ్రీలంకలో సిరిమావో ప్రభుత్వానికి అండగా—

'సింహళ విమానాశ్రయంలో భారత హెలికాప్టర్లు మూగుతున్నై—'

— బాగానేవుంది. దానిని ప్రభుత్వమే అంగీకరించింది. కాని దానివెంటనే

'హిందూ మహాసముద్రానికి
సోవియట్ యుద్ధనౌకలు
పహరాయిస్తున్నై'

అంటూ వ్రాసిన ప్రమాణరహిత ప్రవచనంలోనే ఆయన బయటపడి పోతున్నారు.

హిందూ మహాసముద్రంలో సోవియటు యుద్ధనౌకల గస్తీవార్త అమెరికన్ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ దుశ్చేష్టితాలను కప్పిపుచ్చుకొనేందుకు కల్పించిన సాకు. ఆసియా ఆఫ్రికా దేశాలలో జ్వాలంతం అవుతున్న జాతీయ విముక్తి వుద్యమాలను నిగ్రహించేందుకూ, వర్ధమాన దేశాలను పక్కబెదురుతో పెట్టడానికీ వారు దక్షిణాఫ్రికాలోని సైమన్స్‌టౌన్, హిందూ మహాసముద్రంలోని దీగో— గార్షియా, ఆస్ట్రేలియాలో కాక్‌బర్న్‌లను పెద్ద నౌకా విమానాశ్రయాలనుగా నిర్మిస్తున్నారు. దానిని సమర్థించుకొనేందుకు సోవియటు బూచిచూపేరు. అది అసత్యమని అమెరికన్, బ్రిటిష్ పత్రికల విలేకరులనే దానికి వుదాహరణల కివ్వవచ్చు.

అయితే వానిని నమ్మము—అనడానికి రమణారెడ్డిగారి కధికారంవుంది. కాక, నమ్ముతున్నామంటూనే, ఆ దుష్క్రియలో సోవియటుకీ భాగం వుందనీ అనవచ్చుకూడా. ఏమంటే సోవియటు సోషల్ సామ్రాజ్యవాద దేశమని వారు వాదిస్తున్నదే కదా. అంటే ఏమిటని అడగనేవద్దు. ఆ ప్రశ్న వదిలేసి ఇంకోప్రశ్న వెయ్యాలిసుంటుంది.

సోవియటు నౌకల పహరా ఎవరిని కాపాడడానికి?

'యస్ వో యస్ పంపిందా సిరిమావో.' వెనువెంటనే మరో ప్రశ్న.

'ఎవరినుంచి కాపాడడానికి?'

మావో చైనానుంచా? జనతా విముక్తి పెరమున తిరుగుబాటును చైనా ఖండించిందే!

ఒకవేళ ఆమోదించిందన్నా ఇంత దూరానవున్న ఒక స్వతంత్ర రాజ్యంలో చేయి దూర్చి నిగ్రహించే నౌకాబలం వుందా చైనాకు? ఒకవేళ వుందన్నా ఆ

విధంగా సాయపడే స్వభావమా? తన సరిహద్దులలోకి వచ్చి బాంబులు వేస్తే తప్ప తన సేనలు యుద్ధానికి దిగవని హామీ యిచ్చి, వియత్నామ్‌లో అమెరికాను 'యథేచ్ఛం విహార వృషభరాజ!' అని సూచించి వది లేసేరే! అందులోనూ శ్రీ లంకకైనా హద్దుల్లో కూడా లేము కద!

మన ప్రశ్న మిగిలే పోయింది. సూటిగా సామ్రాజ్యవాదుల్ని చూపుతూంది. పెరమునా తిరుగుబాటు సామ్రాజ్యవాదులు కవ్వించినదనీ, వారే ధనం, ఆయుధాలూ అందచేసేరనీ, ఇప్పుడు బయటపడింది. అసంతృప్తులయిన సింహళ యువత ఆ ద్రోహానికి బలి అయింది. అసలు ద్రోహులు రంగంలో ప్రవేశించకుండా సోవియటు యుద్ధనౌకలు అడ్డుపడ్డాయని తప్పు పడుతున్నారా? రమణారెడ్డిగారు?

అందుకే మాటలు అల్లుకుపోయే హుషారులో శ్రీ రమణారెడ్డి వానివలన వచ్చే అనర్థాలను గమనించరన్నాను!

ఇది రాజకీయ సమస్యలలోనే కాదు. కవిత్వ ఔచిత్యం సందర్భంలో కూడా ఈ లోపం కనిపిస్తుంది. ఆత్మచిత్రం కవితలో ఒక చరణం చూడండి.

చేత ఇంకా నీలో మిగిలివుంటే
గండాల సుడిగుండాలకు
ఇష్టంగానే లోబడు
ఛస్తే రేపటికి రెండు!

ఇక్కడవారు చేవవుండ గోరింది 'తారలను తలదాల్చే శిఖరం' లా బతికేందుకు. ఆ ప్రయత్నంలో చావు రావచ్చు. కాని అది లక్ష్యంకాదు. దానిని తలపుకు రానీ పనిలేదు: అక్కడ చెప్పవలసింది 'సుడిగుండాలకు అడ్డుపడ' మని. లోబడితే వారు చెప్పినలెక్క. రేపటికి రెండు. అందుకు మన ప్రోత్సాహం అవసరంలేదు.

ఇంకా ఎన్నో చూపవలసినవి. వున్నాయి. కాని, ఇక్కడికే దీర్ఘమయి పోయింది కవిగా, కవి తుడుగా శ్రీ రమణారెడ్డియెడ గౌరవాభిమానాలకు గుర్తుగా, వారితో గొంతుకలిపి, వారి యూ సంకలనంలోనివే ఈ చరణాలను గుర్తుచేస్తాను:

నిప్పుమీద నివురుప్పున వూదీ,
నిజాన్ని జ్వలింప చెయ్యాలయ్యా!
....... ............... . ...... ..
...... ............. . .. .........
పాలిన పువ్వే కెంపెక్కేలా
పౌరుషం గుండె కెగదన్నేలా
క్రమగతిలో, నిర్మాణరీతిలో
శ్రామిక విప్లవ మెదిగొచ్చేలా
రంగు చిక్కబడి హత్తుకోనేలా
రక్తమెత్రబడి రగుల్కొనేలా
రచనారీతి రహించాలయ్యా!
అయ్యా! కవివర్యా!
భయ్యా! కవివర్యా!

(కత్తుల చక్రంనుంచి) (పుటలు 7—8)

'అవంతి.'

# గోదా గ్రంథమాలవారి రెండు గ్రంథాలు

## 1. బిడాల మోక్షము

(రచయిత: సంగీత సాహిత్య కళానిధి—శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు, క్రౌన్ 32 పేజీలు. వెల రూ. 1-25. ప్రాప్తిస్థానం— మునునూరు, (కృష్ణాజిల్లా)లోని శ్రీ గోదా గ్రంథమాల)

ఇది అధిక్షేప కావ్యంగా కూర్చబడిన పద్య కావ్యం. మహావిద్వాంసునితో తాను సమానుడని భావిస్తూ ఉండిన ఒక మూర్ఖుడు ఆయన అనుచరుల మీద తిరగబడి, గొప్ప పరాభవాన్ని పొంది, ఆ మహా పండితుని కాళ్లపై పడి క్షమాపణ వేడుకొన్న వృత్తాంతం ఇందులో ధ్వనిస్తుంది.

ఇందలి కథాంశం ఇది—

ఒక అడవిలో మృగాలన్నీ చేరి, సింహాన్ని మృగరాజ్యానికి సార్వభౌముణ్నిగా నిర్ణయించి సేవిస్తూ

ఉండినవి. ఒకప్పుడు ఒక మార్జాలం అక్కడికి వలస వచ్చి, సింహం ఉన్న గుహలోనికి వెళ్లబోగా, గుహ ద్వారంవద్ద కావలియున్న భల్లూకం అడ్డుకొని, దూరంగా పొమ్మని గద్దించింది. మృగరాజైన సింహం చూస్తే ప్రాణాలు దక్కవన్నది. పిల్లికి దానిపై కోపం వచ్చినా లోలోపల అణచుకొని, ఆ గుహకంటె ఎత్తయిన ఒక చెట్టుతొర్రను నివాసం చేసుకుని, 'తాను మృగరాజు ఎందుకు కాకూడదు?' అనే భావంతో ఒక ఉన్మత్తపత్రం (ఉమ్మెత్తాకు) మీద 'మృగరాజు' అని వ్రాసి దాన్ని మెడలో కట్టుకుని తిరుగుతూ తాను మృగరాజునని ప్రచారం చేసింది. దీని పిచ్చిచేష్టకు నవ్వుకుంటూ మిగిలిన మృగాలు 'అనుకుంటే అనుకోనీ' అని ఏమీ అనకుండా మౌనం వహించాయి ఆ మౌనాన్ని ఆమోదంగా భావించి ఆ బిడాలం గర్వంతో సంచరించ సాగింది. దీని గర్వాన్ని చూచి సహించక ఒక సారమేయం (కుక్క) పిల్లి మెడలోని 'మృగరాజ' బిరుద పత్రాన్ని చించివేసింది. ఈ పిల్లికి మంత్రిగా నటిస్తున్న ఒక నక్క బిరుదం శాశ్వతంగా ఉండడానికి సలహా చెప్పి అనుమతిని పొంది. బిరుదాక్షరాలు స్పష్టంగా కానవచ్చేటట్లు అక్షరాకారంతో వీపుమీద చురకలు వేసింది. కీర్తిని కోరే పిల్లి, ఆ వాతలబాధను సహించవలసి వచ్చింది. తర్వాత ఈ మూర్ఖ బిడాలం తన మైత్రిని ప్రకటించి, ఎలుకలను తన వెంట తిప్పుకున్నది. దీని మీద విశ్వాసం లేని మూషకాలు ముఖస్తుతి చేసి దాని మెడలో గంటను కట్టించ గలిగాయి. తర్వాత వాటికి దానివల్ల భయం పూర్తిగా నశించింది.

ఒకసారి ఒక గజరాజు ఈ మార్జాలం ఉన్న వృక్షంవద్దకు రాగా, ఇది కోపించి ఆ ఏనుగుపై తిరగబడింది! తన కుంభస్థలంపైకి ఎక్కిన పిల్లిని ఏనుగు తొండంతో పట్టుకోగా, అది యెట్లో తప్పించుకుని చెట్టెక్కినది. ఏనుగు ఆ చెట్టును మొదలంట పెరికివేసింది. పిల్లి తప్పించుకుని పారిపోయి ఒక పొదలో దూరింది. కోపంతో ఉన్న ఏనుగు దాన్ని వెంబడించి, అక్కడికి వెళ్లింది మెడలోని గంట ఒక మల్లె తీగకు చిక్కుకొన్నందున పిల్లి ఏనుగుకు చిక్కక తప్పిందికాదు. గజరాజు దాన్ని చంపడానికి ఇష్టపడక తొండంతో పట్టుకునే అడవి అంతా తిప్పింది. పిల్లి ప్రాణ రక్షణార్థమై పెద్దగా అరుస్తూ, మృగరాజైన సింహాన్ని శరణువేడింది. అప్పటికి ఏనుగు సింహం వుండే గుహదగ్గరకు రావడం తటస్థించింది. సింహానికి ఏనుగును చంపగల సామర్థ్యం ఉన్నప్పటికీ, పిల్లిని కాపాడవలెనని కోరి గజరాజువల దాన్ని తప్పించి, బుద్ధిచెప్పి పంపివేసింది. అలనాడు మొసలి బారిపడిన గజేంద్రునకు విష్ణుదేవుని మూలంగా మోక్షం (ముక్తి) లభించింది. ఇప్పుడు గజేంద్రుని బారిపడిన పిల్లికి మృగరాజు మూలంగా మోక్షం (విడుదల) లభించింది.

ఎవ్వరినో మనస్సులో పెట్టుకొని, వారిని అధిక్షేపిస్తూ ఇది వ్రాయబడినట్లున్నది. ఇట్టిస్థితిలో కొన్ని సంఘటనలు అస్వాభావికంగా ఉండడం సహజం. పిల్లి మృగరాజు ననుకోవడం, నక్కచేత వాతలు పెట్టించుకోవడం, మెడలో గంట కట్టించుకోవడం, ఏనుగుపైకి తిరగబడడం అస్వాభావికంగానే ఉన్నవి. రచయిత కవిత ధారావాహికంగా సాగింది. పూర్వం కవుల అనుకరణలున్నూ కానవస్తున్నవి.

'అతఁడు శైలము నెక్కు నితఁడు సాలము నెక్కు
నెలమి నాతనికన్న నితఁడె ఘనుఁడు'

అనే పద్యం

'అతఁడు శూలముఁ ద్రిప్పు నితఁడు వాలముఁ ద్రిప్పు
నెలమి నాతనికంటె నితఁడె ఘనుఁడు'

అనే ప్రసిద్ధ పద్యానికి అనుకరణం.

'నానామూషక సంతతుల్ వనములోనన్, ఎవ్వనిచే రహిల్లు వనము, బలమొక్కింతయు లేదు, అల భూభృత్కుహరంబులో, పులికిం జెప్పఁగఁబోఁడు, తన వెంటం బులి దావివెంట' అనే పద్యాలు (పుటలు 28, 29) పోతన్నగారి భాగవతంలోని 'నానానేకపయూథముల్ వనములోనన్, ఎవ్వనిచే జనించు జగమ్ము, లావొక్కింతయు లేదు, అలవైకుంఠ పురంబులో, సిరికిం జెప్పఁడు, తన వెంటన్ సిరి లచ్చివెంట' అనే

ప్రసిద్ధపద్యాల అడుగుజాడల్లో నడిచినవే! రచన ఇంపుగా సాగినా 'హర్షమునకు లింగము గాగన్' (పుట. 10—హర్షమునకు చిహ్నము గాగన్—అనుటకు.) 'ఏంగి క్రిందికి' (పుట. 10—క్రిందికి దిగి—అనుటకు) 'నరమా తనయుండు' (పు 11—కుక్క) మార్జాల మాణిక్యము' (పు. 12—మార్జాలోత్తము డనుటకు) 'ప్రతోషకరమ్ము' (పు. 17 — సంతోషకరమ్ము) 'సపత్ని వాత్సు హార్ద ప్రవర్తనా తుల్యమ్ములు' (పు 19—సవతితల్లి ప్రేమవంటివి) 'సింహఫాల వలయమ్ము' (పు. 21—సింహ లలాట కంకణము) వంటివి ఎబ్బెట్టుగా కానవస్తున్నవి.

సరసకవులైన కృష్ణమాచార్యులుగారు తమ మధురకవితకు అనుగుణమైన గ్రంథాలు రచిస్తే వాఙ్మయానికి ఎక్కువ ఉపకారం చేసినవా రౌతారు.

## 2. ద్వాదశ సూరి చరిత్ర

(రచయిత: విద్యావిశారద, ఉపనిషదుద్యాన కోకిల శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులు, క్రౌను సైజు, 32+469 పేజీలు వెల రూ. 12 ప్రాప్తిస్థానం—శ్రీ గోదా గ్రంథమాల, మునునూరు, కృష్ణాజిల్లా.)

విశిష్టాద్వైత మతానికి చెందిన పరమ భక్తాగ్రగణ్యులలో పన్నిద్దరాళ్వారులు (పన్నెండుగురు దివ్యసూరులు) ప్రథమ గణ్యులు. వారు మహాశక్తి సంపన్నులే కాక భగవదనుగ్రహాన్ని పొంది తమ రచనల మూలంగా భక్తలోకాన్ని కైవసం చేసుకున్నారు. వారు—పొయ్‌గై యాళ్వారు, భూతత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశై యాళ్వారు, నమ్మాళ్వారు, పెరియాళ్వారు, మధురకవియాళ్వారు, గోదాదేవి, తిరుమంగయాళ్వారు, తొండరడిప్పొడియాళ్వారు, తిరుప్పాణాళ్వారు కులశేఖరాళ్వారు—అనువారు. వీరి జీవితాలను గురించీ, కవితా వైభవాన్ని గురించీ, తపస్సాధనను గురించీ తెలిసినవారు చాలా తక్కువ. (పన్నిద్దరాళ్వార్లు ఎవరో కూడా తెలియనివారు ఉండవచ్చు.) ఈ మహనీయుల జీవిత, కవితా, తపస్సాధనలను గురించి సోదాహరణంగా, విపులంగా భక్తలోకానికి తెలియజేయవలె ననే సంకల్పంతో రచయిత దీన్ని రచించారు.

ఇట్టి గ్రంథాలను రచించడానికి కేవలం సంస్కృతాంధ్రాలలో పాండిత్యం, రచనా పాటవం మాత్రం చాలవు. మత సంప్రదాయాలు సమగ్రంగా తెలిసి వుండాలి. విశిష్టాద్వైతాన్ని గురించి తెలుసుకోవాలంటే ద్రావిడ ప్రబంధాలను క్షుణ్ణంగా అభ్యసించాలి. ఆ భాషలో మంచి ప్రవేశం ఉండాలి. విశేషించి గురుశుశ్రూష కావాలి. ఈ రచయితకు ఇవన్నీ అలవడినవి. సంస్కృతాంధ్ర ద్రావిడ భాషా పాండిత్యంతోపాటు వీరికి ఒరియా, బెంగాలీ, హిందీ భాషల్లోకూడా ప్రవేశం ఉన్నది వీరు తమ మతాభినివేశానికీ, పాండిత్యానికీ ఫలంగా ఈ గ్రంథాన్ని రచించినట్లు కానవస్తున్నది.

భాగద్వయాత్మకమైన యీ గ్రంథం తొలి భాగంలో పన్నిద్దరాళ్వారుల చరిత్ర ఉన్నది. రెండవ భాగం శ్రీమద్రామనుజుల చరిత్రమ సమగ్రంగా తెలియజేస్తున్నది. ఆ చరిత్రయే రెండువందల పుటలకు పైగా ఉన్నది. గ్రంథ రచనలో తమకు సంస్కృతంలోని 'ప్రపన్నామృతం', తెలుగులోని, ఆచార్యసూక్తి ముక్తావళి, పరమయోగి విలాసము,' తమిళంలోని 'గురుపరంపరా ప్రభావం, దివ్య ప్రబంధసారం' ముఖ్యంగా ఉపకరించినట్లు రచయిత తెలియజేస్తున్నారు. ప్రామాణిక గ్రంథాలను అనుసరించి రచింపబడిన యీ గ్రంథం పరమోపాదేయమై ఉండగలదని చెప్పవలసి ఉన్నది.

విపులంగా ఉన్న రామానుజుల చరిత్రను తెలిపేటప్పుడు ఆళ్వార్ల కంటెనూ, యతిరాజు కంటెనూ ఇతరులైనా సుప్రసిద్ధులైన యామునాచార్యులు, మహాపూర్ణులు, కాంచీపూర్ణులు మున్నగువారి చరిత్రలు కూడా ఇవ్వబడినవి. అందువల్ల ఇది దివ్యసూరు లందరి చరిత్రా అని చెప్పవచ్చును.

దీనికి 'తిలకం' దిద్దిన మధురకవి శ్రీ కాకాని నరసింహారావు నిసర్గరమణీయములైన పదబంధముల తోను, జానుతెనుంగు నుడికారముల సొంపుతోను

సిందలి గద్యము హృద్యమై, సహృదయుల వల రించుచున్నది' అంటున్నారు 'హరి నీరాజనం' పట్టిన వేముగంటి వరసింహాచార్యులుగారు 'ఈ కృతి తెలుగు భారతికి అమూల్యమైన రత్నాలంకృతియై శాశ్వత ప్రతిష్ఠను సాధించు'వని నిస్సందేహంగా చెప్పుతున్నారు. వీరి ప్రశంసలు కేవలం స్తుతి రూపాలని అనుకోలేము.

విశిష్టాద్వైతమత ప్రవర్తకుల చరిత్రను తెలుసుకొనదలచినవారు దీనిని తప్పకుండా చదువవలసి ఉన్నది.

— "ఆంగీరస."

## వంగ సాహిత్య చరిత్ర

(ఆంగ్లమూలం. సుకుమార్ సేన్. తెనుగు అనువాదం. కొత్తపల్లి వీరభద్రరావు. పుటలు డెమ్మీ 380 వెల : పది రూపాయలు. ప్రతులకు సాహిత్య అకాడెమీ. రవీంద్రభవన్, న్యూఢిల్లీ—1.

మన దేశంలో ఆయా ప్రాంతాల భాషల సాహిత్య చరిత్రలు మిగిలిన ప్రాంతాలవారికి అంతగా సన్నిహితంగా తెలియవనే చెప్పాలి. ఈ లోపం తీర్చడానికే సాహిత్య అకాడెమీవారు అస్సామీ, ఒరియా మొదలయిన కొన్ని భాషల సాహిత్య చరిత్రలు ప్రముఖులచేత వ్రాయించి ప్రచురించారు. ఆ ప్రయత్నం ఫలితమే ఈ గ్రంథము.

మన తెనుగు వారికి చాలా కాలంనించే కొద్దిగానో, గొప్పగానో వంగ సాహిత్యంతో క్రొంత పరిచయం ఏర్పడింది ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలతో బాటు మరికొందరు అనువాదకులు ఈ పరిచయం కలిగించారు. మనదేశంలో బ్రహ్మసమాజ ప్రచారం కూడా వంగ బ్రాహ్మ సమాజికుల ప్రచారంతో ముడిపడింది.

మన భాషలన్నింటికన్న ముమ్ముందుగా వంగ భాషకే ఆంగ్ల సాహిత్యంతో సన్నిహిత పరిచయం కలిగింది. ఇందువల్లనే మిగిలిన భాషలన్నింటికన్న ముమ్ముందుగా వంగ భాషలోనే సర్వతో ముఖమయిన సారస్వత పునరుజ్జీవనం ప్రారంభమయింది.

శ్రీ సుకుమార్ సేన్ ఈ సాహిత్య చరిత్ర అత్యంత ప్రాచీన వంగభాషా లిపుల పరిణామ చరిత్రతో ప్రారంభించారు. రవీంద్రకవి 1941 లో అస్తమించారు. ఈ చరిత్రకూ అదే అవధితో ముగుస్తుంది. వంగ సాహిత్యం వివిధ శాఖలలో విస్తారంగా వ్యాపించింది. ఆ చరిత్ర అంతా 380 పుటలలో వివరించడం చాలా కష్ట సాధ్యమయిన పని. కనక ఆయన సంగ్రహంగానే ఆయా యుగాల చరిత్ర వివరించారు.

దీనిలో బంకిమచంద్ర చటర్జీ, రమేశ చంద్ర దత్, శరచ్చంద్ర చటర్జీ, కాజీనజ్రుల్ ఇస్లామ్, రాజా రామమోహన్‌రాయ్. ఈశ్వరచంద్ర విద్యాసాగరుల చరిత్రలు, వారి సాహిత్య వ్యాసంగాలు కొంత సంగ్రహంగానే కనిపిస్తాయి. వీరందరికన్న సమున్నత శిఖరం వంటి రవీంద్రకవికి మాత్రం వేరుగా ఒక అధ్యాయం ప్రత్యేకించారు.

అనువాదకుల భాష చాలా సరళంగా, సహజంగా సాగిపోయింది. కాని ఈ గ్రంథానికి ప్రవేశిక రచించిన నెహ్రూజా పండితుని భాష అనువాదంలో మాత్రం అక్కడక్కడ పట్టివేసినట్టు కొంత నుడికారం లోపించినట్టు స్ఫురిస్తుంది.

వంగభాషా సాహిత్యాభిమానులకే వంగ సాహిత్య చరిత్ర చక్కని ప్రవేశికగా ఉపకరించగలదు.

—శాస్త్రి



# గ్రంథ స్వీకారము

## సమైక్యవాణి

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, కృష్ణాజిల్లాశాఖ, విజయవాడ—4; వెల రు. 1—00.

## పంచదశీ

(సంస్కృతము)

(వేఙ్కటేశ స్తవః) పుటలు 16. రచయితా: పండిత సత్యనారాయణ చౌదరి, మూల్యమ్. రూ. 0—25. ప్రాప్తిస్థానం: రచయిత పేర, రిటైర్డు లెక్చరర్, నిడుబ్రోలు.

## దశమ పుష్పం—హితోపదేశము

పుటలు 116. మూల్యం 75 పైసలు రచయిత, ప్రకాశకులు: విమ్మరాజు చినవెంకటేశ్వర్లు, జీవరక్షణ ప్రచారక గ్రంథమాల, అనంతవరం, (వయా) చిలకలూరిపేట, ప్రకాశం జిల్లా.

## భజగోవింద స్తోత్రము

(మోహముద్గరము)

ఆంధ్రానువాదము : విద్వాన్ కలవకుంట కృష్ణమాచార్య, వెల : 25 పైసలు, పుటలు 32. ప్రతులకు : భక్తియోగ సాధన సమితి, మెట్టుపల్లి, కరీంనగరు జిల్లా.

## రమ్యోక్తి రత్నావళి

మూట పన్నెండు పద్యములతో కూడిన చిన్న కావ్యము. ఇందులో కొన్ని బాలురకు, కొన్ని పెద్దలకూ ఉద్దేశించి వ్రాయబడిన పద్యములు. మూల్యము: 1—00, 46 పుటలు, రచయిత : మైలవరపు సుబ్రహ్మణ్యం, ప్రకాశకులు : ఆధ్యాత్మ ప్రచార సంఘం రాజమండ్రి—1.

## కోరుకొండ శ్రీ నృసింహ స్తోత్రము

రచన : మైలవరపు సుబ్రహ్మణ్యము, పుటలు 28, అమూల్యము ప్రకాశనము: మైలవరపు వెంకటరమణ, హరేరామ నగరం, కోరుకొండ (తూ॥ గో॥ జిల్లా.)

## శ్రీ కృష్ణగీతా

(విభూతి యోగోక్త అష్టోత్తర శతనామావళీ సహిత ఆత్మ ప్రబోధము) మూల్యము 4-00. 150 పుటలు. రచన: కాశావజ్ఝల రామకోటి శాస్త్రి ప్రధానాంధ్ర పండితులు (రిటైర్డు) మార్కాపురము, ఒంగోలు జిల్లా (ఆంధ్రప్రదేశ్.)

## శ్రీరామ రక్షాస్తోత్ర సహిత

శ్రీరామనామ మహిమమ్

రచనము—సంకలనము : భాషాభూషణ బూదూరు రామానుజులురెడ్డి, అమూల్యము : పుటలు 20 ప్రతులకు : భాషాభూషణ బూదూరు రామానుజులు రెడ్డి, గాంధీరోడ్డు, రెండవవీధి, తిరుత్తణి, చెంగల్పట్టుజిల్లా (తమిళనాడు)

## శ్రీ రాఘవస్తవము

24 పుటలుగల పద్యకావ్యం

రచన : పురాణపండ సత్యనారాయణమూర్తి వెల : 25 పైసలు, ప్రకాశకులు : పురాణపండ సీతారామయ్య, రంగాపురం, సమనసపోస్టు, అమలాపురం తాలూకా, తూ॥ గో॥ జిల్లా.

## మృత్యుంజయము

(చిన్ని కావ్యము)

మూల్యము: 1—00, పుటలు 32, రచన: యం. వి. ఆర్. కృష్ణశర్మ, ప్రతులకు: ప్రాచీన

గ్రంథమండలి, 12 మెట్టు స్ట్రీటు, తిరువాన్మియూరు, మద్రాసు లేక రవి స్టోర్సు, బ్రాడీపేట, గుంటూరు.

## భక్త శబరి

(భక్తశబరి, సీతా స్వయంవరం—ఖండ కావ్యములు) పుటలు 22 మూల్యం: ఒక రూపాయి, రచన: మేకా సుధాకరరావు, మేకావారి వీధి, పిఠాపురం (తూ॥ గో॥ జిల్లా.)

## సరస్వతీ నిలయం

(పిల్లల నాటికలు)

రచన: దోనేపూడి రాజారావు, పుటలు 59 వెల. రూ. 1-75 ప్రతులకు: వాహినీ ప్రచురణాలయం, విజయవాడ– 2.

## శ్రీరామనామ మహిమ

పుటలు 20, అమూల్యం; సంకలనకర్త: సి. రాధాకృష్ణమూర్తి, ఆధ్యాత్మ ప్రచారక సంఘము, రాజమండ్రి—1.

## సామ్రాట్ జయచంద్ర

(ఆరు అంకముల నాటకము)

రచన : కవికోకిల ఘట్టరాజు సత్యనారాయణ శర్మ వెల: రు. 3/ పుటలు 84, ప్రకాశకులు : హనుమ వివాహం ప్రచురణలు, రైలుపేట, గుంటూరు—1.

## విమలానంద భారతి

సాహిత్య మాసపత్రిక, మే మాస సంచిక మా కార్యాలయమునకు చేరింది. విడిప్రతి : 50 పైసలు, ప్రతులకు : రామా నగరము. ఆంధ్రరత్న రోడ్డు. విజయవాడ–3.

## శ్రీయతి రాజీయము

(కావ్యగుచ్ఛము)

ప్రథమ, ద్వితీయ భాగములు, ఒక్కొక దాని వెల : 3/ రూ. ఆంధ్రీకర్త : విద్వాన్ కుంటిమద్ది శేషశర్మ, ప్రథమ భాగము 112 పుటలు, ద్వితీయ భాగము 116 పుటలు. ప్రతులకు : శ్రీ కుంటిమద్ది శేషశర్మ, 2–228, 4 వ అడ్డరోడ్డు. 2 వ అడ్డరోడ్డు, అనంతపురము, ఆంధ్రప్రదేశ్.

## హరే రామ హరే కృష్ణ

పుటలు : 8, 25 పైసలు బిళ్లలు పంపిన వారికి పుస్తకం ఉచితంగా పంపబడును.

## శ్రీ లక్ష్మీ నృసింహ స్తోత్రములు

(15 పైసలు బిళ్లలు పంపినవారికి పుస్తకము ఉచితముగా పంపబడును) ప్రతులకు: భక్త ప్రబోధ మండలి. హరేరామ నగర్. కోరుకొండ, (తూ॥ గో॥ జిల్లా)

## స వ ర ణ

'కాకతీయులు-దేవత' జూన్ 1973 'భారతి' సంచికలో వ్యాసమున పొరపాటున వేరు వ్యాసమునకు చెందిన ఫోటోలు ప్రచురింపబడినందుకు క్షంతవ్యుడను. - ఎర్మ.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Radhakrishna.